ఓం

శ్రీ సద్గురుభ్యోనమ:

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దర్పులు -1వ భాగము

రచయిత : శ్రీమత్‌ద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు

వ్యాఖ్యాత : శ్రీ విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి



పరిపూర్ణ దర్శనాచార్య సదానంద

శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు

వీరి ధర్మపత్ని శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గారు

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరూపకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దర్పులు -1వ భాగము

రచయిత : **శ్రీమత్భాగవత కృష్ణదేశిక ప్రభువులు**

వ్యాఖ్యాత : **శ్రీ విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ప్రథమ ముద్రణ : 2012

కాపీలు : 1000

వెల : రూ. 35/-

ఈ గ్రంథములు వలయువారు & కాపీరైట్ :
**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**
డో.నెం. 10-204/ఏ,
యర్రబాలెం - 522 503.
మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా.
ఫోన్ : 08645 - 233 140

ముద్రణ :
**శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్**
మెయిన్‌రోడ్డు, కొవ్వూరు
ఫోన్ : 08813-231575

శ్రీగురుభ్యోనమః

# పీఠిక

శ్రీ శివరామ దీక్షితీ సాంప్రదాయమునకు కందార్థములు అత్యంత ప్రామాణికములై యున్నవి. ప్రబోధ చూడామణి అనే పేరుతో శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్థ దరువులు అను పేర శాలివాహన శకం 1765 సం॥ సరియైన శోభకృత నామ సం॥ ర మార్గశిర బహుళ చవితికి శ్రీమత్ రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమత్ భాగవత కృష్ణ దేశక ప్రభువులు రచించిరి. భాగవతుల వారు అనే ఇంటి పేరుగల నారాయణ యోగి జానకమ్మ అను పుణ్య దంపతుల గర్భవానమున ఏకైక పుత్రులుగా జన్మించిరి. హైదరాబాదు నగరంలో చెట్ల మహారాజ్ గంజి అను ఒకవీధిలో వీరు నివసించే వారు. వెలనాటి శాఖకు చెందిన బ్రాహ్మణ కుటుంబంవారు. భిక్షాటనయే వంశాచారముగా కలవారు. బాల్యమునందే ఉపనయనాది సంస్కారములు జరపబడినవి. ప్రథమ కళత్రము పరమపదించడంతో తీవ్రవైరాగ్యముతో ఉండగా అనంతలక్ష్మి అను కన్యను తల్లిదండ్రులు ద్వితీయ వివాహము గావించిరి. ఈమెద్వారా వీరికి ఒక కుమారుడు కలిగి అనతి కాలములోనే మరణించెను. పూర్వ పుణ్యఫలము ఫలప్రదమై పల్నాడు తాలూకా ఎర్రగొండపాలెం నివాసి శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయ పరంపరా పీఠాధికారియైన శ్రీ పరశురామ సీతారామస్వామి దివ్యశ్రీ చరణములను ఆశ్రయించి, వారి సేవా శుశ్రూషలు చేయుచు, వారి అనుగ్రహమునకు పాత్రులై జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు పరిపూర్ణ బోధయే ఋజు మార్గముగా యెంచి అందు కృతకృత్యులైరి. ఆంధ్ర భాషయందు ఈ మార్గముననే పయనించిన వేమన, శివరామ దీక్షితుల మార్గముననే పాటిస్తూ తేట తెలుగులో ఈ పరిపూర్ణ భావమును ఆగమ నిగమ ఉపనిషత్ సాగర మదితార్థమై సకల వేదాంత సారాతీతమై "రహస్యం హేతదుత్తమం" అను భగవద్గీతా వచనమునకు రూప కల్పనగా ఈ గ్రంథమును రచించిరి. వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఈ గ్రంథము నందు పరిపూర్ణ భావముయొక్క స్వరూప స్వభావములు ఇమడ్చబడి బృహద్వాశిష్ఠ సిద్ధాంతము (పరిపూర్ణభావము) నకే ఒక పరిశోధనాత్మక వివరణ గ్రంథముగా సమాజమునకు అందింపబడినది.

ద్వైతాద్వైతరహిత పరమతత్వము సకల సుకకవిజనమనోరంజిత విలాసము, జనన మరణ ప్రవాహమును సులభముగా దాటించునది అయిన ఈ పరిపూర్ణ భావము రహస్యమై గురూపదిష్ఠ మార్గము నందు మాత్రమే అనుభవనీయమై యున్నది. "నస పునరావర్తతే" అనగా సర్వభ్రాంతి రహిత మొనర్చే ప్రబోధగా దీనిని సిద్ధాంతీ కరించడమైనది. శ్రీ మద్ రాముడుగు

శివరామ దీక్షితులవారు ప్రతిపాదించిన పరిపూర్ణ భావము "అచలోయం సనాతనః" అని జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతాసందేశము అను ఈ రెండు అంశములను క్రోడీకరిస్తూ తేట తెలుగులో ఈ సిద్ధాంతమును నిర్దుష్టముగా కేటాయించి, ఈ గ్రంథ రచనను సమాజమునకు అందించి యున్నారు. పరిపూర్ణ సిద్ధాంత మందలి సమగ్ర అవగాహన ఈగ్రంథముద్వారా స్పష్ట పరచబడుచున్నది. వీరు ఆశుకవిగా ఈ పద్యములను ఒక తాళపత్ర గ్రంథమునందు నిక్షిప్తము చేయుటచేత మూలగ్రంథము శ్రీకృష్ణ దేశికేంద్రులవారి స్వహస్తములతో సవరించబడి పీఠములో నుండిన మూల గ్రంథప్రతిని ఆధారముగా చేసుకొని పెక్కు అంశములు ఒకే లక్షణమున చేర్చబడి యుండి పాఠకులకు సులభగ్రాహ్యము అగుటకు పీఠాధిపతులైన శ్రీమద్ దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారిచే విభిన్న శీర్షికలుగా విభజించి విషయ గ్రహణమునకు అనుకూలముగా పరిచ్ఛేదనముగా విభజించి పీఠగ్రంథముగా ప్రకటించిరి. దీనివలన సిద్ధాంత పద్ధతి అందలి నిర్మిత విధానము బోధనాపద్ధతి అందలిసౌలభ్యము విషయ నిరూపణకు పాఠక లోకము సులభముగా గ్రహించుటకు వీలగుచున్నది. కం॥"ఏపురుషుడు గురువర్యుని శ్రీ పాదము బట్టలేదో సేలుగ నాతండీ పుస్తకమును జూచిన॥ ఏపట్టున నిల్వకేగు యిది నిజమయ్యా నరులారా మీమది తెలియ రయ్య యీ పరమ గోప్యము ఎవరెరుగ రేరయ్యా నాపల్కు మదిలోన నాటిన వానికే ఇది నిజమయ్యా నరులారా మీమది తెలియరయ్యా॥ అని ఈ గ్రంథమును గూర్చి వివరించి యున్నారు. గతంలో ఎందరో మహానుభావులు ఈ గ్రంథమునకు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. వారి అందరికి సహస్ర ప్రణామములు. శ్రీశివరామ దీక్షితీయ పీఠాధ్యక్షులైన శ్రీమతి అనసూయాంబ సమేత శ్రీమద్ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులైన పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు, సీతామహాలక్ష్మి గార్ల ప్రియశిష్యుడైన మంచిరాజు శ్రీనివాసమూర్తి అను పేరుతో పిలువబడుచున్న నేను శ్రీగురుమూర్తి అనుగ్రహ ఆశీర్వచన బలమును అండగా గైకొని శ్రీగురుమూర్తిద్వారా విన్న ప్రబోధ విధానమును దృష్టిలో ఉంచుకొని ఈ వ్యాఖ్యాన రచనను చేసియున్నాను. విజ్ఞులు సహృదయముతో ఈ రచన స్వీకరించి నన్నాశీర్వదిస్తారని మనసారా ప్రార్థిస్తున్నాను. ఈరచనను మాగురుదేవులైన శ్రీ సీతామహాలక్ష్మీ సమేత సదానంద శ్రీ రామచంద్రరావు రాజయోగీంద్రుల దివ్యశ్రీచరణములకు ఒక పూజాపుష్పముగా సమర్పించు కొనుచున్నాను.

ఈ గ్రంథముద్రణకు ద్రవ్యసహాయమొనర్చిన చి॥ వల్లమూడి రామచంద్ర ప్రసాదు శ్రీమతి మాలతి దంపతులకు శ్రీగురుమూర్తి ఆశీర్వచనము సర్వదా ఉండి లక్ష్యశుద్ధి చేకూర గలుగు గాక.

ఇట్లు
**గురుపాద రేణువు**
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

## శ్రీగురుభ్యోనమః



ఈగ్రంథ ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన శ్రీ వడ్లమూడి రామచంద్ర ప్రసాద్, భార్య మాలతి గార్ల సంగ్రహ జీవిత చరిత్ర.

కృష్ణా జిల్లా విజయవాడ రూరల్ మండలము గొల్లపూడి గ్రామవాస్తవ్యులు అయిన వడ్లమూడి సీతారామస్వామి, పిచ్చమ్మ పుణ్య దంపతులకు ద్వితీయ పుత్రుడుగా శ్రీ రామచంద్ర ప్రసాద్ గారు 31 -8-1946 వ సంవత్సరములో జన్మించినారు. వ్యవసాయమే జీవనోపాధిగా కలిగి యున్నారు. వీరు SSLC వరకు విజయవాడలో విద్యాభ్యాసము జరిగినది. యుక్త వయస్సు రాగా గుంటూరు జిల్లా పొన్నూరు మండలము దొప్పలపూడి గ్రామ వాస్తవ్యులు శ్రీఉపుల ఉమా మహేశ్వరరావు భార్య వేణుకుమారి పుణ్యదంపతుల జేష్ఠ పుత్రిక చి॥సౌ॥ మాలతీదేవి గారితో 1974 వసంవత్సరములో నిడుబ్రోలులో వివాహము జరిగినది. వీరికి నాగ శివరామ్, నాగశీతారామ్ అను ఇరువురు కుమారులు కలరు. వీరు ఉన్నత విద్యాభ్యాసముచేసి విదేశములలో వృత్తిరీత్యా స్థిరపడినారు. పెద్ద కుమారుడు అయిన నాగశివరామ్‌కు ప్రతిమతో 5-12-2007 లో వివాహము జరిగినది. పూర్వజన్మ పుణ్యవిశేషముతో వీరి తోటి కోడలు అయిన చి॥సౌ॥ కస్తూరి గారి ప్రోత్సాహముతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయకులైన పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు, సీతామహాలక్ష్మమ్మగార్ల ప్రియశిష్యులైన శ్రీవిజ్ఞానంద మంచిరాజు శ్రీనివాసమూర్తి, సుగుణావతి దంపతుల ద్వారా గురుమంత్ర దీక్షను స్వీకరించి, సాంప్రదాయ బద్ధముగా అనుష్ఠాన, ఆచరణ, విచారణల యందు 2008వ సం॥ రము నుండి కృషిచేస్తూ, అప్పుడప్పుడు గురుముఖత: వింటున్న కందార్థ వ్యాఖ్యానము లకు ఉత్తేజితులై, ఈ భావము లందరకీ అందించాలన్న సద్బుద్ధితో, వలయు ఆర్థిక సంపత్తిని అందించి, ఈగ్రంథ ముద్రణకు తోడ్పడిన ధన్యజీవులు. ఈ దంపతులకు, వీరి కుటుంబము వారికి శ్రీ గురుపరమాత్మ అనుగ్రహము సర్వదా ప్రసరించు గాక.

ఇట్లు

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ఓం

శ్రీగురుభ్యోన్నమః

# ప్రబోధ చూడామణి యను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దర్పులు.

శివరామ దీక్షిత సాంప్రదాయమునకు ఈగ్రంథము అత్యంత ప్రామాణికమైనది. దీనిని రచించినవారు శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు, 1765 సంవత్సరము మార్గశిర బహుళ చవితినాటికి ఈగ్రంథరచన పూర్తిచేయబడినది.

వీరివంశము గూర్చి సంగ్రహవివరణ:-

| | | |
|---|---|---|
| ఇంటిపేరు | : | భాగవతులవారు |
| గోత్రము | : | భారద్వాజస |
| స్థలము | : | గోల్కొండ హైదరాబాదు |
| తల్లి | : | జానకీదేవి |
| తండ్రి | : | నారాయణ యోగి |
| ఉపదేశ గురువు | : | శ్రీమత్పరశురామ సీతారామ స్వామి |
| సహధర్మచారిణి | : | అనంతలక్ష్మి |

## గ్రంథస్థ విషయము

ద్వైతాద్వైత రహిత పరమ తత్వము. వేద వేదాంత సారాతీతము. సకల సుకవి జనమనోరంజిత విలాసము. జనన మరణ, ప్రవాహమును సులభముగా దాటించునది. ఇందలి విషయము రహస్యమై గురూపదిష్ట మార్గమునందు మాత్రమే అనుభవనీయమై వున్నది. "నన పునరావర్తతే" అనగా కేవలము జనన మరణ భ్రాంతి రహిత మొనర్చునట్టి ప్రభోధగా దీనిని సిద్ధాంతీకరించడమైనది. గురుశిష్య మార్గము ద్వారా మాత్రమే ప్రబోధించవలసి వున్నది.

## గ్రంథనామ వివరణ

**ప్రబోధ చూడామణి** =ప్రపంచములో గల మార్గము లన్నిటికంటె జన్మతరుణోపాయము కల్గించుటలో విలువైనది, గొప్పది అనిచెప్పుట.

శక్తిద్వయము = శక్తి అనగా కదలిక లేక ప్రాణము. ఇది రెండుగా వ్యవహరించుచున్నది. ఇది ప్రాణ లక్షణము. ప్రాణము రజోగుణలక్షణము. 1. క్రియాశక్తి 2. జ్ఞానశక్తిగాపనిచేయు చున్నది.

క్రియాశక్తి = స్థూలరూపముగా పరిణమించి కర్మేంద్రియ వ్యవహారములకు (బాహ్యరూపమైన కదలికలకు) కారణమగు చున్నది.

జ్ఞానశక్తి = సూక్ష్మరూపమై ఆలోచనాత్మకమై అంతరేంద్రియముల పైపనిచేయుచున్నది. బ్రహ్మాండమందు క్రియాశక్తి స్థూలరూపమై సమస్తమును తనయందు ఇముడ్చుకుని వున్నది. జ్ఞానశక్తి సూక్ష్మరూపమై వీటిఉనికికి ఆధారరూపమై వున్నది. అధిష్టానమందు కూడా పరా, అపరా ప్రకృతి రూపముగా వున్నది. స్థూలము ఆవరణ రూపమై, సూక్ష్మము విక్షేప రూపమైవున్నది. వీటి ఏకైక రూపమునకు మూల ప్రకృతి యనియు, దహరాకాశమనియు, అవ్యక్తమనియు, మాయ అనియుచెప్పబడును. ఈ అంశము వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: విచారించ వలసి వున్నది. దీనితో సంబంధ పడక వేరైవున్నది, "పరిపూర్ణము" దానియందు దీనికి ఉనికి లేదు. అందుచేతనే "ఏతన్మిథ్య శుద్ధ వియత్ కించిత్‌నాస్తి" అనిచెప్పవలసి వచ్చినది.

సృష్టికి పూర్వము నిర్గుణ రూపముగా, సృష్టి సంకల్పంలో సగుణ రూపముగా, మార్పుచెందుచున్నగుర్తుయొక్క పూర్వపు స్థితిని చూచిఅదియే అచల పరిపూర్ణమని భ్రమ చెందుచున్నారు. నిర్గుణమందు ఇతరమేమి లేకపోయినా పరిణామమునకు కారణమగు గుర్తు బీజరూపముగా ఉన్నది. ఈగుర్తు కు పరిపూర్ణమునందు కూడా మూలము లేదు అని చెప్పుటకు "నిర్మూలమే తథాజ్ఞానశరీరం నాస్తి కేవలం". ఈరెండూకాని స్థితియందు శుద్ధనిర్గుణమైన పరిపూర్ణము స్వతస్సిద్ధమైవున్నది. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ఉనికిని తెలియ పరచుటకు కందార్థ విచారణ చెప్పబడుచున్నది.

ఈకందార్ధ విచారణ.గురుముఖత: పరిపూర్ణసూచన గ్రహించినవారికే విచారణగా చెప్పవలసిఉన్నది. మనోవాక్కుల కందని కేవలత్వం కల్గినపరిపూర్ణ పరబ్రహ్మమునుగూర్చి గ్రహింపజేయుట చాలా కష్టము. ఇట్టి విషయునిరూపణకే గురువు అవసరము. తెలియరాని దానిని గ్రహించవలెనంటే తెలివిచే తెలియబడు సమస్తమును ముందు ఒకటిగా తెలియవలసి వున్నది. ఈబోధనా పద్ధతియందు వున్నవి రెండే అంశములు 1. పరిపూర్ణము 2. ఎరుక. కేవలత్వము కలిగిన దానిని పరిపూర్ణ శబ్దముచేతను, సమస్త సృష్టి ఆద్యంతములకు అత్యంత మూలాధారమైన తెలివిని ఎరుక అను శబ్దము చేతను సూచిస్తూ ఈకందార్ధముల యందు వీటిని గూర్చి ఒక పార్యాంశముగా, బోధ దృఢీకరణ కొరకు చెప్పబడుచున్నది. పరిపూర్ణబోధ సిద్ధాంతీకరించుట పట్ల పరిపూర్ణమెరిగి,ఎరుకనెరిగి, ఎరుకను మాను, గురుముఖత:ఇట్టి అంశములు బోధనా పద్ధతిగ శ్రుతియుక్తి అనుభవ పూర్వకముగా ఈగ్రంధమందు పొందుపరచబడి ఉన్నవి. అందుచేతనే గురుముఖత: వినవలసియున్నది. ఇట్టిగ్రంధమును రచించి శ్రీకృష్ణదేశికేంద్రులు సభఏర్పాటుగావించి "సభావిజ్ఞాపన" అనుపేర తమరచనలోని అంశాలను చెప్పటం ప్రారంభించారు. తాళపత్ర గ్రంధాన్ని ఆధారంగా చేసుకుంటే వీరిరచన వేమనయోగీంద్రునివలే ఆశుకవిత్వంగా చెప్పబడినట్లు తోచుచున్నది. మూలగ్రంధమునందు పెక్కు అంశములు ఒకేలక్షణమున చేర్చబడియుండి పాఠకులకు సులభగ్రాహ్యముకానందున ఒకేవిషయమున గ్రంధకర్తకు గల అభిప్రాయములన్నియు ఒకేశీర్షిక క్రిందకు చేర్చి శ్రీదయానందులవారు మొత్తము కందార్ధ రచనను విభిన్న శీర్షికలుగా విభాగించి విషయగ్రహణమునకు అనుకూలముగా, పరిచ్ఛేదములుగా విభజించి ప్రకటించిరి. ఇట్టిఏర్పాటువలన కందార్ధముల యందు, బోధనాపద్ధతి యందు విషయనిరూపణ పాఠకలోకము సులభముగా గ్రహించుటకు వీలగును.

# సభావిజ్ఞాపన

## గ్రంథప్రభావము

సభావిజ్ఞాపన పేరున గ్రంథప్రభావమును గూర్చితొలికందార్థంగా "జనులారా" అనిసంభోదిస్తూ ప్రారంభించిరి. ఎటువంటి ఇష్టదేవతా ప్రార్థనగాని,మంగళాచరణంగాని, గురుప్రార్థనగాని చేయకయే జనులారా అనిసంబోధించుటలో ఈగ్రంథస్తవిషయమగు జనన మరణ భ్రాంతి రహిత విధానము ఒక పరిపూర్ణబోధచే మాత్రమే చేకూరగలదనిసూచిస్తూ "నసపునరావర్తతే" అను గీతావచనానుసారంగా జనన మరణ భ్రాంతి రహిత విధానం అవసరమని, సాధ్యమనిసూచిస్తూ గ్రంథరచన కావింపబడినది.

కం॥ జనులారజననమరణము। లనుదొలగన్। ద్రోయ జాలు।
లక్షణయుతమై। వినువారికి। కనువారికి । తనలావె రిగించు
దీని। తప్పాకవింటే । అప్పుడెవార। లెప్పుడు గంటే। కనుకా
వినబుద్ధైతె వినుడీచదివెద। మీకె। లికనుగొన మనసైతె। కనుడీ
పుస్తకమంత। తప్పాకవింటే। అప్పుడెవార లెప్పుడుగంటె॥ 1

## ప్రతిపదార్థము

జనులారా= " జ" అనగా పుట్టి "న" అంటే నశించే లక్షణంకలవారు
జననమరణములన్ దొలగన్ త్రోయజాలు. జననము. పుట్టుక
మరణము=చావు
ఈజనన మరణములనే చక్రమునుండి తప్పింపచేసేది
లక్షణయుతుడు = జన్మకర్మలకు అత్యంతమూలకారణమైన వస్తువును గుర్తించి దాని రహితమునకు తీవ్రమైన వేదనతో ఎదురు చూచువారు
వినువారు = జ్ఞానమార్గీయులు
కనువారు = యోగమార్గీయులు
తనలావెరిగించు = ఈగ్రంధముతాలూకు గొప్పతనం తెలియజేయు
తప్పాక వింటే = విడిచిపెట్టకుండా దీక్షాబద్ధంగా వినాలి అని
అప్పుడే = ఆక్షణమేఅనగా సద్యోముక్తి

వారలెపుడుగంటే = వారలు = పైనపేర్కొన్నవారు ఎప్పుడుగంటె = ఎప్పుడనుకుంటె అప్పుడే

కనుక వినబుద్ధైతె = బుద్ధికర్మాధీనమైయుండును. కనుక జన్మ సుకృతముచేగాని ఈకృషి చేయుట వీలుపడదు

వినుడీ చదివెద వినుడీ = వినండి చదివెద = వివరిస్తాను

మీకే కనుగొన మనసైతే = అహంకార విశిష్టమైనవారు ఎదుటివారు చెప్పగావినడంకంటే తాము స్వయంగా చదువుకొని గ్రహించాలనుకొనేవారు. కనీసం పుస్తకం మొదటినుండి చివరిదాకా అయినా

తప్పాక = తప్పనిసరిగా

## తాత్పర్యము

జనన మరణ ప్రవాహంలో మునిగి తేలుచున్న ఓ జనులారా! అట్టి జనన మరణములు లేకుండా చేయుటకై, సర్వభ్రాంతి రహితమె జీవిత లక్ష్యంగా కలవారు తీవ్రమైన మోక్షాపేక్షతో గ్రంధమందు పేర్కొనబడిన బోధనాక్రమము ద్వారా వినవలసిన అంశములు బోధనారూపంగా వింటూ అందలి నిగూఢాంశములు ఆరూఢపరచు కొనుటలో చేయవలసిన క్రమంపాటిస్తూ దీక్షా బద్ధంగా వినగలిగిననాడు, ఇందలి రహస్యం వెంటనే అనుభూతమగునటుల గ్రంధముయొక్క ప్రభావము ద్వారా చెప్పుట జరుగుచున్నది. దీనిని సద్యోముక్తి అని అందురు. అట్లుగాక ఎవరికి వారే గ్రంధము పరిశీలించ దలచినచో మొదటి నుంచి చివరి దాకా చదివిన గాని ఇందలి విషయగ్రహణమునకు వీలుపడదు. కావున పై అంశములు దృష్టి లో పెట్టుకుని ఈగ్రంధ పరిశీలన గావించుడని తొలి కందార్ధ రచన ద్వారా తెలియపరచినారు.

## గ్రంథ శ్రవణాధి కారులు

ఏదైనా ఒక అంశాన్ని నేర్చుకోవడానికి, అనుభవం లోకి తెచ్చు కోవడానికి కొంత అధికారం అనగా యోగ్యత పాత్రత అవసరం. అట్టి అర్హత

లేనివారు అర్హత కలిగించుకొని కాని ఏతత్ ఫలాన్ని అనుభూతం కావించు కోలేరు. ఆవిధంగానే ఈ కందార్థ రచనయందలి పరిపూర్ణ భావము ఆరూఢ పరచు కొనుటకు అధికార నిర్ణయము ఈకందార్థమునందు పేర్కొనబడినది. ఏ గ్రంథము నైనాచదువుటకు అధికారము కనీస అక్షరజ్ఞానమున్న చాలు. కాని అందలి ఆధ్యాత్మిక సత్యమును చదవగా కలిగిన జ్ఞానమును అనుభవములోనికి తెచ్చుకొనుటకు ఒక ప్రత్యేకమైన అధికారము కలిగియున్నకాని గ్రంధస్థ విషయము అనుభూతముకాదు. ఇట్టిలక్షణములు ఈ కందార్థమునందు పేర్కొనబడుచున్నవి.

కం॥ వినవలెనని। కనవలెనని మనసందునకోర్కెగల్గు మను
జులెవినుడీ। వినజేసెద కనజేసెద। ఘనమగుయీబోధవిన।
కననొల్లనట్టీ మనుజులు చనుడొచ్చినత్రోవబట్టీ। తినుమంటె
పులి వల్లదనిలోకులనవింటి। గనుకానెవినవాలెనన నోరాడదు
విన। కననోల్లనట్టీ। మనుజులుచనుడొచ్చినత్రోవబట్టీ॥ 2

## ప్రతిపదార్థము

ఘనమగు గురుబోధ = గొప్పదైన ఈ విచారణ
వినవలెనని = ఏకాగ్రమైన (అన్యధ్యాస లేక) మనసుతో
కనవలెనని = చూడవలెనని లేక అనుభూతం కావించుకొనవలెనని
మనసునందు కోర్కెగల్గు = మానవ ఉపాధి పొందినవారికే మనసువున్నది. మిగిలిన జీవోపాధులకులేదు
మనుజులెవినుడీ = ఇటువంటి లక్ష్యంతో కూడిన మనస్సు కలవారు
వినజేసెద = శ్రోతేంద్రియము ద్వారా వాక్కు చేత ప్రకటమగు భావములు
కనజేసెద = శ్రవణము ద్వారా కల్గిన వస్తుజ్ఞానమును మనసుతో చూడగల్గేలా
వినకన నొల్లనట్టి మనుజులు = పైనపేర్కొన్న రెండు లక్షణములుకాక కేవలం వినికిడికే పరిమితమైన వారు
చనుడొచ్చినత్రోవనుబట్టి = వచ్చిన దారినే తిరిగి వెళ్ళండి (కర్మానుభవము కొరకు పిండ బ్రహ్మాండముల ప్రయాణము)

తినుమంటే పులి వల్లదని లోకులనవింటి = పులి సహజస్వభావం కనుకనే = అందుచేతనే (కనిపించిన ప్రతీదీ చంపి తినడం) ఆవు+పులికధ వినవలెనన నోరాడదు = ఆధ్యాత్మిక సత్యము వినేవారి యోగ్యతను బట్టి చెప్పేవారికి స్పందనకలుగును. జన్మ సుకృతం రాశీభూతమైఫలప్రద మైనపుడు గాని విను కను అదృష్టం సంభవించదు.

## తాత్పర్యము

ఓ సభాసదులారా! గ్రంథమందు చెప్ప బడుచున్న పరిపూర్ణభావము మనోవాక్కుల కందనిదై కేవలము గురుప్రబోధ చేత మాత్రమే అనుభవం లోనికి తెచ్చుకోవలసి వున్నది. అట్టి అంశం కేవలం వినడం అనే ప్రక్రియకే పరిమితం కాక, విన్నవిషయాన్ని అనుభవంలోనికి తెచ్చుకోగల్గుట అను అంశము కూడా చాలా ప్రధానమైనది. వినుటవలన కల్గిన జ్ఞానము శ్రవణ జన్యజ్ఞానమందురు. ఇట్టి జ్ఞానము మనసుద్వారా అనుభూతము కావించుకొన్ననాడే ఆధ్యాత్మిక సత్యము, ఆరూఢజ్ఞానము అనుభవజ్ఞానముగా మారును. బోధనా పద్ధతి యందు బోధనాంశములు వినగల్గు ప్రక్రియ, అనుభవములోనికి తెచ్చుకొను విధానము వేటికవి స్పష్టముగా విడమరచి, నిర్దేశించి చెప్పబడును. బోధించువాడు బోధనాంశమును, అందలి ఆధ్యాత్మిక తత్వమును ఆరూఢ పరచుకొని బోధించును. కావున ఇట్టి బోధనా పద్ధతి చాలా శ్రేష్టమైనది. పరిపూర్ణబోధ ఇట్టి లక్షణము గలది. కావున ఇందలి ప్రబోధ ద్వారా కలుగు విషయనిరూపణ చాలా స్పష్టముగానుండును. అనగా వినడమె తరించడము. శాస్త్రమునందు ఆధ్యాత్మిక తత్వ పరిశీలనలో శ్రవణ మనన, నిధి ధ్యాసలు తద్వారా అనుభవము ఒక క్రమములో చెప్పబడును. ఇట్టిదానికి భిన్నముగా వినుటద్వారానే ఆరూఢత కల్గించుట ఈబోధ యందలి విశిష్టము బోధ అనగా మెళకువ అని అర్థము. ఇట్టి ఆరూఢత పొందవలెనంటే వినుట, కనుట అను రెండు లక్షణములు కల్గి వుండవలెను. అట్లు గాక ప్రపంచంలో కేవలం వినుటకే పరిమితమైనవారు జ్ఞానమార్గీయులు. కనుట అను ప్రక్రియ యోగ మార్గీయులు గాను

చెప్పబడుచున్నది. ఈ రెండు లక్షణములు కలిగియున్నవారు మాత్రమే ఈగ్రంధమును వినుటకు అధికారులు. మానవోపాధికి జనన మరణ రాహిత్యమే పరమావధి. అందుకు పరిపూర్ణబోధయేమార్గము. దీనియందు ఆరూఢతచెందక ఇతరత్రా ఎన్ని ప్రయత్నాలు చేసినా జన్మ వ్యర్థము. అట్టివారు ఈ సంసార చక్ర భ్రమణంలో " పునరపి జననం " అన్నట్లుగా పరిభ్రమించవలసినదే. ఇట్టి ఆలోచన లేనివారిని ఈగ్రంధ శ్రవణం చెయ్యమనడం ఆవు, పులి కధతో పోల్చి చెప్పడమైనది.

## గ్రంథకర్త నిస్వార్థము

ప్రపంచంలో గల కవీశ్వరులు తమ పాండిత్యాన్ని, కవిత్వాన్ని కేవలం లౌకిక ప్రయోజనాలు ఆశించి అనగా పండిత సత్కారాలు, బిరుదులకు, ప్రలోభాలకు లోనై వారి కవిత్వాన్ని అమ్మజూపుచున్నారు. ఇది ప్రాచీన కాలమునుండి అమలులోనున్న అంశమే. ఇట్లు గాక తమకు సంక్రమించిన కవిత్వాన్ని, విజ్ఞానాన్ని, పాండిత్యాన్ని దైవదత్తమైనవిగా భావిస్తూ అందుకనుగుణ్యంగా వారి శక్తి సామర్థ్యాల్ని, కవిత్వాన్ని లోక కళ్యాణం కోసం తమద్వారా భగవంతుడు చేసిన ఏర్పాట్లుగా భావించి తమ వంతు కృషిగా సమాజానికి అందించి సేవించినవారున్నారు. అట్టివారినే " భాగవతోత్తములు " అంటారు. వీరి ఆశయం కేవలం వీరికి సంక్రమించిన జ్ఞానాన్ని కవిత్వ రచనల ద్వారా లోక కళ్యాణమునకై సమాజ శ్రేయస్సుకు జీవితంగా అర్పించి, ఎట్టిప్రతిఫలాపేక్షలేక, అహంకార మమకారములకు తావివ్వక, దైవశక్తికి ఒక ప్రతినిధిగా భావించుకొంటూ, తమకు సంక్రమించిన సమస్తాన్ని దైవానికి అర్పించి, " స్వయంతీర్ణ్వయ: పరంస్తారయతి "అన్నట్లుగా జీవిస్తారు. వీరి జీవన విధానం కొన్ని ఆదర్శాలకు అంకితమై వుంటుంది. ఇదియే భాగవత జీవనం అంటారు. ఈగ్రంధకర్తగారు ఈకోవకు చెందినవారే. వీరికి సంక్రమించిన గుర్వనుగ్రహాన్ని గురు ఋణం తీర్చే క్రమంలో సమాజానికి అందించి, వారిని జన్మ తరుణో పాయమునకు జాగృతం చేసేక్రమంలో ఈ గ్రంధ రచన కావించినట్లు ఈ కందార్థము ద్వారా మనకు తెలియ జేస్తున్నారు.

కం॥ ననుమిమునేగనిపుస్తక। మునుజేసితి దీన్నిమీరుముదము
నవినుడం। చనుటయుమిమునను మీరలు। గనుగొనివినిపించు
మనుట। కలయిట్టిమాటా। బోధనుమేల్కా। గనలేదెచ్పోట। ఘనులార
యిటు వంటి కలలో ముచ్చటలాడి। గొనకోని మీరుమేల్కొని। మేల్కొ
ల్పుడి నన్ను। కలయిట్టిమాటా బోధనుమేల్కా। గనలేదెచ్పోటా॥ 3

## ప్రతిపదార్థము

నను మిము నేగని పునస్తకమును జేసితి = దుర్లభమైన మానవో పాధికి వచ్చి పరమ పురుషార్థమైన మోక్షప్రాప్తికి కావలిసిన కృషి గురు ముఖత: నేను పొంది, ఇట్టి అవసరం కలదని గుర్తించి మిగిలిన వారికి కూడా దృఢపరచుటకు ఈగ్రంధ రచన కావించబడినది.

ముదమున = సంతోషంతో

వినుడంచనుటయు = వినండి అని నేను చెప్పడం

మిమునను మీరలు కనుగొని వినిపించుమనుట = పైనపేర్కొన్న అవసరాన్ని (ప్రయోజనాన్ని) గుర్తించి మీరు నన్ను చెప్పమని అనుట

కల = లేనిదే నిజము కానిదే

ఇట్టిమాటా = ఇది కల అని తెలిసే అనుభవం

బోధనే మేల్కాగన లేదెచ్చోట = గురువు ప్రబోధించిన బోధనా పద్ధతి ద్వారా చెప్పుట, వినుట అను రెండు క్రియలు ఆరూఢస్థితి యందు లేనివే అగుచున్నవి. కావున (గురుశిష్యోభయ రాహిత్యం)

ఘనులారా = సహజముగా గొప్పదైన ఉనికి గలవారు

ఇటువంటి కలలో = చెప్పుట, వినుట అను ప్రక్రియలో రెండూ లేనివే అగుచున్నవి. కావున కలగా చెప్ప బడుచున్నవి.

ముచ్చటలు = అనుభవాలు

గొనకొని = స్థిమితపడి, సమాధానపడి

మీరు మేల్కొని మేల్కొల్పుడీ నన్ను = గురువు ప్రబోధించు బోధచే శిష్యుడు సర్వభ్రాంతి రహిత స్థితుడైనపుడు గురుశిష్యోభయ రాహిత్యం కల్గును.

# తాత్పర్యము

శ్రేష్టమైన ఉనికి గల మీకు చెప్పునదేమనగా పరమ పురుషార్ధమైన జన్మ రాహిత్య విధానమునకు కృషి చేయుపట్ల సాంప్రదాయ బద్ధమైనగురువు నాశ్రయించి వారి బోధనా పద్ధతి ద్వారా జన్మరాహిత్యవిధానమునకు సంబంధించిన పరిపూర్ణ బోధను ధృఢ పరచుకొన్న నాకు గురు ఋణాన్ని తీర్చే బాధ్యతలో దీపో దీపాంతరం యధా అన్నట్లుగా నేను కలిగించుకొన్న ఆరూఢతను నాజీవితకాలంలో ఏ ఒక్కరికైనా ధృఢపరచిన గాని గురుఋణ విముక్తికాదని గురువాజ్ఞ చే బోధాధికారము పొంది లోక కళ్యాణము కొరకు ఈ భావము సమాజానికి అందించడంలో సమాజశ్రేయస్సుకు, శిష్యసేకరణకు, సాంప్రదాయ ధర్మాన్ని ప్రచారం చేయుటకు ఈ గ్రంధరచన ద్వారా మార్గము నెంచుకుని, దీని అవసరాన్ని, ప్రయోజనాన్ని, మీచే గుర్తింపజేసి ఆరూఢ పరచుటకు తద్వారా ఋణవిముక్తులగుటకు మాత్రమే ఈ రచన గావింపబడినది. ప్రబోధచే కలుగు ఆరూఢ స్థితియందు చెప్పుట, వినుట అనురెండు అంశములు నిజముకాదని తెలియ జేయుటకు ఇట్టి ఆరూఢత బోధచే మాత్రమే కలుగ గలదని వినుమనుట చదువుమనుట అను రెండు అంశములు మెళకువ యందు లేనివి అని తెలియ పరచుటకు ఈ గ్రంథ రచన గావింపబడినది. కావున మీరు ఇటువంటి సందర్భంలో పైఅంశములన్ని దృష్టిలో వుంచుకుని నే బోధించిన అంశములను ధృఢపరచుకొని మీలో ఏ ఒక్కరుగాని ఆరూఢత గాంచిన నాడు చెప్పుట, వినుట అను ప్రకియలో వినువాని ఆరూఢతచే చెప్పువాని గురుతు, రద్దయి తద్వారా ఋణవిమోచనము కాగలదు. కావున ఈ అంశములను చక్కగా గుర్తించి నే చదవగా మీరు విను విధానము పాటించవలసినదిగా కోరుచున్నాను. ఇందు కల అనే అంశమును స్పష్టముగాతె లియవలసి వున్నది. పిండాండము, బ్రహ్మాండము, వీటి యందలి క్షరము, అక్షరము, ఇందు క్షరోపాధియైన పిండాండము అక్షరోపాధి యగు బ్రహ్మాండ దృష్ట్యా నిజముకానిది లేనిది అగుచున్నది. ఇది స్వస్వరూపజ్ఞానముచే అనగా

మహావాక్య ఉపదేశముచే తెలియ బడును. బ్రహ్మాండ మగు అక్షరోపాధి గూడా పరిణామ క్రమానికి లోనయివున్నది. ఇది అధిష్టాన పరిణామముగా తెలిసి అధిష్టానమును గుర్తించిన బ్రహ్మాండమగు అక్షరోపాధి లేనిదగు చున్నది. క్షరోపాధి అక్షరోపాధి యందును, అక్షరోపాధి అధిష్టానమందును లేనివగుచున్నవి. అందుచే కలగా చెప్పబడుచున్నవి. అధిష్టానమందలి గుర్తు కూడా పరిపూర్ణ బోధచే లేనిదగుచున్నది. దీనిదృష్ట్యా క్షర అక్షరోపాధి గూడా లేనిదగుచున్నది. ఇట్టి కలలో చెప్పుట, వినుట కూడా లేనివే అగుచున్నవి. స్వస్వరూప జ్ఞానముద్వారా వ్యష్టి సమిష్టులు ఏకమగుట చేత వ్యష్టి ఉపాధి కలనుండి మెళకువ చెందినట్లగును. ఈ రెంటి భేధము అంతరించి తాను తానై నిలచియున్న స్థితి యందు ఇట్టి తనకు ఉన్న పరిపూర్ణమందు మూలము స్థానము లేనిదని గురు బోధచే తెలియుట చే గుర్తు కూడా లేనిది కల వంటిది అని చెప్పబడినది. ఈ భావము ఆరూఢ పరచుకొనుటకై ఈ కందార్థ రచన చెప్పబడుచున్నది.

## గ్రంథఫలము

ఏగ్రంథము వ్రాసిన ఆ గ్రంథమందలి సారాంశమంతయు సూత్రీకరింపబడి ఒక స్పష్టమైన అవగాహన కలిగించును. అట్లనే ఈగ్రంథము నందు కూడా పరిపూర్ణ బోధ యొక్క విలువను, ఫలమును పేర్కొంటూ నేను, నీవు అను స్పృహతో కూడుకున్న గుర్తు, నేను, నీవు అను స్పృహ లేని కేవలత్వము కల్గిన పరిపూర్ణమునందు తనకు తానుగా ఉత్పన్నమై తన ఉనికిని పిండ బ్రహ్మాండములుగా ప్రకట పరచి ఒకదాని కొకటి మూలము ఆధారముగా నిర్ణయించుకొని పరిపూర్ణబోధచే స్వత స్సిద్ధమైన పరిపూర్ణము నందు తనకు మూలము గాని, స్థానము గాని లేదని గురు ప్రబోధచే దృఢపరచుకొని తన ఉనికి, మూలము ఏ స్థానము నందు లేదని గ్రహించి తాను లేక పోవు విధానము ఈ గ్రంథఫలముగా కృష్ణ దేశికేంద్రులవారు తెలియ జేస్తున్నారు.

కం॥ ఒరులొరులు నేనునేనని। యొరులనుతననెన్నడెరుగకున్న
బయలులో। నరుదెంచి, తనునుతాగని। పరులనుగనిలెస్స నేను।
పరులానియనుచూ। యెరిగేయెరుకే। బయలుండగనుచూ
నిరతముతా నెందు నిలువాకుండుటకూనై। విరచిస్తిదీన్నెరుకా
వినెనానిల్వదు నేను। పరులానియనుచూ। యెరిగేయెరుకే।
బయలుండగనుచూ॥ 4

## ప్రతిపదార్థము

ఒరు లొరులు = మీరు మీరే
నేను నేనని = నేను నేనే
ఎన్న డెరుగక = ఎప్పుడు గుర్తించలేక
వున్న బయలు లో = స్వతస్సిద్ధమైన పరిపూర్ణము నందు
అరుదెంచి = ప్రకటమై
తనను తాగని = నేననే గుర్తు యొక్క ఉత్పత్తి, స్థితి, నాశనము
పరులను గని లెస్స = తనకు ఇతరముగా తోచుచున్నది స్పష్టంగా
నేను పరులానియనుచు ఎరిగే ఎరుకే =నేను, మీరుగా గుర్తిస్తు ఉన్న గుర్తు
బయలుండ గనుచు = స్వతస్సిద్ధమైన పరిపూర్ణమును గురువాక్యముచేత ధృఢ పరచుకొని
నిరతాము తానెందు నిలువకుండుటకునై = సర్వ కాలములయందు, ఏస్థానమునందు తనకు మూలముగాని, స్థానముగానిలేదని
విరచిస్తి = స్పష్టముగా ఈ కందార్థము ద్వారా తెలియ పరుస్తున్నాను.
దీన్నెరుక వినెనా నిల్వదు = పైన పేర్కొన్న ఈ భావము జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన గుర్తు దృఢపరచుకొన్న వెంటనే తన ఉనికి లేనిదని సర్వభ్రాంతి రహిత స్థితి చెందును.
నేను పరులాని యనుచు = నేను, నీవనె గుర్తుండదు.

## తాత్పర్యము

ఈగ్రంధము నందు జన్మ కర్మలకు అత్యంత మూల కారణమైన అధిష్టాన బ్రహ్మము యొక్క ఉనికి మూలము గురించి సిద్ధాంత పరమైన వివరణ చెప్పబడుచున్నది. స్వతస్సిద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మము నందు నేను, నీవు అను ద్వంద్వ పద్ధతి గల అనగా పిండ బ్రహ్మాండములుగా పరిణమించి వ్యష్టి, సమిష్టి రూపంగా వ్యవహరిస్తున్న నేను అనే గుర్తెరిగే శరీరమునకు మూలము గాని, స్థానముగాని లేదని ధృఢపరచుకొని, సర్వభ్రాంతిరహిత స్థితి గుర్తు రహితము ద్వారా ఆరూఢ పరచుకొనుటకు ఈగ్రంధము రచింపబడినది. ఇట్టి వివరణ గురు ముఖతా విన్నవారు ఈ అంశాలను దృఢపరచుకొని నేను, నీవు అను గుర్తు విడచి, అహం పదార్థ రహితముగా జీవించు విధానము ఈగ్రంధ ఫలముగా చెప్పబడుచున్నది.

## సృష్టి కారణము

ఈ కందార్థమందు పరిణామాన్ని గూర్చి వివరింపబడుచున్నది. అధిష్టాన బ్రహ్మము యొక్క పరిణామ క్రమమే జీవేశ్వర సృష్టిగా పరిణమించినదని మనమందరం ఈ పరిణామ క్రమానికి సంబంధించినవారమెనని, పరిణామంతోపాటు తిరోగమనాన్ని కూడా లోనైయుండి వున్నవిధానము ఈ గ్రంధమునందు వివరించడమైనది. పరిపూర్ణ సిద్ధాంత రీత్యా ఉన్న పరిపూర్ణమందు లేని ఎరుక కల వంటిదని ఆరూఢ పరచుకొనుట (పై అంశాన్ని గురు ప్రబోధ ద్వారా) మెళకువ అని చెప్పబడుచున్నది. ఇట్టి స్థితి యందు ఎరుక పరిణామం వున్నా, అది నిజము కాదని, భ్రాంతి జన్యమని అను అంశములు ఈ రచన యందు చెప్పబడుచున్నవి.

కం॥ ఎరుకను కలలోపలనే౹ నరుదెంచితిమీరలట్ల యరుదెంచి
తిరీ౹యెరుకజననేను మీరలు౹ యెరుకతొజను వారమనుచు౹
యెరిగేటికొరకూ౹ గ్రంధముజేస్తి నెరిగి యావరకూ౹ గురుబో
ధంచనుమేల్కు౹ నరులారచేకొంటె౹ యెరుకానెకలజోలినెరిగు
న్ననిల్వాదం౹ చెరిగేటికొరకూ౹ గ్రంథముజేస్తి౹ నెరిగీయావరకూ॥ 5

## ప్రతిపదార్థము

నరులారా = నశించే స్వభావం కలవారు

ఎరుకనే కలలోపల=సృష్టి కారణమగు అధిష్టానమె కల వంటిది అనగా లేనిది.

నేనరుదెంచితి = నేననే గుర్తు అనగా బ్రహ్మాండము (అక్షరపురుషుడు) వికసించినది

మీరలట్లు అరుదెంచితిరి = ఆ విధంగానే మీరు పరిణామంచెందితిరి

ఎరుక జన = ఇట్టి వస్తువు నిజము కాదని తెలుసుకున్నపుడు

నేను మీరలు = నేను మీరు

ఎరుకతో జనువారమనుచు = వచ్చిన విధంగానే వెళ్ళగలవారము

ఎరిగేటి కొరకు = దృఢ పరచుకొనుటకు

గ్రంధము జేస్తి ఎరిగి ఈవరకు = ఈ అంశాలన్ని స్పష్టంగా ఈ గ్రంధము నందు పేర్కొనబడినవి

గురు బోధంచనే మేల్కొచేకొంటే = పరిపూర్ణ బోధను ఆరూఢ పరచుకొంటే

ఎరుకనే కలజోలి ఎరిగున్నా = జీవేశ్వర పరిణామమైన బ్రహ్మాండము, పిండాండము వీటి ఉత్పత్తి క్రమము వున్నట్లుగా తెలియ బడుతున్నా

నిల్వదు = నిజము కాదు అని దృఢపడును.

## తాత్పర్యము

జగదధిష్టానమైన ఎరుక జీవేశ్వర జగత్తులుగా పరిణమించినది. మనమందరం ఈ పరిణామ క్రమము లోని వారమె. ఈ పరిణామం తిరోగమనం చెందుట అనగా అట్టి న్యాయమునకు మనము కూడా లోనైవున్నవారమె. ఈ విధానమెట్లో ఈ గ్రంధము నందు స్పష్టముగా వివరించ బడుచున్నది. ఆవిర్భావ, తిరోభావములకు లోనైన ఇట్టి ఎరుక స్వతస్సిద్ధమైన పరిపూర్ణమందు లేనిదే అగుచున్నది. ఈ అంశము దృఢ పడుటకు గురుప్రబోధము చేతనే సాధ్యమైయున్నదని, ఇట్టి ఆరూఢతలో ఎరుక పరిణామ క్రమము (కనిపించినా) వున్నట్లు తోచిన కలవంటిదని, లేనిదని స్పష్టపరచబడుచున్నది. ఈ ఆరూఢత చేతనె జనన మరణ భ్రాంతి విధానము కలుగ గలదని, ఈ గ్రంధరచన అట్టి ఫలాన్ని కలిగిస్తుందని చెప్పబడుచున్నది.

# అచల బోధ సాంప్రదాయక గురు స్తోత్రము

బ్రహ్మవిద్య అంతయు గురు పరంపరా ప్రోక్తముగా ప్రకాశించు చున్నది. అట్లనే ఈ పరిపూర్ణ భావము గూడా గురు పరంపరగానే ప్రచారంలో వున్నది. వేదాంత విషయమందు ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి అనగా ఏ ఒక్క జ్ఞానాన్ని తెలియడంచేత మిగిలిన వస్తువులను గూర్చిన సమగ్ర జ్ఞానము లేక అఖండ జ్ఞానము సిద్ధించునో అట్టి జ్ఞానము ప్రతి ఒక్కరు తెలియ వలసి వున్నదని శ్రుతులు ఉద్ఘోషించుచున్నవి. ఆజ్ఞానమే సర్వ మంగళ స్వరూపమై అనగా శ్రీ కార స్వరూపమై (చిత్స్వరూపమై ప్రకాశించు) తెలియబడుచున్నది. వేదాంతము, వేదాంత స్వరూపము కూడా ఇదే అయివున్నది. వేదము అనగా జ్ఞానము. వేదాంతమనగా జ్ఞానాతీతము. ఇట్టి వేదా తీతమైన అఖండ జ్ఞానమునకు కూడా అతీతమైవున్న అంశమును ప్రతిపాదించు (పరిపూర్ణ బోధ) శ్రీమించు అచల బోధగా పేర్కొనుచు ఈ ప్రబోధ సాంప్రదాయ పద్ధతిగ ఎట్లు ప్రకట మౌతున్నది అట్టి గురుంపర ఏదో ఈ కందార్ధము నందు చెప్పబడుచున్నది.

కం॥ శ్రీమించునచలబోధను। యేమహనీయుండుజేసి।
యొగజల్లెనోయీ। భూమిన్సుజనులకొరకా। రామడుగన్వ
యజశివ।రామాదీక్షతులన్। తలచియప్పారావ్। గుణత
తులన్। ప్రేమాతొబొగడీనేభూమనిర్జర పరశు। రామా సీతా
రామస్వామికి మ్రొక్కి శివరామదీక్షితులన్। తలచి
యప్పారావ్। గుణతతులన్॥ 6

## ప్రతిపదార్థము

శ్రీ మించు = శ్రీ అనగా జ్ఞానము మించు = అతీతము జ్ఞానమునకు కూడా వేరైవున్నది

అచలబోధ = జన్మ రాహిత్యమునకు ప్రతిపాదించే భావములో కదలని విషయ నిరూపణ జన్మ కర్మలకు లోనుకాని సర్వలక్షణ విలక్షణమైనది.

ఏ మహనీయుడు జేసి = ఎట్టి మహాత్ములు గ్రహించి

ఎగజల్లెనో = విస్తరింప జేసెనో
ఈ భూమిన్ = ఈ భూమండలమందు
సు జనుల కొరకు = సత్పురుషులై మోక్షేచ్ఛ గలవారు
ఆ రామడుగు అన్వయజ=రామడుగు అను ఇంటి పేర వంశములో జన్మించిన
శివరామ దీక్షితులు = శివరామ దీక్షితులు అను పేరు గలవారు
తలచి = ధ్యానించి
అప్పారావు గుణతతులన్ = అప్పారావు అనుపేరుగల మహాత్ముని గుణ సంపత్తిని
ప్రేమతో పొగడి = భక్తితో ధ్యానించి
భూమ నిర్జరు = భూ మండలమందు జనన మరణ రాహిత్యము కావించుకొని పరిపూర్ణ భావమందు ఉనికి గల్గియున్న
పరశురామ సీతారామస్వామికి = పరశురామ అనే ఇంటి పేరుతో సీతారామస్వామి అని పేరుగల్గిన
మ్రొక్కి = సాష్టాంగ నమస్కారము జేసి

## తాత్పర్యము

అచల సిద్ధాంతము గురు పరంపరా ప్రోక్తమై ప్రచారములో వున్నది. భగవద్గీత యందు జగద్గురువు కూడా తాను ప్రతిపాదించు ఆధ్యాత్మిక అంశం పరంపరా ప్రోక్తమై వున్నదని క్రొత్తగా తనచేత ప్రతిపాదింపబడిచెప్పుట లేదని చెప్పబడినది. బ్రహ్మవిద్యయందు ఏది తెలిస్తే అన్నీ తెలియబడతాయో దాన్నితెలుసుకోవడం (బ్రహ్మైవాహమస్మి) ఏది విడిస్తే అన్నీ విడువ బడుతాయో దాన్ని విడవడం (అహం పదార్థ రహిత:) అను అంశములు ప్రధానంగా చెప్పబడినవి. ఇదియే అచల ఋషి సాంప్రదాయ మందలి ముఖ్యవిషయము. ప్రపంచమందు జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన ఆత్మ యొక్క అనుభూతి పొందడం ద్వారా (స్వస్వరూపజ్ఞానం) ముక్త దశ చెందుదురని చెప్పబడుచున్నవి. ఇట్టి అనుభవము మహా వాక్య విచారణ ద్వారానే కలుగును. అని వేదాంత విషయము (అద్వైత సాంప్రదాయం) తో ముగియు చున్నది. కాని విజ్ఞాన

 

దృష్టితో ఆలోచించిన ఈ అద్వైత స్థితి యందు దిగజారుడు లక్షణము కలదు. పునరావృత్తికి లోనై వున్న విషయము పరిపూర్ణ భావజ్ఞులు గ్రహించి జ్ఞానముయొక్క సమగ్ర రూపము తెలిసినంత మాత్రమున చాలదని, దాని కతీతమై కేవలత్వం కల్గిన పరిపూర్ణ పరబ్రహ్మమును కూడా గ్రహించి ఆత్మాతీతం కేవలాత్మ అన్నట్లుగా కేవలత్వం కల్గిన పరిపూర్ణము నందు జ్ఞానా జ్ఞేయమైన గుర్తు (ఎరుకకు) మూలము గాని స్థానముగాని లేదని, ఇట్టి ఆరూఢతచేతనె సర్వ భ్రాంతి రహిత స్థితి కల్గ గలదని పరిశీలించి "పూర్ణమద: పూర్ణమిదం " మంత్రం ద్వారా " విద్యాంతం బ్రహ్మ విద్యాంతం" అను శ్రుతి ద్వారా ఈ భావమును సిద్ధాంతీకరించి యున్నారు. కావున దీనిని శ్రీమించు అచల బోధగా ఈ కందార్థము నందు పేర్కొన బడినది. సంస్కృత వాఙ్మయము నందె బ్రహ్మ విద్య అంతయు నిక్షిప్తమైవున్నది. అందు పరిపూర్ణ భావము కూడా చోటు చేసుకున్నది. "దేశభాషలందు తెలుగు లెస్స " అను నానుడి ప్రకారము శివరామ దీక్షితుల వారు సంస్కృత భాషయందు రహస్యముగా ప్రతిపాదింప బడిన ఈ సిద్ధాంతమును అచ్చతెనుగులో లోక కల్యాణము కొరకు సిద్ధాంతీకరించియున్నారు. రామానుజులు విశిష్టాద్వైత భావమును ద్రవిడ భాషలో ప్రతిపాదించినట్లే. నాగార్జునుడు బౌద్ధ మతమును పాళీ భాషలో ప్రతిపాదించినట్లే అని తెలియవలెను. అందువలన ఈ సిద్ధాంతమునకు శివరామ దీక్షిత సిద్ధాంతమని, బృహద్వాశిష్ట సిద్ధాంతమని, అచల సాంప్రదాయమని ప్రచారంలో పేర్కొన్నారు. వీరి గురు పరంపర ఎట్లనగా శివరామ దీక్షితుల వారి శిష్యుడు కంబాలూరి అప్పయ్య మంత్రిగారు వారి శిష్యుడు పరశు రామ సీతారామస్వామిగారు, వారి శిష్యుడు గ్రంథకర్తగారైన కృష్ణ దేశికేంద్రులు. ఈవిధంగా తానుచెప్ప దలచుకొన్న పరిపూర్ణ భావము పరంపరా ప్రోక్తముగా ఎట్లు తమకు సంక్రమించినదీ ఈకందార్థము నందు చెప్పబడు చున్నది.

# గ్రంథస్థ విషయము

పరిపూర్ణబోధ కేవలం గురు అనుగ్రహంచేత గురుముఖతా మాత్రమే తెలియవలసి వున్నది. జన్మాంతర వాసనల్లో ఎట్టి లోపాలున్నా శిష్యునికి అనుష్టాన క్రమం ద్వారా ప్రబోధ ద్వారా ఉపదేశ పద్ధతిచే బోధయందు ఆరూఢత గురువు కల్గించగలడు. గురువు అనుగ్రహంతో సిద్ధించని అంశం అంటూ వుండదు. ఈ అంశాన్నే గ్రంధస్త విషయముగా ఈ కందార్ధంలో చెప్పబడుచున్నది.

కం॥ శ్రీమత్సీతారామ। స్వామికృపన్జెప్పనయ్యె। సద సద్రహితం।
బేమిపదార్థ మెుదానిని। యీ మహికందార్థ ములుగా।
నివివినరయ్యా। ఓ జనులారార యిటుగనరయ్యా।
వేమారునేమిమ్ము వేడెదింతయసుమ్మి। నామీద కృపజేసి
ననుజదువుమనిమీర। లివివినరయ్యా। వోజనులారా।
యిటు గనరయ్యా॥ 7

## ప్రతిపదార్థము

ఓ జనులారా = పుట్టి నశించే స్వభావం కలవారా

ఇటు కనరయ్యా = నేను చెపుతున్న అంశాన్ని శ్రద్ధగా గమనించండి

వేమారు = అనేక పర్యాయాలు

నే మిమ్ము వేడెదింతియె సుమ్మీ = నేను మిమ్మల్ని ప్రార్థించే విషయం

నామీద కృపచేసి = నాయందు దయ వుంచి

నను చదువమని = గ్రంధకర్త నైన నాద్వారా వివరణ తెలుసుకుని

మీరలు = ఈ సభలో నున్నవారు

ఈ మహి = ఈ ప్రపంచమందు

కందార్థములుగా వినరయ్య =పాడు కొనుటకు వీలుగా అర్ధ సౌలభ్యం కలిగిన

సదసద్రహితము = సృష్టికి పూర్వము త్రికాలా బాధ్యమైన బ్రహ్మ పదార్థము యొక్క ఉనికి సత్ అనబడును. అట్లు గాక మార్పులకు లోనైనది అసత్ అనబడును.

ఏమి పదార్థమె=పైన పేర్కొన్న సద సత్తులు రెండు కాక మిగిలిన పదార్థము గురించి శ్రీమత్ సీతారామ స్వామి కృపన్ చెప్పనయ్యె = నాగురువు అయిన పరశు రామ సీతారామస్వామి అనుగ్రహముతో చెప్పుచున్నాను.

## తాత్పర్యము

నా గురుమూర్తి శ్రీ పరశరామ సీతారామ స్వామి అనుగ్రహముతో జనన మరణ రాహిత్యమును కల్గించు కొనుటకు మార్గముగా, అందరూ చదువు కొని పాడుకొనుటకు వీలుగా తేటతెలుగులో,కందార్థ రూపంగా ఈ గ్రంథము రచించినాను. ఓ సభాసదులారా! జనన మరణ రాహిత్యమునకై, ఈగ్రంథమందలి విషయమును, గ్రంథ కర్తనైన నేను చదివి చెప్పుటద్వారా మీకు గ్రంథమందలి బోధనాంశములు స్పష్టముగా తెలియుటకు వీలున్నది ఏలననగా ఇందు ప్రతిపాదింప బడుచున్న పరిపూర్ణ భావము ఎంతో గంభీరమై, మనో వాక్కుల కందనిదై సృష్టి మీమాంస చేయుటలో, గతంలో ప్రతిపాదించిన వేదాంతాంశములను క్రోడీకరించి, సమన్వయ పరచి సిద్ధాంతమును ప్రతిపాదించుట జరిగినది. పూర్వపు చరిత్రలో సృష్టి కారణమైన బ్రహ్మమును ప్రతిపాదించుట పట్ల ఒకరు సద్రూపము గాను వేరొకరు అసద్రూపము గాను వున్నదని నిర్ధారించినారు. దీనివల్ల మత భేదము లేర్పడినవి. సత్ అనగా త్రికాలా బాధ్యమైనది. అసత్ అనగా పరిణామ క్రమానికి లోనైమార్పు చెందునది. పరంపరా గతంగా వచ్చు గురు ప్రబోధ లోని వస్తు నిశ్చయజ్ఞానం ద్వారా పరిశీలించిన సృష్టి కారణమైన బ్రహ్మము పై రెండు లక్షణములు కల్గియున్నదని, రూపాయి నాణెమునకు బొమ్మ బొరుసువలె ఇవి కల్గివున్నవని, వీటితో సంబంధ పడక కేవలత్వము కల్గినదే సదసద్రహితమైన పరిపూర్ణ పరబ్రహ్మమని, ఈ అంశములన్నియు గురు కృపచే బోధనా పద్ధతిద్వారా దృఢ పరచు కొనవచ్చునని, అది ఎట్లో ఈగ్రంథము నందు వివరించ బడుచున్నదని ఇందు ప్రతిపాదింప బడుచున్నది.

 

# గ్రంథ కర్త గురుపరంపరాభి వర్ణనము

ఈ సాంప్రదాయం గురుపరంపరా ప్రోక్తమై తనకు సంక్రమించిన విధానము ఒక క్రమంలో ఈ కందార్థము నందు పేర్కొనబడుచున్నది.

కం॥ శివరామదీక్షితుల। శిష్యవరుండప్పయ్యమంత్రి।
యతనిశిష్యుడీ। భువిపరశురామవంశో। ద్భవసీతారాము
లతని భక్తుడ సుమ్మీ। తద్బోధప్ర। యుక్తుడసుమ్మీ। స్థవనీ
యులగుమీరు। త్సాహ ముతోయీ గాథ। వినుండీ
నేకందార్థములచే వినిపింతు। భక్తుడ సుమ్మీ। తద్బోధప్ర।
యుక్తుడసుమ్మీ॥ 8

## ప్రతిపదార్థము

శివరామ దీక్షితుల శిష్యవరుండప్పయ్యమంత్రి = ఈ అచల బోధ శివరామ దీక్షితులు గారి నుండి మొదలు అంతకు ముందు లేదా అంటే వున్నది గాని, ఒక పద్ధతిగా లేకపోవడం వల్ల దానినంతా ఒకచోట క్రోడీకరించి ఒక క్రమంలో చేర్చినవారు శివరామ దీక్షితులు. వారి శిష్యులు కంబాలూరి అప్పారావు అతని శిష్యుడు = అప్పయ్య మంత్రి గారి శిష్యులు

ఈభువి = ఈ భూమి మీద

పరశురామ వంశోద్భవ సీతారాములు = పరశు రామ వంశంలో పుట్టిన సీతారాములు అనుపేరు గలవారు.

అతని భక్తుడ సుమ్మీ = వారి శిష్యుడను. భక్తుడనగా త్రికరణశుద్ధి కలిగి ధర్మాచరణ కలవాడు

తద్బోద ప్రయుక్తుడ సుమ్మీ = ఆబోధ ఆరూఢత పొందినవాడు (విమర్శనా జ్ఞానము కలవాడు)

స్థవనీయులగు మీరు = ఎంతో ప్రజ్ఞా పాటవములు కల వారగు మీరు

ఉత్సాహముతో = పట్టుదలతో, శ్రద్ధతో

ఈ గాథ వినుండీ నేకందార్థములచే వినిపింతు = గురుశిష్యుల మధ్య జరిగినది ఈ కందార్థముల ద్వారా వినిపించెదను.

## తాత్పర్యము

శివరామ దీక్షితుల వారి శిష్యులు కంబాలూరి అప్పయ్య మంత్రిగారు, వారి శిష్యులు పరశురామ అనే ఇంటి పేరుగల వంశములో ప్రభవించిన సీతారామస్వామి, వారిని ఆశ్రయించి, త్రికరణశుద్ధిగా ఆత్మనివేదనము గావించుకొని, చతుర్విధ శుశ్రూషలచే వారిని మెప్పించి, ఒప్పించి వారి అనుగ్రహము ద్వారా పరిపూర్ణబోధను ఆరూఢ పరచుకొని, గురు ఋణంతీర్చుకొనుటకై లోక కల్యాణమునకు కృష్ణదాసు అను వ్యవహార నామముతో వున్న నేను ఈ పరిపూర్ణ బోధను కందార్థముల ద్వారా రచించి సభాసదులైన మీ ముందుంచినాను. ఇట్టి అంశము వినుటలో ఎంతో శ్రద్ధా భక్తులు కనపరచి స్తుతిమంతులైన మీరు ఈ గ్రంథమును వినవలసినదిగా కోరుచున్నాను.

## సుకవి ప్రశంస

కవిత్వ మనునది సాహిత్యము, సంగీతము, పాండిత్యము మొదలైనవి పూర్వజన్మ సుకృతముచే, దైవానుగ్రహముచే సిద్ధింపబడును, కాని వ్యక్తిగత గుణ దోషములచే ఆకవిత్వమునకు ఆవ్యక్తిగత గుణదోషములు కూడా సంక్రమించును. ఆగుణ దోషములచే వాటిప్రభావం ప్రచారం లోనూ సమాజం మీద కనబడుతుంది. సహృదయముతో కూడిన కవీశ్వరుని కవిత్వము, వారి వ్యవహార శైలి ఏవిధంగా వుంటుందో ఈ శీర్షిక లోని కందార్థముల ద్వారా ఈ గ్రంధకర్తగారు మనకు తెలియపరుస్తున్నారు.

కం॥ మనసిచ్చివినుడియొకనొక। మనవిదినాపాలి గురునిమ
దిలోపలనే। నునుచుకొని పెద్దలాజ్ఞను। పనిబూనుక చేస్తినిట్టి।
పద్యాములన్నీ। తప్పొప్పులేర్పడదిద్దుండన్ని। ఘనమతి
మంతూ లుగనుకానే ప్రార్థిస్తి। ననుమీ కటాక్షేక్షణము
లవీక్షింపూచు। పద్యాములన్నీ। తప్పొప్పులే। ర్పడదిద్దుండన్నీ॥9

## ప్రతిపదార్థము

మనసిచ్చి వినుడి = మనస్సును జ్ఞానేంద్రియ పంచకమునుండి గ్రహింపబడే విషయ పంచకం నుండి వేరు చేసి ఏకాగ్రమైన మనస్సుతో వినండి
ఇకనొక మనవిది = ఒక విజ్ఞప్తిని
నాపాలి గురుని మదిలోపల నేనుంచుకొని = నా కీ జ్ఞానమును ప్రసాదించిన శ్రీ పరశురామ సీతారామ స్వామిగారిని మనసులో నింపుకొని
పెద్దలాజ్ఞను పనిబూనుక చేస్తి నిట్టి పద్యములన్ని = వారి ఆజ్ఞాను సారంగా పరిపూర్ణ భావమును నాగ్రహింపు మేరకు గుర్వనుగ్రహం ద్వారా ఈ పద్యముల రూపంలో కూర్చినాను.
తప్పొప్పులేర్పడ దిద్దుండి=భాష యందు ఏ విధమైన లోపాలున్నా అవి సరిదిద్దండి
ఘన మతి మంతులు = ఆత్మానాత్మ వివేకముతో కూడిన బుద్ధి గలవారు
గనుక నే ప్రార్థిస్తి = అందుకే మనవి చేయు చున్నాను
నను మీ కటాక్షే క్షణముల వీక్షింపుచు = ప్రేమతో, అనుగ్రహముతో, ప్రోత్సహించే ప్రవృత్తితో ఈ గ్రంధము పరిశీలించండి

## తాత్పర్యము

కర్మణా, మనసా, వాచా గురుమూర్తి నిర్దేశించిన జీవనవిధానముతో వారనుగ్రహ విశేషముచే, వారిద్వారా గ్రహించిన పరిపూర్ణ భావము ఈ కందార్థ రచన ద్వారా సమాజ శ్రేయస్సు కోసం గురుర్వాక్యం యధా తధముగా రచించినాను. ఇందలి రహస్యం ఏకాగ్రమైన మనసుతో వింటేగాని అనుభూతికి రాదు. కనుక మీరు గురుదత్తముగా సంక్రమించిన భావమునకు, కవిత్వముతో జోడించి రాయడంలో కవిత్వ సాంప్రదాయంలో కలిగే లోటుపాట్లేమైనా వుంటే పెద్ద మనసుతో సరిదిద్ది నన్ను మీ అనుగ్రహ పాత్రుడ్ని చేస్తూ, ప్రోత్సహిస్తూ ముందుకు తీసుకుని వెళ్ళవలసినదిగా కోరుచున్నాను.

కం॥ వినిమీరివిదిద్దుండని। పనిబడిప్రార్థించనేల। పరుసము
నుఇను। మిట్లనునెస్వర్ణముజైమని। తన కైతానౌను సన్ని। ధానా
మందుంటే। తెల్పుడియను। మానామిందుంటే। మనవీజేసు
నెపాలిమ్మనిలేగతల్లికి। తనకైతానిచ్చూను దయచేసితా।
సన్నిధానామందుంటే। తెల్పుడియను। మానామిందుంటే॥ 10

## ప్రతిపదార్థము

విని = నే చెప్పగా గాని, వినగా గాని
మీరివి = సభా సదులైన మీరంతా ఈ పద్యములన్ని
దిద్దుండనిన్నీ = లోటు పాట్లు సవరించుడని
పనిబడి ప్రార్థించ నేల = పనికట్టుకుని కోరవలెనా
పరుసము నిను మిట్లను నెస్వర్ణము చేయమని = పరసవేదిని ఇనుము ఇట్లు కోరునా తనని బంగారం చేయమని
తనకై తానౌను సన్నిధానమందుంటె = తనంతట తానుగానే మారును స్థాన శుశ్రూష ప్రభావంచే
మనవి చేసునె పాలిమ్మని లేగ తల్లికి = అమ్మా నాకు పాలిమ్మని లేగదూడ తల్లి నడుగ వలెనా
తనకై తానిచ్చును = తనంతటి తానుగానే ఇచ్చును
దయచేసి తా సన్నిధానమందుంటే = దూడ ఆవు సన్నిధిలో ఉండడమె

## తాత్పర్యము

నేను చదవగా మీరు విని ఇందలి తప్పొప్పులు దిద్దమని మిమ్మల్ని ప్రత్యేకంగా పనిగట్టుకుని ప్రార్థించవలసిన పనిలేదు. ఏలననగా సాన్నిధ్య మాత్రం చేతనె అనగా స్థాన శుశ్రూష ప్రభావం చేతనే పరుసవేది సన్నిధిలో ఇనుము బంగారమైనట్లుగా, తల్లి సన్నిధానంలో లేగదూడ ఆకలి తీరినట్లుగా అడగకుండానే, ఎట్టి స్వప్రయత్నము లేకుండానే ఎలా మార్పుచెందు చున్నవో, ఈ విధానము లోకములో ఎట్లు ప్రసిద్ధముగా చెప్పబడుచున్నదో, దీనియందు ఎటువంటి అనుమానము, ఎట్టి సందేహము కల్గుట లేదో

ఆవిధంగానే మీరు దీని యందలి భావమును గ్రహించుడి అని చెప్పబడుచున్నది

కం॥ అప్పయ్యకవీయమ్మాద్యాంధ్రమును। లాప్పగుమాఘాదికావ్య
మొగిజదివికృతిన్। తప్పనికవులకుసమముగ తప్పులులేనీ
కుండజెప్ప తరమౌనకృతినీ। ఊహనుజేస్తి। మరినేనికృతినీ।
గొప్పపక్షులతోటి। కొదువాపక్షులుసాటె। కుప్పారవీధిని
కుడ్యాడెటందూకు। తరమౌనాకృతినీ। ఊహనుజేస్తి మరి
నేనీకృతినీ ॥ 11

## ప్రతిపదార్థము

ఆంధ్రము = తెలుగులో

అప్పయ్య కవీయము = అప్పయ్య కవి అను పండితుడు కవిత్వము గూర్చి రాసిన ప్రామాణిక గ్రంధము

మాఘాది కావ్యము = మాఘుడు అను కవీశ్వరుడు కవిత్వము నందలి సాంప్రదాయమును గూర్చి వ్రాసిన సంస్కృతకావ్యము

ఒగి చదివి కృతిన్ తప్పని కవులను = శ్రద్ధగా, పరిశీలనగా చదివి అందలి విలువలన్నియు గుర్తించి పాటించిన కవులు

సమముగా = సరిపడగా, సంతృప్తి పరచగా

తప్పులు లేకుండా చెప్పతరమా నాకృతిని = వారికి సంతృప్తి కల్గువిధంగా కవిత్వం చెప్పుట నాతరమా

ఊహనుజేస్తి = పరిపూర్ణ బోధయొక్క తీరుతెన్నులు స్పష్ట పరచుటకు వాక్కు మనస్సు సరిపోవు గనుక ఊహ అనుశబ్దము ప్రయోగిపబడినది.

గొప్ప పక్షులతోటి కొదువ పక్షులు సాటె = గొప్పపక్షులైన గ్రద్ధ, రాబందు చిన్నపక్షులైన పిచ్చుక, చిలుక గమనంలో సమానమే

కుప్పార వీధిని కూడ్యాడేటందుకు = ఆకాశవీధిలో కలిసి మెలసి తిరిగేటందుకు.

# తాత్పర్యము

ఈ సిద్ధాంతము సంస్కృత భాషయందు నిక్షిప్తమై యున్నది. అట్టి దానిని తెలుగులో వ్యవహారిక భాషలో కందార్థముల ద్వారా వ్రాయుట జరుగుచున్నది. కవిత్వ సాంప్రదాయములో మాఘుడు అనుపేరుగల సంస్కృత పండితుడు కవిత్వ రచనలోని మెళకువ లను సంస్కృతభాషలో రచించినారు. అప్పయ్య కవి అను పండితుడు ఆంధ్రభాష యందలి కవిత్వ సాంప్రదాయ విషయములను తెలుగులో ఒక ప్రామాణిక గ్రంథముగా రచించినారు. క్రొత్త వారెవరైనా కవిత్వంలో ప్రవేశించి గ్రంథ రచన గావించుటకు ముందుగా పైనపేర్కొన్న రెండు ప్రామాణిక గ్రంథములను పరిశీలించి వారు రచనకు పూనుకొన వలసి వున్నది. ఇదొక సాంప్రదాయ బద్ధమైన అర్హతగా, యోగ్యతగా కవిత్వ ప్రపంచంలో చెప్పబడుచున్నది. కాని ఇట్టి సాంప్రదాయమును పాటించకుండానే గురు కృప ద్వారా సాధించిన పరిపూర్ణబోధను ఈ కందార్థ రచన ద్వారా చెప్పుచున్నాను. సాంప్రదాయ బద్ధమైన కృషి చేసి అందలి మెళకువలన్ని తెలిసి పాటించు వారికి అట్టి అర్హత, యోగ్యత లేని నేను చెప్పబోవుట సాహసమే అవుతుంది. విన్నగురు ప్రబోధను మననము చేయుటలో కల్గిన భావములే ఈ కందార్థములు. ఈ విధాన మెట్లున్న దనగా ఆకాశ గమనంలో విహరించే పక్షులు పెద్ద, చిన్న తారతమ్యము వారి శక్తి యుక్తులచే ప్రకటితమై హెచ్చు తగ్గులుగా నుండునుగాని, విహరించు స్థానము ఏకమే గదా!

కం॥ ఛందంబెరుగక పద్యము। లెందుకంజేసెదవటంచు
యెందరనిననే। సందేహింపకచేసితి। నిందులతప్పుంటెమీర।
లీవిదిద్దేరనుచూ। నేజదివితె। చెవియొగ్గివినుచూ। అంద ముగా।
చిత్తమందిట్లుతలపోసి। కంధార్థములను మీ। ముందారబెట్టితి।
యివిదిద్దేరనుచూ। నేజదివితె। చెవియొగ్గి వినుచూ॥ 12

## ప్రతిపదార్థము

ఛందము = విధానము (మార్గము) సాంప్రదాయము, శాస్త్రము. ఇక్కడ చంధము అనగా శాస్త్రము

ఎరగక = చదవక

పద్యములు = పద్యకావ్యములు

ఎందుకు చేసెదవటంచు ఎందరనిన = తెలిసీ తెలియని ధోరణిలో, అనర్హతతో ఎందుకు రాయ బడినవని (ఎంతమంది విమర్శించిన)

నే సందేహింపకజేసితి=ఎట్టి సందేహం లేక నిర్భయంగా రాయవలసి వచ్చింది

ఇందలి తప్పులుంటే మీరలివి దిద్దేరనుచు = సాంప్రదాయ విధానమునకు సరిపడని వేమైనా వుంటె

నే చదివితీ చెవిఒగ్గి వినుచు = నా అభిప్రాయము, ఆలోచన విడమర్చి చెప్పడం ద్వారా కవిత్వ సాంప్రదాయంలో వున్నలోపములు ఏమైనా వుంటే నే చదివితే దిద్దబడును

అందముగా చిత్త మందిట్లు తలపోసి = స్పష్టముగా, ఎట్టి సంకోచం లేకుండా మనసులో భావించి

కందార్థములను మీ ముందర బెట్టితి = ఈ గ్రంధరచనను మీ ముందుంచినాను

## తాత్పర్యము

ఈ కందార్థ రచన ఛందో శాస్త్రమునందు చెప్పబడిన విధి నిషేధములు పాటించకుండా కేవలం గురు అనుగ్రహం ద్వారా రచింపబడినట్లు విధి నిషేదములు తు.చ. తప్పక పాటించు వారు వారిదృష్టిలో ఈరచనయందు కల్గిన లోపములు సరిదిద్ద బడే టట్లుగా ఒక విశాలమైనదృష్టి తో ఆలోచించి ఈ గ్రంధము రచించి మీ ముందుంచినాను. ఈ లోపములు గ్రంధ కర్తనైన నేను చదువగా సమగ్ర దర్శనం కల్గిన మీరు వినగా లోపములు, వాటికి సవరింపులు జరుగుతాయని ఈ కందార్థంలో చెప్పబడుచున్నది.

కం॥ పునరుక్తిగలిగియుండిన। వినికోపముశాయువలదు।
వేడుకొనియెదన్। వినువారుదూరపర్థము। గనవలెదగ్గెరన
టంచు। గల్పించినానూ। తెలియకకాదీ। గ్రంథాములోనూ।
జననీజనకులు। తమతనయూలపునరుక్తి। వినగోరుదురు
తప్పం చనకానేనదిదెలసి। కల్పించినానూ। తెలియకకాదీ।
గ్రంథాము లోనూ॥ 13

## ప్రతిపదార్థము

పునరుక్తి = చెప్పినదే చెప్పడం

కల్గియుండిన = ఈ గ్రంథరచనలో ఎక్కడైనా ఉన్నట్లు గమనిస్తే

విని కోపము సేయవలదు = చూసి తప్పుగా భావించవద్దు

వేడుకొనియెదన్ = ప్రార్థిస్తున్నాను

వినువారు = గ్రంథరచన పరిశీలించేవారు

దూరపదార్థము కనవలె దగ్గరటంచు = మనో వాక్కుల కందని పరిపూర్ణ భావము మనము గుర్తించి ఆరూఢ పరచుకొనుటకువీలుగా

కల్పించినాను = రచించినాను

తెలియక కాదీ గ్రంథము లోను = ఈ గ్రంథమునందు విధి నిషేధాలు పాటించుటలో తెలియక చేసిన అంశము కాదు

జననీ జనకులు తమ తనయుల పునరుక్తి వినగోరుదురు = తల్లి తండ్రులు తమ పిల్లల మాటలు తప్పించక సంతోషముతో మరల మరల వినుటకు ప్రయత్నింతురు.

## తాత్పర్యము

కవిత్వరచనలో చెప్పినమాట చెప్పుట ఒక దోషము. ఈ గ్రంథ రచనలో ఈ అంశము చాలా స్పష్టముగా కనపడుచున్నది. సాంప్రదాయ పద్ధతి యందు ఇది దోషముగా కన్పించినా అర్థసౌలభ్యము కొరకు చెప్పిన మాటే తిరిగి చెప్పడం జరిగింది. ఎందు చేతననగా పరిపూర్ణ భావము మనో వాక్కుల కందని దై గురుముఖత: బోధనా పద్ధతిగా మాత్రమే దృఢ

పరచుకొనవలసి వున్నది. అందుచే బోధ దృఢీ కరణ కొరకు చెప్పినదే మరల మరల చెప్పడం జరుగు చున్నది. ఈ అంశమును శ్రోతలైన మీరు స్పష్టంగా గ్రహించవలెను. భావమే ముఖ్యము గాని దోషముగా ఎంచకండి. ఎట్లనగా తల్లి తండ్రులు వారి పిల్లల మాటలు పదే పదే చెప్పించుకుని ముద్దుగా భావించి ఆనందింతురే కాని తప్పుగా భావించరు. ఈ అంశమునే నేను దృష్టి యందుంచుకొని ఈ రచన మీముందుంచినాను అని భావము.

కం॥ ఇదియాంధ్రకవిత్వంబని। మదిరోయందగదుదీనిమర్మన్
మరయుడీ। పదియారువన్నెపసిడిని। ముదము నతోల్పెట్టె
నుంచముట్టాకుండుదురా। లోకులుచాత। బట్టాకుండుదురా।
యిదిగాక కులహీనుచ్చానద్రవ్యాము। విదితావుుగా
యెంతవేత్తలైననుదాన్ని। ముట్టాకుండుదురా। లోకులుదాత।
బట్టాకుండుదురా॥ 14

## ప్రతిపదార్థము

ఇది ఆంధ్ర కవిత్వం బని = ఇది తెలుగులో రాయబడిన కవిత్వమని
మది రోయం దగదు = మనసులో తక్కువగా అంచనా వెయ్యకండి
దీని మర్మమరయుడి = ఇందలి రహస్యాన్ని తెలుసు కోండి
పదియారు వన్నెల పసిడి = పదహారు వన్నెలు కల్గిన బంగారం
ముదమున = సంతోషముతో
తోల్పెట్టెనుంచ = సూట్ కేస్‌లో పెట్టగా
ముట్టకుండుదురా = చేతితో తాకకుండా వుంటారా?
లోకులు = జనసమూహము
చేత పట్టకుండుదురా = సూట్‌కేస్ చేతికి తగలకుండా బంగారాన్నైనా ముట్టకుండా వుంటారా?
ఇదియును గాక కుల హీనుడిచ్చిన ద్రవ్యము = అంటరాని వారు తీసుకు వచ్చిన డబ్బు
విదితముగా = స్పష్టముగా
ఎంత వేత్తలైనా = ఎంత గొప్ప వారైనా

## తాత్పర్యము

కవిత్వమునందు సంస్కృత భాష చాలాశ్రేష్ఠమైనది. దీనిని దేవభాష అని కూడా అందురు. వాఙ్మయమంతయు, రచనలన్నియు ఈ కారణముగా సంస్కృతములోనే వ్రాయబడి యున్నవి. ముఖ్యమైనవి, ముఖ్యంకానివీ కూడా సంస్కృతము నందే యుండుటచే మతకర్తలు కూడా వారి మత సిద్ధాంతాన్ని సంస్కృత భాషయందే వ్రాసి వున్నారు. దీని అవసరం, ప్రయోజనం రాను రాను అందరికీ తెలియ పరచే ఉద్దేశంతో ప్రాంతీయ భాషల్లోకి ఆరచనలన్నీ అనువదింపబడినవి. ఆ విధంగా పరిపూర్ణ భావం కూడా అచ్చ తెలుగులో ఈగ్రంధ రూపంగా వ్రాయడం జరిగింది. భాషాభిమానంతో కాకుండా భావమునకు ప్రాధాన్యతనిస్తూ ఈ గ్రంథమును పరిశీలించండి. 16 వన్నెలతో కూడిన విలువైన బంగారాన్ని సూట్‌కేస్ లో వుంచి నంత మాత్రం చేత బంగారం విలువ తగ్గుతుందా? అంటరాని వాడు తీసుకు వచ్చిన డబ్బు అపవిత్రం అవుతుందా? డబ్బుకు, బంగారానికి ప్రాధాన్యత నిస్తూ తోలు పెట్టెకు, అంటరాని వానికి ప్రాధాన్యత నివ్వకుండా వ్యవహరించినట్లుగానే భాషకు ప్రాధాన్యత నివ్వకుండా, భావమునకు ప్రాధాన్యత నివ్వ వలసినదిగాకోరుచున్నాను. ఎందుకనగా సంస్కృత భాషా జ్ఞానము చాలా తక్కువ మందికే పరిమితమై వున్నది. ప్రాంతీయ భాషైన తెలుగులో దీన్ని వ్రాయడంచేత సంస్కృత భాషా జ్ఞానము లేకపోయినవారు కూడా ఎక్కువమంది తెలుగులో వున్న ఈ భావం గ్రహించి జన్మ సార్ధకత లోక కల్యాణం జరుగునని తెలియ వలెను.

కం॥ ఆసాంతముయీగ్రంధము। ప్రాసయుతుల్‌శబ్ద గణము
భావముయుక్తుల్। జూచిసరిపడనిచోటను। యీసభలో
పెద్దలెల్లా। యిదిదిద్దవలెనూ। దిద్దియిదేనా। మదికద్ధవలె
నూ। మీసాటివారికి వ్యాసాటలేదుంటే। నాసాటివారిబ్రత్కే
సాటిగాకుండు। నిదిదిద్దవలెనూ దిద్దియిదేనామది కద్ధవలెనూ॥ 15

## ప్రతిపదార్థము

ఆసాంతము = మొదటి నుండి చివరి దాకా

ఈ గ్రంథమును చూచి = ఈకందార్థములు విని, పరిశీలించి

ప్రాస, యతులు, శబ్దము, గణము, భావము, యుక్తుల్ = ప్రాస, యతి, శబ్దము, గణము, భావము, యుక్తి

సరిపడని చోటను = సాంప్రదాయ పద్ధతికి భిన్నముగా ఉన్నచో

ఇది దిద్దవలెను = ఈ అంశములను సవరించవలెను.

ఈ సభలో పెద్దలెల్లా = ఈ సమావేశంలో వున్నటువంటి పండితులందరు

దిద్ది ఇదే నామది కద్దవలెను = మీరు సవరించిన సవరింపు నాకు ఆమోద యోగ్యముగా నుండవలెను

మీ సాటివార్కి = సర్వజ్ఞులైన మీ అందరికీ

వ్యాసాటలేదు = పెద్ద శ్రమ అయిన పని కాదు

వుంటే = ఒక వేళ శ్రమ అనుకుంటే

నాసాటి వారి బ్రతుకు ఏ పాటి గాకుండు = సమగ్రమైన కవిత్వ సాంప్రదాయము లందు ప్రవేశము లేని నాలాంటి వారి కృషి ఏమవ్వాలి?

## తాత్పర్యము

ఈ సభలో కవిత్వ సాంప్రదాయము లన్ని సమగ్రంగా తెలిసియున్న పండితులు చాలామంది కలరు. వారికి నా విజ్ఞప్తి ఏమనగా ఈ గ్రంథమును మొదటినుంచి చివరి దాకా బాగా పరిశీలించి రచన యందు ప్రాస, యతి, శబ్ద గణము, భావము యుక్తి మొదలైనవి వాటి వాటి స్థానములలో వున్నది, లేనిది పరిశీలించి అవసరమైనచోట మార్పులు, చేర్పులు చేయవలసినదిగా కోరుచున్నాను. మీ రొనరించిన మార్పులు, చేర్పులు నాకు సంతృప్తిని, అవగాహనమును కలిగించ వలయును. ఈ ప్రక్రియ మీ అంతటి సర్వజ్ఞులకు శ్రమతో కూడుకున్న పనికాదు. మీకు శ్రమైతే నాలాంటి వారి రచనలు ఎట్లు అభివృద్ధిలోకి రాగలవు అని భావము.

## కుకవి నింద

సృష్టిలో మంచి స్వభావమున కెంత శక్తి కలదో, చెడు స్వభావమునకు కూడా అంతే శక్తి కలదు. వీటిని చీకటి వెలుగులతో, జ్ఞానాజ్ఞానములతో పండితులు పోలుస్తారు. ఈ రెండూ సృష్టిలో ఓత ప్రోతమై వుంటాయి. అచ్చంగా చీకటిగాని, వెలుతురు గాని, కేటాయింపబడి ఉనికి గల్గి వుండవు. ప్రాపంచికులైతే చెడుకి ప్రాధాన్యత నిచ్చినట్లుగా, మంచికి ప్రాధాన్యత నివ్వరు. పారమార్ధిక జీవనంలో చెడుకి ప్రాధాన్యత నివ్వకుండా మంచినే ఆదర్శంగా చేసుకుని, దానికి ప్రాధాన్యత నిస్తూ, చెడుయొక్క తీవ్రతను తగ్గించు కోడానికి ప్రాధాన్యత నిస్తారు. చెడు అనకు, చెడు వినకు, చెడు కనకు అను సూక్తిని విజ్ఞులు పాటిస్తారు. ఈ ఆదర్శమునే ఈ కందార్ధములో మనకు ఉపదేశిస్తూ ఒక వ్యక్తిని సంస్కరించడంలో వాని చెడుని వాడే గుర్తించు కొనేలా చేయడం ఎట్లు సాధ్యమో ఈకందార్ధములో వివరించినారు.

కం॥ తప్పొప్పులురెంట్నెరుగని। తప్పుతనందుండిదీన్ని। తప్పని
కూసే। తప్పుడునరునకుజెప్పెద। చప్పుడుచాలించు
మనుచు। సభవారువినగా। సరెసరెనాని। సభవారిట్లనగా।
చెప్పినవిన కుంటే। తప్పువానిదెసుమ్మీ। తప్పొగలిగినవెనుక।
గొప్పావాడె ట్లౌనుసభవారువినగా। సరెసరెనాని। సభవారిట్లనగా॥16

## ప్రతిపదార్ధము

తప్పొప్పులు రెంట్నెరుగని తప్పు = సరియైన మార్గము కానిది ఒప్పు = సక్రమమైన మార్గమును సూచించునది

రెంట్నెరుగని = పైరెంటినీ గుర్తించని

తప్పు తనందుండి = లోపము తనయందు కలిగుండి

దీన్ని తప్పని కూసే = ఈగ్రంథమును సరియైనది కాదని విమర్శించే

తప్పుడు నరునకు = లోపభూయిష్టమైన అవగాహన కల్గినవాడు, సమగ్రమైన అవగాహన లేనివాడు.

చెప్పెద = వివరంగా, నిర్దుష్టంగా
చప్పుడు చాలించుమనుచు = అధిక ప్రసంగం మానమనుచు
సభవారు వినగా = సభయందున్నవారు ఆమోదించునట్లుగా
నరె నరె నని సభవారిట్లనగా = చాలా స్పష్టముగా, వివరముగా, సమంజసంగా వుందని సభలోనివారుఆమోదించగా
చెప్పినా వినకుంటె తప్పు వానిదే సుమీ = లోపము ఎత్తిచూపించినపుడు అది సహృదయంతో గుర్తించి దిద్దుకునే ప్రయత్నం చేయడం ఇది విజ్ఞుల లక్షణం
తప్పు కలిగిన వెనుక గొప్పవాడెట్లౌను? = అట్టి తప్పును గుర్తించి దిద్దుకునే ప్రయత్నం చేయనివాడు
తప్పొప్పులు రెంట్నెరుగని తప్పు తనదుండి = గ్రంథ పరిశీలనకు గ్రంథముయొక్క గ్రంథకర్త యొక్క అభిప్రాయమును, ఆరూఢతను, సాంప్రదాయమును స్పష్టంగా తెలిసుండక
దీన్నితప్పని కూసే = ఈ గ్రంథమందు తప్పునెంచే

## తాత్పర్యము

గ్రంథ పరిశీలనకు కావలసిన యోగ్యతలలో 1. గ్రంథమునుగూర్చి సమగ్రమైన అభిప్రాయము 2. గ్రంథస్థమైన ఆధ్యాత్మిక విషయములను గూర్చి అవగాహన, సహృదయము, సద్విమర్శ ఇవి ముఖ్యముగా వుండవలసిన అంశములు. అట్లుగాక మిడి మిడి జ్ఞానముతో గ్రంథమును పరిశీలించుట, అందలి లోపములు ఎత్తి చూపుట తప్పు విషయంగా, అటువంటి వ్యక్తిని తప్పుడు నరునిగా ఈ కందార్థమునందు పేర్కొన బడుచున్నది. ఇక ఒప్పు అనగా సమగ్ర దర్శనంతో, సమిష్టి ఆలోచనతో, భావముతో విభేదిస్తూ సవరించ ప్రయత్నించుట విజ్ఞుల లక్షణంగా చెప్పబడుచున్నది. స్వతహా తనకు అట్టి వివేచన విజ్ఞత లేనపుడు దాన్ని తనకు తానుగా గుర్తించిగాని, మహాత్ములైనవారు తనయందున్న లోపమును గుర్తింపజేసి సవరింప ప్రయత్నము చేసినపుడు అదిగ్రహించి, గుర్తించి సవరించుకొనబూనుట బుద్ధిమంతుల లక్షణము. సమగ్ర దర్శనంలో,

ఆరూఢతలో, విషయనిరూపణలో ఎట్టిలోపములు లేనివారినే మహాత్ము లనెదరు. వీరు వారికున్న ఆరూఢతతో ఎదుట వారియందున్న భావమును అందుగల లోపములను ఎత్తి చూపి సవరింప ప్రయత్నించెదరు. సవరింపు కంగీకరించనివాడు గొప్ప వాడుగా ఎట్లు చెప్ప బడును? తప్పుకల్గి వుండడం సహజమనియు దానిని గుర్తించి దిద్దుకొనువాడు గొప్ప వాడనియు ఇందు చెప్పబడు చున్నది. జన్మ రాహిత్యమునకు పరిపూర్ణ బోధయే ఒప్పు. ప్రపంచంలో ఆత్మానాత్మ వివేకము ద్వారా ఆత్మసాక్షాత్కారమె మోక్ష సాధనగా, గమ్యంగా చెప్పబడుచున్నది. సిద్ధాంత రీత్యా ఈ భావము తప్పు. ఈ రెండంశములు గుర్తించి సవరింప బడుటకు ఈ గ్రంధరచన సహాయ పడగలదని ఈ కందార్ధము ద్వారా తెలియబడుచున్నది.

## సజ్జన దుర్జన నిర్ణయము

ప్రపంచంలో మంచి చెడ్డలు రెండూ కలసి ఓత ప్రోతంగా వుంటాయి. అచ్చంగా మంచిగాని, చెడుగానీ కేటాయించి ఉండవు. గుణ దోషమయం సర్వం అన్నట్లుగా మంచి చెడ్డలతో ఈ ప్రపంచం కూడి వుంటుంది. సమ పాళ్ళలో కాక హెచ్చు తగ్గుల్లో ఉండడంచేత దానిప్రభావం ఆవ్యక్తిత్వం మీద పనిచేస్తుంది. దానిప్రకారం జీవనవిధానం ఆధారపడి ఉంటుంది. ఆవిధంగా సజ్జనులు, దుర్జనులు మంచి, చెడులు లాగ సమాజంలో కలిసి మెలిసి వుంటారు. జీవనవిధానంలో అవి స్పష్టంగా కనపడేలా వునికి కల్గి వుంటారు. అట్టి వారి విధానం ఎలా వుంటుందో ఈ కందార్థంలో చెప్ప బడింది.

కం॥ ఇలు జొచ్చిగ్రాఘుసింహాము। కలదొంతులుగూల్చు
నింటిగరితలొరుగుదొం। తులుచక్కజేతురట్లనె। యిలను
కవిజనోక్తి తప్పులెంచూదుర్జనుడూ। తప్పొప్పుగావించు
సజ్జనుడూ। తులలేనిబుద్ధిమంతులు సర్వజ్ఞులుమీరు।
తెలుసూనాతలపు నేదెలిపెదేమికతప్పు। లెంచూదుర్జనుడూ।
తప్పొప్పుగా। వించూ సజ్జనుడూ॥ 17

 

## ప్రతిపదార్థము

గ్రామ సింహము = గ్రామాలలో యధేచ్ఛగా తిరిగే జంతువు, కుక్క
ఇలుజొచ్చి = ఇంట్లోప్రవేశించి
కలదొంతులు గూల్చు = నిల్వవుంచుకొన్న కుండల సమూహాన్ని క్రింద పడవేయును
ఇంటి గరితలు = ఇంట్లో వున్న స్త్రీలు
ఒరుగు దొంతులు = నేల పాలై పగిలిన కుండలు
చక్క చేతురు=సవరించుకుని పగిలినవి పోగా మిగిలినవి జాగ్రత్త పెట్టుకునేవారు
అట్లనే ఇల = ఆ విధంగానే ఈ ప్రపంచంలో
సుకవి జనోక్తి = మంచివారు చెప్పే మంచిమాటలు
తప్పులెంచు = తేడాని లోపాన్ని ఎంచు
దుర్జనుడు = చెడు స్వభావం కలవారు
తప్పు ఒప్పుగావించు = జరిగిన తేడాను సవరిస్తాడు
సజ్జనుడు = మంచి ఆలోచన కలవాడు
తుల లేని బుద్ధి మంతులు = సాటిలేని ఆలోచన, అవగాహన కలవారు
తెలుసూ నాతలపు = నా ఆలోచన స్పష్టంగా మీకు తెలుసు
మీకు తెలిపే దేమిక = విడమరచి వేరే చెప్పవలసిన అవసరంలేదు.

## తాత్పర్యము

గ్రామాలలో ఇల్లాలు తమ సంసారానికి కావలసిన సామగ్రి అంతా సంతలలో కొనుగోలు చేసుకుని, నిల్వ వుంచుకొనుటకు మట్టితో తయారు చేసిన కుండలలో ఆ సామాగ్రి నిల్వవుంచి అవిదొంతర్లుగా పేర్చి ఒకమూల నిల్వవుంచును. కార్యార్థమై బైటకు వెళ్ళినపుడు తలుపు దగ్గరకు వేసి వుంచడంలో గ్రామాలలో యధేచ్ఛగా సంచరించుచు నిరభిమాన పూర్వకముగా నుండు కుక్క ఇంట్లో ప్రవేశించి తనకు తినుటకు వీలుగా పదార్థమేమన్నా వున్నదేమోనని తననోటితో ఆ దొంతర్లను తోసి

క్రిందపడవేయును. దొంతర్లు పడిన శబ్దమునకు భయపడి ఏమీ తినకనే పారిపోవును. ఆశబ్దము విని ఇంట్లో ప్రవేశించిన ఇల్లాలు కుక్క స్వభావమును ఎరిగుండి దాని జోలికి వెళ్ళకనే ఒరిగిన దొంతరలలో గల వస్తువులు నేలపాలు కాగా మిగిలినవి బాగుచేసుకొని జాగ్రత్త పెట్టు కొనును. అలాగే దుష్ట స్వభావముతో నున్నవ్యక్తి సత్పురుషులచే వ్రాయబడిన గ్రంధములలోని అంశములు పరిశీలిస్తూ అందలి ధార్మిక, ఆధ్యాత్మిక సత్యములకు ప్రాధాన్యమివ్వక దోషములు మాత్రమే ఎంచి చులకన జేయుటకు ప్రయత్నింతురు. సత్పురుషులైతే దోషములున్న అవి ఎంచక వాటిని ఒప్పులుగా ఎంచి గ్రంధ మందలి సత్యత్వమునకు సరిపడునట్లుగా సవరింతురు. ఇందు కుక్కల స్థానములో దుర్జనులు, ఇంటి గరితల స్థానములో సత్పురుషులను వూహించవలెను. ఈ సభలోని వారంతా సాటిలేని సర్వజ్ఞత్వమైన ఆత్మానుభూతిని పొందిన వారుగా భావించి ఈ గ్రంధకర్తగారు ఈ గ్రంధ మందలి గుణ దోషములు సజ్జనుల స్థానములో వుండి సవరించ వలసినదిగా ఈ కందార్థము ద్వారా తెలియపరచుచున్నారు.

కం॥ తనగొప్పనెంచరేమో। జనులనితలపోసిసాధు। జన
కృతకవితల్। వినడితరులువినగోరిన। వినకనరాద నుచుమ
నసువిరుచూ దుర్జనుడూ। వినివినిపించు వేడ్కా సజ్జనుడూ।
కనవొచ్చెముంజేతికంకాణాలకువేరే। ఘనవిల్వ టద్దాముగా
వాలె నామనసు। విరుచూ దుర్జ నుడూ। వినివినిపించు।
వేడ్కాసజ్జనుడూ॥ 18

## ప్రతిపదార్థము

దుర్జనుడు = చెడు స్వభావము కలవాడు

తన గొప్పనెంచరే మొజనులని = ప్రజలు తన ఆధిక్యతను, పేరును, ఉ నికిని గుర్తించరని

తలపోసి = మనసులో భావించి

 

సాధుజన కృతకవితల్ = లోక కల్యాణమునకు సమాజశ్రేయస్సుకు సత్పురుషులు గావించిన కవిత్వమును గూర్చి

వినడు = తను వినడు, చదవడు

ఇతరులు వినకోరిన =ఇతరులెవరైనా ఆసక్తి గలవారు విన, చదవ దలచినచో

విన కనరాదనుచు మనసు విరుచు = విన వలసిన అవసరంగాని, చదవ వలసిన క్రొత్త విషయంగానీ ఏమీ లేదని ఆసక్తిలేకుండా చేయును

సజ్జనుడు = సహృదయంతో ఎదుటివారి మంచి కోరువాడు

వేడ్క = సంతోషంతో

విని వినిపించు = తాను వినడం, ఎదుటి వారు వినగల్గేలా చేయడం

కనవచ్చె ముంజేతి కంకణాలకు =చేతులకి ఎదురుగా కనపడుతున్న గాజులు చూడడానికి

వేరెఘన నిలువుటద్దము గావలెనా? = ప్రత్యేకంగా పెద్దదైన అద్దం అవసరమా?

## తాత్పర్యము

అహంకార అభిమానములకు లోనై తన ఉనికిని, తన గొప్పతనాన్ని ఇతరులకు తెలియపరచి తన ఆధిక్యతను చాటుకొనుటకు తనకంటే గొప్పవారు సహృదయంతో సమిష్టి శ్రేయస్సుకు వ్రాసిన గ్రంధాలను తను వినుటగాని, చదువుట గాని చేయక పోగా, తనను ఆశ్రయించినవారిని గూడా ఇతరులు వ్రాసిన గ్రంధములు, వినుట, చదువుట లో గల ఆసక్తిని లేకుండాజేయును. సహృదయులైన సత్పురుషులైతే వారి నాశ్రయించినవారిని కలుపు కొని "వినదగు నెవ్వరు చెప్పిన " అన్నట్లుగా స్వయముగా తాను వినుట చదువుటయే గాక తన వారి చేగూడా ఈప్రక్రియ పాటింపజేయుదురు. దీనివలన సత్యాన్వేషణలో అనేక లోకానుభవములు కలిగి, తాను గ్రహించిన విషయము ఏమేరకు సరిపోవునో, సరిపోదో అని గ్రహించుటకు వీలగును. ఈ భావము ఈ కందార్థమునందు వర్ణిస్తూ చేతికి గాజులువేసుకొని తనకళ్ళఎదుట అవి ప్రత్యక్షముగా కనపడు చుండగా అది చాలదన్నట్లు నిలువుటద్దము ప్రత్యేకముగా తెచ్చి అందు తన చేతి గాజులు చూచుట అవసరమా? అని ఒక లోకోక్తిని ఇందు ఉదాహరించినారు.

# గ్రంథనిర్మిత విధానము

ఈ గ్రంథము యొక్క సమగ్ర రూపము ఈ కందార్థము నందు పేర్కొన బడుచున్నది. ఇల్లు కట్టుకునే ముందు కట్టుకో దలచిన ఇంటిని గూర్చిన నమూనా ఎలా అవసరమో, జనన మరణ రహిత విధానమునకు వ్రాయబడిన ఈ గ్రంథ రచనకు ఈ కందార్థం అటువంటి నమూనా లాంటిది. చెప్ప దలచుకొన్న, చేయ దలచుకొన్న విషయాన్ని క్లుప్తంగా, సూక్ష్మంగా వినేవారికి, చదివేవారికి ప్రాధమికమైన అవగాహన కలిగేలా చెప్పుట అనేది గొప్పదైనవిషయము. వేదాంత విషయములందు "ఏకవిజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" అనగా ఏది తెలుసుకుంటే సమస్తాన్ని తెలుసుకున్నట్లౌవుతుందో అట్టి జ్ఞానాన్ని తెలియవలసినదిగాను, సర్వధర్మాన్ పరిత్యజ్య ఏది విడిస్తే అన్నీవిడిచినట్లౌతుందో దానిని విడువ వలసినది గాను చెప్పబడుచున్నది. అచలఋషి సాంప్రదాయంలో ఈ అంశాలనే "బ్రహ్మైవాహ మస్మి అహం పదార్థ రహిత:" అని పరంపరాధ్యానంలో స్తుతింపబడుచున్నది. ఈ కందార్థమునందు ఈ అంశములను ఆగమ, నిగమ, ఉపనిషత్ సాగర మధితార్థము ఆవలది గాను, ప్రాగర్థ, చరమార్థ యోగములకు సంయోగము గావించి నేగుర్తెరిగిన దంతా గాను చెప్పబడు చున్నది. దీని వలన మొత్తము ఈ గ్రంథముయొక్క సమగ్ర విషయనిరూపణ చెప్పబడు చున్నట్లుగా తెలియుచున్నది. ఈ అంశములను అనుభవము లోనికి తెచ్చుకుని ఆరూఢ పరచు కొనుటకు వీలుగా పెక్కు దృష్ట ద్రాష్టాంతములను ఈ గ్రంథమందు పేర్కొన్నారు.

కం॥ ఆగామీకథఘెట్లన। బాగుగవివరింతు చెవుల। పండువు గాగన్।
ఆగమ నిగమోపనిషత్సాగర మధి తార్థమవల।
సాంగోపాంగముగాన్। దయతో। వినుడీ। సాంగోపాంగము గాన్।
ప్రాగర్థ చరమార్థయోగాములకుసం। యోగాముగా వించి
నేగుర్తెరిగినదంత। సాంగోపాంగ ముగాన్। దయతో। వినుడి।
సాంగోపాంగముగాన్॥

## ప్రతిపదార్ధము

ఆగామి కథ ఎట్లన = రాబోయే గ్రంథము నందలి పేర్కొనబడిన విషయ నిరూపణ ఎట్టిదో
బాగుగ వివరింతు = స్పష్టంగా (చాలా విడమరచి) చెప్పడం జరుగుతున్నది.
చెవుల పండువు కాగన్ = వినసొంపుగా
ఆగమము = శిక్ష, వ్యాకరణ, ఛందస్సు, నిర్యుక్తం, జ్యోతిష్యం, కల్పము అను వేదాంగములు ఆరు ఆగమములని చెప్పబడును. అనగా దేవతా పూజా విధానము స్మార్తంనకు సబంధించిన శాస్త్రము.
నిగమము = ఉపాసనకాండ
ఉప + నిషత్ = వేదాంత శాస్త్రము
సాగర మధితార్ధము అవల = కర్మకాండ, ఉపాసన కాండ, జ్ఞానకాండ ఈ మూడింటిని ఒకచోట చేర్చి చర్చించి విచారింపగా స్పష్ట పరచబడిన సృష్టి కారణమగు బ్రహ్మము ఆపైగుర్తించుటకు వీలున్న పరిపూర్ణ పరబ్రహ్మము
సాంగో పాంగముగాన్ = అనేక దృష్ట ద్రాష్టాంతముల ద్వారా
దయతో వినుడీ = ప్రేమతో వినండి
ప్రాగర్ధము = ప్రాక్ అనగా మొదటిది, అర్ధము అనగా వస్తువు యోగమనగా కూడిక లేక కలయిక
చరమార్ధము = చిట్ట చివరి వస్తువు
సంయోగము గావించి = చక్కగా కలిపి, విశదీకరించి, సమన్వయపరచి
నేగుర్తెరిగిన దంతా = నేను అనుభవించి ఆరూఢ పరచుకున్నదంతా

## తాత్పర్యము

ఇక ముందు చెప్పబోయే విచారణాంశము ఎటువంటి దనగా ఒకటి చెవులకు వినసొంపుగా నుండునదై కర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండ అనగా న్యాయ వైశేషిక, సాంఖ్య యోగ, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస మొదలగు వేదాంత విషయములను, అగ్ర భాగమైన ఉపనిషత్తులను, ఒక సముద్రముగానున్న వేదాంత విషయములను తరచి చూడగా (చిలికి

చూడగా) వీటి సారాంశము ఈ సమస్త జీవేశ్వర జగత్ సృష్టికి అత్యంత మూలకారణమగు బ్రహ్మము (ఆత్మను గూర్చి) దాని కవల పరిపూర్ణ పరబ్రహ్మము (కేవలాత్మ) నుగూర్చి సమగ్ర ముగా వివరించి ఈ కందార్థ రచనయందు చెప్పబడుచున్నది.ఇంతే కాక ఈ రచనయందు సృష్టి పరిణామ దశలో మొదటి యోగము లేక కూడిక అయిన బ్రహ్మాండము (ప్రాగర్ధ యోగము) అత్యంత చివరి భాగమైన (చరమార్ధ యోగము) పిండాండమును గూర్చి వివరిస్తూ, వీటిని సమన్వయ పరచి అనుభూతిగా మార్చుకొనుటలోగల అఖండ ఎరుక దానిద్వారా తెలియగలుగు పరిపూర్ణమును గూర్చి సమగ్రముగా ఇందు వివరించ బడుచున్నది. ఏలననగా సృష్టికి పూర్వము తాను తానై వున్న బ్రహ్మము నందు నేను అనేకమగుదునుగాక అను సంకల్పముచే బ్రహ్మాండసృష్టి ఏర్పడెను. ఇది మొదటి పరిణామము లేక యోగము. తదుపరి తనచే పరిణమింపబడిన జీవో పాధులయందు, జీవరూపముగా తిరిగి అణు ప్రవేశము చేయుట ఆఖరి భాగము. విచారణ ద్వారా వీటియందలి భేదము గుర్తింపజేసి తెలియబడుచున్న అఖండత్వమును గ్రహింపజేసి, దేనిని తెల్సిన మీదట ఇక తెలియవలసినది లేదో, దేనిని తెల్సిన మీదట వున్నదంతయు ఏకమేనని తెల్సినట్లగునో అట్టి బ్రహ్మమును గూర్చియు, దీనిద్వారా గ్రహింపగలుగునట్టి పరిపూర్ణమునుగూర్చియు సమగ్రముగా ఈరచనలో వివరింపబడు చున్నదని, కావున అత్యంత శ్రద్ధతో ఈ గ్రంథ రచనను వినవలసినదిగా కోరబడుచున్నది. అనగా జన్మ రహిత విధానమునందు జన్మ. కర్మల కత్యంత మూలకారణమగు అధిష్టాన బ్రహ్మమును గూర్చి వీటితో సంబంధపడక వున్న పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి చెప్పబడు చున్నదని దీని పిండి తార్థము.

## గ్రంథరచనోద్దేశ్యము

ఏ గ్రంథమునైనా రచించుట పట్ల ఆగ్రంథకర్తకు ప్రత్యేకమైన అభిప్రాయము కలిగి రచించును. దీనినే కవి హృదయము అందురు. రవి

ఎరుగనిది గూడా కవి ఎరుగును అను నానుడి కలదు. గ్రంథ పరిశీలన పట్ల పరిశీలించువారు ఈ కవి హృదయము పూర్తిగా అవగాహన కల్గించుకొని గ్రంథముపై అభిప్రాయమును వ్యక్తపరచవలెను. ఇది సాంప్రదాయము. అట్లుగాక స్వయంగా ఎవరికివారు గ్రంథమును గూర్చి పరిశీలించిన అది వారి వ్యక్తిగత అభిప్రాయము కాగలదు. కవిత్వమనునది దైవదత్తము గావచ్చు ఒక వరము. ఇది లౌకిక ప్రయోజనాలను ఆశించకుండా ఆధ్యాత్మిక పురోభివృద్ధికి తోడ్పడుతూ లౌకిక జీవితములో శాంతిని, ఆనందమును పొందగల్గినదై ఉండుట ముఖ్యమని, అందుకై ఈగ్రంధరచన చేయబడినట్లుగా చెప్పబడు చున్నవి. ఇంతే గాక ఒక అతీతమైన ఆధ్యాత్మిక సత్యమును సభయందు చర్చించుటలో సమగ్రమైన అవగాహన చాలా అవసరమై యున్నది. అట్టి మార్గమందు తీవ్రముగా కృషి సల్పిన మహాత్ములు ఆసవరణ చేయుటకు అధికారము కల్గియున్నారు. పరిపూర్ణబోధ ఒక విలక్షణమైన మార్గము. జన్మరహిత విధానము నందు తెలియజేయు మార్గములలో జన్మకర్మలకు కారణమైన అధిష్టాన బ్రహ్మమును నిరూపించు పట్లనే విభిన్న సిద్ధాంతములు ప్రయత్నించి, అదే గమ్యస్థానముగా నిర్ణయించియున్నవి. ఇవే మతములు. పరిపూర్ణబోధ ఈ మతముల కతీతమై కేవలత్వమును ప్రతిపాదించు ఒక సిద్ధాంత మార్గమై వున్నది. ఇట్టి సిద్ధాంతమును ప్రత్యేకముగా తెల్సుకొనుటకు, అంతకు ముందున్న మార్గములను గూర్చి సమగ్రముగా తెలియ వలసి వున్నది. లేనిచో పై రెంటికీ భేధమును గుర్తించుట కష్టము. కావున గ్రంధకర్త తన గ్రంథమునందు ఈ తేడాను గమనింపజేస్తూ సిద్ధాంతాన్ని ప్రతిపాదించ డంలో ఈ కందార్థము విజ్ఞాపనగా చెప్పబడుచున్నది.

కం॥ వెూదమున బ్రొద్దుపోకకం। వాదిప్రతివాదులగుచు
వరగురుశిష్యుల్। వాదించిరనుచునొకసం। వాదముగల్పిస్తి
కలగా వదలాకవినుడీ। మొదటినుంచి తుదవెళ్లాగనుడీ।
వేదాంతార్థాతీతవేత్తాలు మీరిందు। యేదేదిసవరించుడిదెనా
విజ్ఞాపాన। వదలాక కవినుడీ। మొదటినుంచి తుదవెళ్లాగనుడీ॥20

## ప్రతిపదార్థము

వేదాంతార్థాతీత వేత్తలు = వేదము, వేదాంతము, అర్థము, అతీతవేత్తలు
వేదము అనగా జ్ఞానము, వేదాంతమనగా జ్ఞానాతీతము, అర్థము = వస్తువు అనగా బ్రహ్మపదార్థము
అతీతమనగా విలక్షణమైనది వేత్తలు = ప్రజ్ఞాపాటవము కలవారు
మోదమున ప్రొద్దు పోకకు = ఆనంద ప్రదంగా ప్రొద్దు గడుపుటకై
వరగురుశిష్యుల్ = శ్రేష్టమైన అనగా నియమబద్ధమైన ఆదర్శవంతమైన జీవనవిధానం కల్గిన గురుశిష్యులు
వాది ప్రతి వాదులగుచు = ఒక ముఖ్యాంశము నిర్దేశంచుట పట్ల చేయు చర్చలో పాల్గొన్నవారు
వాదించిరనుచు = చర్చించబడుచున్న
ఒక సంవాదము = ఒకా నొక చక్కటి విపులీకరణ
కల్పిస్తి కలగా = (లేనిదైనా) నిజము కానిదైనా వివరింపబడుచున్నది
వదలక వినుడీ = ఏమాత్రము నిర్లక్ష్యము అశ్రద్ధ చేయకుండా వినండి
మొదటినుంచి తుద వెళ్ళాగనుడీ = ప్రారంభం నుండి గ్రంధరచన ముగిసే వరకు విడిచిపెట్టకుండా విచారించండి
ఇదే నా విజ్ఞాపన = ఇదే నా మనవి
ఏదేది సవరించుడి = మీగ్రహింపునకు వినగలిగే అంశం భేదమున్నచో దానిని సరి చేయండి

## తాత్పర్యము

జీవిత లక్ష్యము జన్మ రాహిత్యమును కల్గించుకొని అట్టి ఆరూఢతలో జీవిత గమనంలో అనుకూల ప్రతికూల సంఘటనలతో ఎట్టి త్రొట్రుపాటు చెందకుండా హాయిగా, ఆనందంగా జీవించుట మనేది మానవ జన్మయందలి ముఖ్యోద్దేశ్యము. ఏలననగా పరమ పురుషార్థమును సాధించుట పట్ల తనకు సంక్రమించిన తెలివిని, ఉపాధిని సార్థకపరచుకొని ప్రారబ్ధానుభవంలో కలుగు సుఖ దు:ఖములకు భ్రాంతి చెందక కర్తృత్వ రహిత విధానముగా

జీవించుటయే మానవజన్మ సాఫల్యమునకు మూలమని అందుకు వీలుగా అట్టి జన్మ తరుణోపాయమునకు పరిపూర్ణ బోధయే మార్గమని, ఇట్టి మార్గము కొన్ని ఆదర్శములకు, క్రమశిక్షణకు విలువలకు ప్రాధాన్యత ఇచ్చుచు జీవించు గురు శిష్యుల జీవన విధానముద్వారా మాత్రమే తెలియగలదని వూహించి తాను గ్రహించిన, ఆరూఢపరచుకొన్న భావమును ఎదుటి వారిలో వ్యక్తీకరించుకొని,జీవించుట ఆనందప్రదమని ఆలోచించి ఈ గ్రంధరచన చేయబడినది. ఏలననగా బ్రహ్మవిద్య పరంపరా ప్రోక్తమై గురు శిష్య న్యాయముగా మాత్రమే ప్రకాశించుచున్నది. ఈ సభలో పాల్గొన్న వారంతా వేదాంత విషయము లందు అనుభవజ్ఞులై ఆరూఢత చెందినవారు. కావున అట్టి వారిముందు ఈ రచన ప్రయోజనకారి కాగలదని, అట్టివారి పరిశీలనలో ఇందలి లోపములు సవరింప బడగలవని ఆలోచించి ఈ గ్రంధమును మీముందుంచినాను. దీనిని సమగ్రముగా పరిశీలించి సవరించ వలసినదిగా సవినయముగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

## గ్రంథ విస్తరణ విశేషము

ఏ గ్రంథమైనా రచించే టపుడు గ్రంథస్త విషయము భాషలోకి అనువదించి చెప్పడంలో సూత్ర బద్ధంగా (క్లుప్తంగా) చెప్పే అంశాలు కొన్ని, విడమర్చి విషయ నిరూపణ చేసేవి కొన్ని కలవు. వేదాంతగ్రంథములన్నియు దేవభాషయైన సంస్కృతములోనే ఋషి ప్రోక్తంగా, మంత్ర రాశిగా, క్లుప్తంగా చెప్పబడినవి. విజ్ఞానము అభివృద్ధి చెందుచున్నకొలది సంస్కృత భాషలోని అంశాలు ప్రాంతీయ భాషలోనికి తర్జుమా చేయబడ్డాయి. అట్టివాటిలో తెలుగు భాష శ్రేష్టమైనది. సంస్కృతభాష యందలి అంశాలన్నిటిని ప్రాంతీయ భాషయైన తెలుగు లోకి తర్జుమా చేయడంలో మూలసూత్రాలకి భంగం కలుగకుండా వివరించి చెప్పడం జరిగింది. మొదటి సారిగా పద్య గద్య వచనంలో మార్చబడినది విషయ నిరూపణలో వివరము అధికము కావలసి వచ్చినది. ఇందు ఇంకను అభివృద్ధి గాంచి ప్రాంతీయ మాండలిక భాషలో గూడా చెప్పే ప్రయత్నం జరిగింది. ఆవిధంగానే పరిపూర్ణబోధను

సిద్ధాంతీక రించడంలో శ్రీ శివరామ దీక్షితుల వారు సూత్ర ప్రాయంగా సూచించిన అంశాలను జన బాహుళ్యంలోకి విరివిగా ప్రచారం చేయడానికి శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు ప్రాంతీయ, మాండలిక భాషలో జానపద సాహిత్యంగా అర్థాలతోపాటు, పాడుకోటానికి కూడా వీలుగా వుండేలా ఈ రచన గావింపబడినది. దీనిని సభలోని పెద్దలు ఆమోదించవలసినదిగా కోరుచు పెక్కుమంది ఈ సిద్ధాంతమును సులభముగా గ్రహించుటకు వీలుగా ఈ రచన గావింపబడినదని ఈ కందార్థము ద్వారా చెప్పు చున్నారు.

**కం॥ కొంచెములోసరిపుచ్చక। పెంచినవీ గ్రంథమనుచు పెద్దలుగకన్।**
**మించినవేడ్కతొవినుడీ। పెంచినయర్థంబు నేదెల్పొదలో**
**కులెల్లా। అర్థముదెలసి। మదినుల్లాసిల్లా। పెంచీతి పెంచీతి**
**గొంచాముచెడలూవు। వుంచుండెనది లో తంచెంచీనామదినిదె।**
**ల్పొదలోకులెల్లా అర్థముదెలసిమది నుల్లాసిల్లా॥ 21**

## ప్రతిపదార్థము

కొంచెములో సరిపుచ్చక = తక్కువ చేసి చెప్పకుండా
పెంచినవీ గ్రంథమనుచు=ఈ గ్రంథము విస్తరింపబడి యున్నది అన్నందుకు
పెద్దలు = ఈ సభయందు పాల్గొన్న మహాత్ములు
అలుగకన్ = చికాకు పడకుండా
మించిన వేడ్కతో వినుడీ = ఆసక్తి కనపరచి వినండి
పెంచిన అర్థము నేతెల్పొద = గ్రంథము విస్తరింపబడగల అర్థము తెల్పొద
లోకులెల్ల అర్థము తెలిసి=చదువరులంతా ఈ గ్రంథమందలి అంశము గ్రహించి
మది నుల్లా సిల్లా = మనసులో సంతోష పడేటట్లు
పెంచీతి పెంచితి కొంచెము వెడల్పు = భావాన్ని గ్రహించడానికి ఎక్కువ వివరణ చెప్పవలసి వచ్చెను
వెడల్పు = విశాలము
వుంచుండె నదిలోతు = ప్రవహిస్తున్ననది
లోతుపెంచే = దాని గంభీరతను స్పష్ట పరచు
మదిని తెల్పొద = మనసులో అనుకుని చెప్పుతున్నాను.

## తాత్పర్యము

వేదాంతాంశములు చాలా క్లుప్తముగా పరిమితమైన శైలిలో గ్రంథకర్తలచే రచింపబడు వాటి యందలి నిగూడాంశములు వ్యాఖ్యాన రూపంగా అందు నిష్ణాతులైన వారిచే వివరణగానే తెలియబడుతోంది. ఇట్టిప్రయోగము వలన చాలా తక్కువ మందికే (పాండిత్య ప్రభావము కలవారికే) విషయ నిరూపణ కలుగు చున్నది. ఈ ప్రయోగము ద్వారా బ్రహ్మవిద్య సామాన్యులకు అందుబాటులో లేకుండా పోతుంది. జనన మరణ రహిత విధానము సర్వ మానవులకు అవసరమైయున్నందున అందరికీ అందుబాటులోకి తేవడంకోసం మనో వాక్కుల కందని కేవలత్వము కలిగిన పరిపూర్ణభావము విశాలపరచి వివరించి జనబాహుళ్యానికి దీని అవసరాన్ని గుర్తింప జేయుటకు 290 పద్యాల్లో ఈ కందార్థ రచన కావింపబడినది. ఎట్లనగా మేఘమండలము ద్వారా అమృత ధారలై కురిసిన వర్షపునీరు నదీముఖముగా మారి గంభీరతతో తీవ్రమైన వేగంతో ప్రవహిస్తున్నపుడు గజ ఈతగాడుగాని ఆప్రవాహమును దాటలేడు. జనబాహుళ్యం తేలికగా నదిని దాటుటకు, విశాలత్వాన్ని పెంచి ప్రవాహవేగాన్ని తగ్గించి ఈతరానివారు కూడా ఎవరి సహాయం లేకుండానే వారంతట వారే నదిని దాటగలుగుటకు చేసిన ఏర్పాటుగా ఈ కంధార్థరచన (పరిపూర్ణబోధ) చేసినట్లుగా ఈగ్రంధకర్త గారుపేర్కొను చున్నారు.

## పరిపూర్ణ గురు దర్శన సంసిద్ధి కారణము

సాంప్రదాయ పద్ధతి యందు బ్రహ్మవిద్య గురుశిష్య న్యాయంగా ప్రచారంలో వుంది. సద్గురు దర్శనం పూర్వజన్మ కర్మ ఫలితంగా మాత్రమే కలుగ గలదు. సద్గురు దర్శనంకొరకు సచ్ఛిష్యుడు చేయు ప్రయత్నంలో శిష్యుడే ప్రయత్నం ప్రారంభించి వెతుకుటలో తన పూర్వజన్మ సుకృత విశేషముచే తన ఆశయము ఫలప్రదమగుటకు వలయు శక్తియుక్తులు కలిగి శిక్షణా పద్ధతిగ ఆరూఢ పరచ గలుగు గురువు దొరకడం చాలాకష్టం. గురుని ప్రభావం, శక్తి, శిష్యుడ్ని ప్రభావితం చేసి శక్తివంతుడుగా

 

జ్ఞానవంతుడుగా తీర్చిదిద్దబడును. వీరియోగ్యత, పాత్రత వలన సమాజంలో ధర్మము ప్రకాశించును. గురుని మార్గ దర్శకత్వంలో వలయు శిక్షణతో శిష్యుడు ఉత్తీర్ణత కావించుకొనవలసి వున్నది. ఈ అంశాలన్ని ఈ కందార్థము ద్వారా ఈ గ్రంథకర్త సాంప్రదాయ పద్ధతిని తెలియ పరచుచున్నారు.

**కం॥ సాధనసంపత్తియుఁగల। సాధకుఁడొకనరుఁడు**
**ఘోరసంసారమునన్। బాధపడలేకతనపు। ణ్యోదయమున**
**గురునిగాంచి యురుతరభక్తిన్। శరణనిమ్రొక్కి। మరిమారి**
**యుక్తిన్। బోధాజేయుము పుణ్యపురుషా మాబోంట్లాకు।**
**సాధించదగుముఖ్య సాధనానివల్కె। నురుతరభక్తిన్।**
**శరణనిమ్రొక్కిమరిమారియుక్తిన్॥ 22**

## ప్రతిపదార్థము

సాధన = ప్రయత్నము
సంపత్తి = ప్రయోజనము
సాధకుడొకనరుడు = ప్రయత్నముచేయు మానవుడు
ఘోర సంసారమునన్ = జనన మరణములు
బాధపడలేక = కష్టములు భరింపలేక
తన పుణ్యోదయమున గురుని గాంచి = పూర్వ పుణ్యఫలముచే పరిపూర్ణబోధ గురుని దర్శించి
ఉరుతరభక్తిన్ = ఎట్టి కోరిక లేక, తపనతో, ఆవేదనతో, తీవ్రమోక్షాపేక్షతో
శరణని మ్రొక్కి = సాష్టాంగ నమస్కారము చేసి
మరిమరి యుక్తిన్ = అత్యంత భక్తి ప్రపత్తులతో
పుణ్య పురుషా = అత్యంత మహిమాన్వితమైన మహానుభావా
భోధా జేయుము మాబోంట్లకు = నావంటి మోక్షేచ్ఛగలవారికి ఉపదేశించుము
సాధించదగు ముఖ్యసాధన = చేయవలసిన సాధన ఇంకేమైనావుందా?

## తాత్పర్యము

ఆకాశ పంచకమగు అంతరేంద్రియములు జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము వీటిని పురస్కరించుకొని చేయు సాధనలు జ్ఞానముద్వారా తత్వసాధన, మనస్సు ద్వారా యోగసాధన, బుద్ధి ద్వారా మతసాధన, చిత్తముద్వారా భక్తి సాధన, అహం ద్వారా మంత్ర సాధన. వీటి సంపత్తి అనగా ఆత్మ స్వరూప నిశ్చయ జ్ఞానము (స్వస్వరూప జ్ఞానము). ఇందు సాధన, సాధకుడు, సాధ్యము అను త్రిపుటి కలిగి వుండును. జన్మ రహిత విధానమందు జన్మకర్మలకు అత్యంత మూలకారణమైన వస్తువు నన్వేషించుటలో పైన పేర్కొన్న మార్గములన్నియు నిర్దేశింపబడినవి. ఈమార్గమును స్థూలముగా వర్గీకరిస్తూ జ్ఞాన, యోగ, భక్తి, కర్మ మార్గము అని నిర్దేశించి ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గములో ప్రయాణము చేస్తూ భిన్న భిన్న మజిలీలు ఏర్పాటు చేస్కుని అదే జీవిత లక్ష్యముగా కలిగి యున్నారు. అవియే మతములుగా చెప్పబడినవి. విచారించినచో వీరందరూ సమగ్ర దర్శనం లేక ఆశించిన ఫలితం పొందలేక జనన మరణ సంసారంలో పరిభ్రమించుచున్నారు. సంసారమనగా:

1. బాహ్య సంసారము = భార్య పిల్లలు, వస్తువాహనాలతో కూడినది
2. అంతర్ సంసారము = వాసనా మయమైవున్నది
3. అనాది సంసారము = అవిద్యారూపమై మరుపు రూపంలోవున్నది.
4. చిత్ర సంసారము = అనూహ్యమైనది, జన్మ పరంపరలకుకారణమైనది.
5. ఘోర సంసారం = జన్మ కర్మలకు అత్యంత మూలకారణమైన వస్తు రహితంనుండి విడువబడుట

మానవుని విజ్ఞానము అభివృద్ధి చెందుచు శాశ్వత సుఖమునకు, అత్యంత దు:ఖనివృత్తి కొరకు ప్రయత్నము జరుగుచునే యున్నది. అట్టి పరిశీలనలో జనన మరణ రహిత విధానము మానవజన్మ సాఫల్యమునకు పరమార్థమని, మానవుడై పుట్టినందుకు మరల పుట్టుక లేకుండా చేసుకోవడమే జీవిత లక్ష్యముగా నిర్ణయించుకొన్నారు. ఇదియే మోక్షమార్గము. ఏ పనికైనా

ప్రారంభదశ, మాధ్యమిక దశ, ఉత్తీర్ణ దశ, ఆరూఢ దశలుగా పెద్దలచే నిర్ణయించబడి అందులకు వలయు ప్రయత్నములు పైనపేర్కొన్న పంచ సాధనాలుగా నిర్ణయించి జన్మకర్మలకు కారణాన్ని అన్వేషిస్తూ, అత్యంత సుఖప్రాప్తి, దు:ఖనివృత్తి జీవిత లక్ష్యాలుగా " నేను " అను వస్తువు యొక్క సమగ్ర దర్శనం కల్గించుకొని అదియే జన్మకర్మలకు మూల కారణముగా నిర్ధారించుకొని దీని పట్టు నుండి తప్పించుకొను విధానము ఎట్లు అని తపిస్తూ ఒక సాధకుడు తన పూర్వ జన్మ పుణ్య ఫలముచే అందుకు వలయు అన్వేషణ లో పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెందిన పరిపూర్ణ గురుని ( గురు సార్వభౌముని ) దర్శించి ఆవేదనతో కూడిన భక్తితో వారికి సాష్టాంగ నమస్కారమర్పించి, అత్యంత భక్తిశ్రద్ధలతో నాలాంటి వారికి జనన మరణ ప్రవాహము నుండి తప్పించు కొనుటకు ఏ సాధనైనా ఇంకా మిగిలి వుంటే అట్టి ముఖ్యమైన అంశాన్ని తనకు పదేశించమని ప్రార్థించెను.

## ఉపదేశసారము

ఉప + దేశము = ఉపదేశమనగా తాను పొందవలసిన వస్తువు యొక్క అత్యంత సమీపస్థితి. ఒక రెదురుగా ఒకరున్నట్లు భావించు కొనగలుగునట్లుగా చేయుట. సారము అనగా శ్రేష్ట తరమైన వస్తు నిశ్చయజ్ఞానము. పరిపూర్ణ బోధయొక్క సమగ్ర రూపము వస్తు నిశ్చయ పూర్వకముగా ఉపదేశించుట. అందుకు వలయు మాటలను నిర్దేశిస్తూ వస్తునిశ్చయ జ్ఞానము సూచించుట. వేదాంత విషయమునందు తత్వమసి అను మహావాక్యము ఇట్టి లక్షణము కల్గియున్నది. అద్వైత సిద్ధాంతము సూత్రీకరిస్తూ బ్రహ్మము సత్యము జగన్మిధ్య, జీవుడు బ్రహ్మము తప్పఇతరము కాదు, ఇది సిద్ధాంత వాక్యము. ఈవిధంగానే పరిపూర్ణ సిద్ధాంత మందు పరిపూర్ణమునెరిగి, ఎరుకనెరిగి, ఎరుకను మానుట ఇది సిద్ధాంత వాక్యముగా చెప్పబడుచున్నది. ఇందు విషయనిరూపణతో పాటు, కర్తవ్యాన్ని కూడా ఉపదేశించడం జరుగుతుంది. దేశమనగా వస్తువు, ఎరుగుట అనగా గుర్తించుట ఈ అర్థంతో విచారించిన కేవలము పదములకు గల జ్ఞానమె

కాకుండా వాటిచేత నిర్ధేశింపబడుచున్న వస్తువులయొక్క జ్ఞానము కూడా గ్రహింపబడే తనకు అత్యంత సమీప స్థాయిలో గలవని గుర్తించగల్గుట ఇది ఉపదేశ సారము.

**కం॥ శరణాగతుడగుశిష్యుని। కరుణామృతదృష్టిచాత గనిమోదము।
ముప్పిరిగొనమృదు వాక్యములను। పరమద యాళుండు
గురుడు। భక్తావినుమనెనూ। సంశయమిక। బాధింపదనెనూ।
పరిపూర్ణ మొకటి లేనెరుకానెదొకటి। పరిపూర్ణమెరుకాలనెరిగీ
యెరుక నుమాను। భక్తావినుమ నెనూ। సంశయమిక।
బాధింపదనెనూ॥ 23**

## ప్రతిపదార్థము

శరణా గతుడు = సాష్టాంగ నమస్కారముతో సర్వార్పణ బుద్ధి పూనియుండుట (విభీషణుని శరణాగతి)

కరుణామృత దృష్టి = విషయ రాహిత్యముతో కూడి, ప్రేమ భావమును పెంపొందించు అమృత దృష్టి

శిష్యుని గని = తనవద్దకు వచ్చి నమస్కరించి శిక్షణ కోరినవానిని చూచి

మోదము ముప్పిరి గొన = ఆవేదనతో కూడిన మనసు గలవానికి సంతోషము (ఆనందము) కల్గునట్లుగా

మృదు వాక్యములను=గ్రహించుటకు, గుర్తించుటకు వీలు కలిగిన మాటలు

పరమ దయాళుండు గురుడు = ఎట్టి ప్రతిఫలాపేక్ష లేకుండా తనని ఆశ్రయించిన అతనిని ఉత్తీర్ణునిగా చేయగల లక్షణము గలవాడు

భక్తా=గురు వాక్యము యథాతథా స్వీకరించుటకు కావలసిన నడక, యోగ్యత కలవాడు

వినుమనెను = గ్రహించుమనెను.

సంశయమిక బాధింపదనెను=ఎటువంటి సందేహముచేత భ్రాంతి చెందకుండునట్లు

పరిపూర్ణ మొకటి=సర్వ లక్షణవిలక్షమై కేవలత్వము కల్గి సర్వత్రా నిండి వున్నది

లేనెరుక = పై దానియందు ఉనికి (మూలం) లేక తనయందు తాను ఉనికి కలిగి జన్మ కర్మలకు మూలము ఆధారమైన గుర్తు

ఎరుకను మాను = పైరెంటిని గూర్చి వినిన మీదట ఏ గుర్తు గ్రహించి మిగులుచున్నదో ఆ గుర్తును విడిచి పెట్టు

## తాత్పర్యము

సర్వార్పణ బుద్ధితో విభీషణ శరణాగతి వలె గురు పదములు ఆశ్రయించి తన మనసు నందలి ఆవేదనను, ఆర్ద్రతను వ్యక్తపరచిన శిష్యుని కరుణ అనే (అయ్యో పాపం అనే జాలితో) దృష్టితో తలనిమిరి, ఆవేదనతో కూడిన వాని మనస్సునకు ఆనందం కల్గునట్లుగా అత్యంత కృపా సముద్రుడైన గురుమూర్తి పరిపూర్ణ బోధయందలి సారవంతమైన భావములను, మృదు మధురమైన మాటలుగా మలచి, ఎట్టి ఆవేదన చెందవలదని, ఆశీర్వదిస్తు, సిద్ధాంతపరంగా సర్వలక్షణవిలక్షణమై కేవలత్వము కల్గిన పరిపూర్ణము, దానియందు మూలము గాని స్థానము గాని లేకనె, తనయందు తాను తోచు ఉనికికల్గి, జనన మరణాలకు అత్యంత మూలమైన లేనెరుకను ఎరిగించి (దృఢ పరచి) ఏగుర్తుచే ఈ రెండు ఎరగబడుచున్నవో, ఆగుర్తును గూడా చివరకు విడిచిపెట్టవలసినదిగా చెప్పబడుచున్నది. ఇందు సిద్ధాంతనిరూపణేగాక బోధ యందలి క్రమమును, కర్తవ్యమును గూడా నిర్దేశించ బడుచున్నది. పైవిషయ నిరూపణలో జన్మ కర్మల భ్రాంతి రహితమందు ఎటువంటి సందేహానికి, అనుమానానికి తావులేకుండా చెప్పబడుచున్నది. ఈ శబ్ద ప్రయోగము లందు వేదాంత దర్శనమందలి సమగ్ర దర్శనము సూచింపబడుచున్నది. ఏది తెల్సినమీదట ఇక తెలియాల్సినది మిగలదో, దేనిని తెల్సిన మీదట అంతయు తెల్సినట్లగునో అట్టి అఖండ ఎరుక (ఆత్మ) గూర్చి కేవలత్వము కలిగి, ఎట్టి మార్పులకు, పరిణామానికి లోనుకాకుండా సర్వత్రా తానై వుండిన పరిపూర్ణమును గూర్చి వివరించి, తుదకు సర్వభ్రాంతులకు మూలమైన గుర్తెరిగే ఎరుకను విడచుట అనుకర్తవ్యమును ఉపదేశించి నట్లయినది. ఇందు ఎరుగుట అనగా వినుట చదువుట కాక గుర్తించగల్గుట అనువస్తు నిశ్చయ జ్ఞానమునకే ప్రాధాన్యత ఇచ్చినట్లైనది.

కం॥ యేసాధననీకెందుకు। వీసానికి బనికిరాదు వినుమా యయ్యా।
నేసాధులచేవిన్నది యేసాధనలేనిబోధ। నెరిగింతు పోకూ।
సాధనలందుమరిగితేరాకూ। యేసాధనల జోలియే నొల్లననినీవు।
బాసాజేశితివేనిపరిపూర్ణబోధనే। నెరిగింతు పోకూ।
సాధనలందు। మరిగితేరాకూ॥ 24

## ప్రతిపదార్థము

ఏ సాధన నీకెందుకు = ఏ ప్రయత్నము నీకు అక్కరలేదు
వీసానికి పనికిరాదు=జనన మరణ భ్రాంతి రహిత విధానానికి ఏమాత్రం పనికిరావు
వినుమా అయ్యా = శ్రద్ధగా పాటించు నాయనా
నే సాధులచే విన్నది = నేను పరిపూర్ణ బోధయందు ఆరూఢత కల్గిన మహాత్ముల ద్వారా విన్న విషయము
ఏసాధన లేనిబోధ = తనకు తానుగా ఏ ప్రయత్నము చేయకుండానే ప్రబోధ ద్వారా మెలుకువ పొందే విధానము
ఎరిగింతు = దృఢ పడేలా తెలియ జేస్తాను
పోకు = భ్రాంతి రహితం కొరకు ఎవర్నీ ఆశించవలసిన పనిలేదు
సాధనలందు మరిగితేరాకు = స్వతంత్రంగా నీకు నీవుగా ప్రయత్నాలు చేసుకునే విధానం అయితే రావద్దు
ఏసాధనల జోలి యేనొల్లనని=ఇతరమైన ప్రయత్నాలు ఏమీచెయ్యకుండా వుంటానని
నీవు బాస చేసితివేని = నీవు ప్రమాణం చేస్తే
పరిపూర్ణ బోధ నేనెరిగింతు పోకు = సమగ్రమైన విచారణద్వారా సర్వభ్రాంతిని రహితపరచే మెళకువను దృఢ పరుస్తాను. నీవు దీనివిషయమై ఎవరిదగ్గరకు వెళ్ళకుండానే దృఢ పరుస్తాను.

## తాత్పర్యము

జనన మరణభ్రాంతి రహిత విధానమందు సాధన, సాధకుడు, సాధ్యము అను త్రిపుటితో కూడిన ప్రయత్నము అణుమాత్రము పనికిరాదు నాయనా! భ్రాంతిరహిత విధానమందు ఆరూఢత చెందిన మహాత్ములచే

తనకు తానుగా ఏ ప్రయత్నం చేసే పని లేకుండా కేవలం ప్రబోధ ద్వారా మాత్రమే దృఢ పరచు కోగలిగే బోధనా పద్ధతిని నేను విని దృఢపరచుకొని యున్నాను. ఇతరప్రయత్నాలేవీ తనకుతానుగా చేసుకోవలసిన పని లేకుండా గురువాక్యం యధాతధా అన్నట్లుగా ప్రమాణ బద్ధమైన జీవితాన్ని గడుపు తానని నీవు హామీ ఇచ్చినపుడు, ఎటువంటి సందేహంలేక నీకీ భావాన్ని దృఢపరుస్తాను. అట్లుగాక స్వప్రయత్నం చేత తెలుసుకోవాలనుకుంటే ఇది సాధ్యము కాదు.

## శిష్యప్రశ్నావళి

సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలో మీ మాంస చాలా అవసరమై యున్నది. అందుకు అనుబంధంగా మూడు అంశములు సిద్ధాంత మందు ప్రతిపాదించగాఅయిదు అంశములుగా మీమాంసద్వారా వాటి వివరణ కోర బడుచున్నది. సిద్ధాంతమందు పరిపూర్ణము నెరిగి లేని ఎరుక నెరిగి ఎరుకను మాను అని ప్రతిపాదించగా ఎరుకోద్భవ మెందు? ఎరుక జను చోటు ఎయ్యది? అను మీమాంస ద్వారా లేని ఎరుకను గూర్చినిరూపణ, నిరసన ప్రతిపాదింపబడుచున్నది. కోరినవిధంగా చర్చ అవసరం గాబట్టి అందుకు వీలుగా ఈ కందార్థం చెప్పబడుచున్నది.

కం॥ గురువర పరిపూర్ణంబన। నెరుకననివిరెండుయెట్టి।
వెరుకోద్భవమెం। దెరుకజనుచోటుయెయ్యది। యెరుకనే
నెట్లవిడిచే। దెరుగించుమనెనూ। అట్లనెగురు డెరిగింతు ననెనూ।
చరణధూళిని రెండు। కరమూలగొనితన। శిరమూన
ధరియించి శర్ణానియాశష్యు। డెరిగించుమనెనూ అట్ల
నెగురు। డెరిగింతుననెనూ॥ 25

## ప్రతిపదార్థము

గురువరా = శ్రేష్ట మైనగురుమూర్తీ

పరిపూర్ణంబన ఎరుకన రెండెట్టివి? = పరిపూర్ణము, ఎరుకను గూర్చివివరణ

ఎరుకోద్భవమెందు? = ఎరుక ఉత్పత్తి, స్థానము
ఎరుక జనుచోటు ఎయ్యది? = ఎరుక నిష్క్రమించు విధానము
ఎరుకను నేనెట్లు విడతు = పై రెంట్నీ గుర్తించిన గుర్తు నేనెట్లు విడవాలి?
ఎరిగించు మనెను = వివరించవలసినదిగా కోరెను.
అట్లనే గురుడెరింగింతు ననెను=నీవు కోరినవిధంగానే అవి తెలియపరుస్తాను.
చరణ ధూళిని రెండు కరముల గొని = పాద ధూళిని రెండు చేతులతో భక్తిశ్రద్ధలతో స్వీకరించి
తన శిరమున ధరియించి = తన శిరస్సుపై నిల్పుకొని
శరణని యా శిష్యుడు = పదే పదే వినయముతో ప్రార్థించగా

## తాత్పర్యము

సిద్ధాంత నిరూపణలో ప్రతిపాదన, నిరూపణ చాలా అవసరమై యున్నవి. గురువు సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలో పరిపూర్ణమనేదొకటి, లేనెరుకనే దొకటి పరిపూర్ణము, ఎరుకాలనెరిగి ఎరుకను మాను అనిఉండగా శిష్యుడు విషయనిరూపణలో పరిపూర్ణమును ఎరుకను ఎరిగి ఎరుకను మానుటలో మీమాంసగా అదనంగా ఎరుకోద్భవ మెందు? ఎరుక జనుచోటు ఎయ్యది? అని శిష్యుని ద్వారా కోరగా, కోరిన విధంగానే వివరణ పొందవచ్చని గురుమూర్తి పేర్కొనగా, తాను కోరిన విధంగా వివరణ చెప్పగలనని గురుమూర్తి చెప్పగా అత్యంత సంతోషచిత్తుడై శిష్యుడు గురునకు సాష్టాంగ మొనర్చి తన భక్తిని శ్రద్ధని, ఆసక్తిని వ్యక్త పరుస్తు గురు పాద ధూళిని శిరస్సున ధరించెను.

## గురుమూర్తి అభయ ప్రదానము

శిష్యుడు కోరినవిధంగా విషయమీమాంసను గురువు చెప్ప బూనుచు అందులకు శిష్యుడు పాటించవలసిన, వుండవలసిన ముఖ్యాధికారమును ఇందు ప్రతిపాదింపబడుచున్నది. ఎందు కనగా బ్రహ్మవిద్య యోగ్యత, పాత్రతల మీదనే వుపదేశింప వలసి వున్నది. అట్లు కాని ఎడల విన్నది శ్రవణానందముగానె మిగులును. అందునా పరిపూర్ణ బోధ సాధనాంతర

నిరపేక్షికమై, కేవలము గురు అనుగ్రహము ద్వారా ప్రబోధ ద్వారా మాత్రమే వస్తు జ్ఞానమును సూచిస్తూఉండగా వెంటనే గ్రహించగలిగే సూక్ష్మ ప్రజ్ఞతో పాటుగా ఏకాగ్రత అవసరం. వీటికి తోడుగా అసంభావన, విపరీతభావన అనురెండు దోషములు బుద్ధి నాశ్రయించుకొని ఉండి విషయ నిరూపణకు ఆటంకముగా నుండును. అచంచల విశ్వాసము, బుద్ధి నిశ్చలత శిష్యుని కుండవలసిన ముఖ్యాంశములు. ఈ యోగ్యతపై ఈ బోధ శ్రవణము చేయవలసివున్నది. పరిపూర్ణబోధ సద్యోముక్తిఅనగా వినడం ద్వారానే తరింపబడును. ఇందులకై పై అధికారములు కలిగి ఉండవలెను. విషయ మీమాంసలో సందేహ నివారణకు ఆసక్తితో పాటు అధికారం కూడా చాలా అవసరం. అందులకై ఈ కందార్థం ద్వారా ఈ అధికారం తెలియపరుస్తూ, బోధ యొక్క ఆరూఢతకు అభయము అనగా హామీని ఇవ్వడం జరుగుచున్నది.

కం॥ మొదలచలము నెరిగించెద। విదితముగాలేని యెరుక
వివరింతు పయిన్। తుద కెరుకనువిడిపించెద। మదిలోనా
మాట నమ్మి మరివింటివేనీ। చంచలబుద్ధి। మానుంటివేని।
పదుగూరు నినుజూచి భళిశాభాసీత్రోవ। కెదురులేదనెటట్లు।
యిందుగో నేజేసేద మరివింటివేనీ। చంచలబుద్ధి
మానుంటివేనీ॥ 26

## ప్రతిపదార్థము

మొదలచలము నెరిగించెద = తొలిసారిగా కదలిక లేనిది లేక కేవలత్వము కల్గినదానిని గూర్చితెలియ పరుస్తాను.
విదితముగా = స్పష్టముగా
లేని ఎరుక = వున్నవస్తువు యందు లేనిదై ఉనికి కల్గిన ఎరుకను గూర్చి
వివరింతు = విడమరచి చెప్తాను
పయిన్ = ఆతర్వాత, అటుపిమ్మట
తుదకెరుకన్ విడిపించెద = చివరిగా పైరెంటిని గూర్చి గుర్తించిన తెలివిని లేనిదిగా దృఢపరుస్తాను.

మదిలో నామాట నమ్మి మరి వింటివేని = మనసులో గురుర్వాక్యమందు అత్యంత విశ్వాసం కల్గి ఉండడం

చంచలబుద్ధి మానుంటివేని=దృఢ భావంతో స్థిరమైన నిర్ణయ విధానం కలిగి ఉండడం

పదుగురు నిను జూచి = సమాజంలో వున్న అందరూ నిన్ను జూచి

భళీ శభాష్ ఈ త్రోవకెదురు లేదనేటట్లు =చాలా సమంజసంగా, ఆదర్శవంతంగా నిన్ను జూసి ప్రతీవారు గర్వపడేటట్లు, తిరుగు లేని విధంగా

ఇదిగో నేజేసెద = పై విధంగా నిన్ను తీర్చి దిద్దగలవాడను.

మరి వింటివేని = పై విధంగా నే చెప్పినట్లు పాటించి వింటె

## తాత్పర్యము

జన్మకర్మలతో సంబంధపడక, కేవలత్వము కలిగి, చలించే లక్షణము లేక, చలనముతో సంబంధపడక వున్న పరిపూర్ణ పరబ్రహ్మమును అందు మూలము గాని స్థానము గాని లేక తోచుచూ జన్మ కర్మల భ్రాంతికి మూలము, స్థానముతానేఅయి, తనకువేరే మూలము, ఆధారము లేక, తోచుచున్న ఎరుకను గూర్చి స్పష్టముగా తెలియపరచి, చివరకు పైరెంటి అంశాల్ని దృఢపరచుకొన్న గుర్తును లేకుండా చేయుగలవాడను అనిగురుమూర్తి హామీ ఇస్తూ అందుకు శిష్యుని కుండవలసిన పాత్రతను తెలియపరుస్తు 1. గురుర్వాక్యమును అత్యంత విశ్వాసంతో భక్తి శ్రద్ధలు కలిగి వినడం 2. ఎటువంటి సందేహాలకు తావులేకుండా గురుర్వాక్యం యధా తధంగా స్వీకరించే బుద్ధికలిగి ఉండడంఅనే ఒప్పందంపై ఈబోధ రీత్యా సమాజంలో అందరూ ఇట్టి ఆరూఢ వరుల్నిచూసి ఈపరిపూర్ణభావమునకు గాని, మార్గమునకు గాని ఎదురులేదని, ఆదర్శవంతమైనదని నీద్వారా ఈ సాంప్రదాయాన్ని ప్రపంచంలో చాటుతానని గురుమూర్తి అభయ ప్రధానమొనరించెను.

## శిష్య విజ్ఞప్తి

విషయ మీమాంసలో తను కోరిన విధముగా ప్రబోధను చెప్పగలందులకు గురువు షరతులతో కూడిన హామీని ఇచ్చుట ద్వారా శిష్యుడు సంతోషించి

గురుని ప్రతిభను, సామర్థ్యాన్ని, సమర్ధతను కొనియాడుచు బోధనాక్రమము నిర్ధేశించు కుంటూ ఈ శీర్షికద్వారా తన భావాన్ని వ్యక్త పరచుచున్నారు.

కం॥ మీరంతవారుగనుకనె। చేరితిమీపాద సేవసిద్ధించుటకై।
యేరింతవారు జగమున। లేరని నామదికిదోచె। లెస్సాగవినుడీ।
ఆజ్ఞకుమీర। లేదుకనుగొనుడీ। యేరీతి వినుమంటెనారీతి
వినియేద। మీరానతివ్వండితోరామా యీబోధ। లెస్సాగ వినుడీ।
ఆజ్ఞకుమీర। లేదూ కనుగొనుడీ॥ 27

## ప్రతిపదార్థము

మీరంతవారు గనకనే = మీరు సర్వసమర్థులు గనుకనే
చేరితి మీపాదసేవ సిద్ధించుటకై = మీ అనుగ్రహము పొందుటకై మీ పాదము లాశ్రయించినాను
ఏరింత వారు జగమున లేరని=మీకు సాటియైనవారు ఈ ప్రపంచములో మరెవరూ లేరని
నామదికి తోచె = అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను
లెస్సగా వినుడీ = స్పష్టంగా ఎటువంటి అనుమానం లేకుండా చెప్తున్నాను
ఆజ్ఞకు మీరలేదు కనుగొనుడీ=మీరు శాసించిన విధంగా జీవించగలుగుతాను. ఇందు ఎలాంటి అనుమానానికి తావులేదు. కావల్సివస్తే పరీక్షించండి
ఏరీతి వినుమంటే ఆరీతి వినియెద = ఎలా కృషి చేయు మంటే (జీవించమంటే) అలా కృషి చేస్తాను
మీరానతివ్వండి = అర్థమరలేకుండా మీరు ప్రబోధించండి
తోరామా ఈ బోధ = శ్రేష్టమా ఈబోధ

## తాత్పర్యము

ప్రపంచంలో గల గురు సాంప్రదాయాలన్నిటి లోకి విలువైన సాంప్రదాయము ఈ దీక్షితీ సాంప్రదాయ మని, దీనిని ఉపదేశించు గురువులు వీటిని శిష్యులకు ఉపదేశించడంలో సాటిలేని ప్రజ్ఞాపాటవం

గలవారని, మిమ్ములనాశ్రయించి సేవాశుశ్రూషలద్వారా మీఉపదేశక్రమాన్ని పాటిస్తూ మీఅనుగ్రహం పొందటం ద్వారా మాత్రమే ఈబోధయందు ఆరూఢత పొందగలమని చాలా స్పష్టంగా విచారించి తెలుసుకొనే మిమ్ములను ఆశ్రయించి యున్నాను. మీఆజ్ఞను ఉపదేశాన్ని శిరసావహించి జీవించెదను. కావాలంటే మీరు అనుమానం వుంటే పరీక్షించి చూడండి. ఏపద్ధతిగా మీరు కృషి చేయమంటే ఆపద్ధతిగా కృషి చేస్తాను. నాపై ఎటువంటి అనుమానం లేకుండా సర్వోత్కృష్టమైన ఈ పరిపూర్ణ బోధను నాకనుగ్రహించండి.

కం॥ మొద్దులనైనను దొల్తురు। బద్ధులబద్ధత్వమడవి పాల్జేతురుమీ।
వద్ధికివచ్చినగని। పరిశుద్ధప్రబోధోక్తమైన। సూక్తూలు గుప్పీ।
అందుకుతగిన। యుక్తూలుజెప్పీ। పెద్దాలచేమీ ప్రసిద్ధీనివినివస్తి।
దిద్దూడినేవట్టి బుద్ధిహీనుడనన్ను। సూక్తులుగుప్పీ। అందుకు
తగిన। యుక్తూలుజెప్పీ॥ 28

## ప్రతిపదార్థము

మొద్దులు = చేతన హీనులు (యోగాభ్యాస పరులు)

దొల్తురు = లేకుండా జేస్తారు

బద్ధులు = బంధింపబడినవారు, కర్మానుష్టాన పరులు

బద్ధత్వము = బంధనము

అడవిపాల్జేతురు = సమూలంగా లేకుండా జేస్తారు

మీ వద్దకు వచ్చినగని = మిమ్మల్ని ఆశ్రయించిన వారి అధికారాన్ని ఆసక్తిని (చూచి) గమనించి

పరిశుద్ధప్రబోధ = వస్తునిశ్చయ పూర్వకమైన ప్రబోధ

యుక్తమైన సూక్తులు = అనుకూల సంబంధింతమైన మాటలు

గుప్పి = వివరించి

అందుకు తగిన యుక్తులు జెప్పి = బోధయందలి వస్తు నిశ్చయజ్ఞానాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడానికి వీలైన మార్గాలు

పెద్దలచే మీ ప్రసిద్ధి వినివస్తి = ఈ సిద్ధాంతమందు ఆరూఢత కల్గిన మహాత్ములు మీగురించి, మీప్రతిభ గురించి చర్చించుకుంటుండగా అవి తెలిసి వచ్చాను

దిద్దుడి నన్నె = ఈబోధకు సరిపడా అధికారం సంపాదించుట కొరకు నన్ను తీర్చి దిద్దండి

వట్టిబుద్ధి హీనుడ = మీసామర్థ్యాన్ని, శక్తిని అనుభవంలోకి తెచ్చుకోడానికి వలయు శక్తి సామర్థ్యాలు లేనివాడ్ని

## తాత్పర్యము

మీవద్దకు వచ్చి మిమ్ము ఆశ్రయించినవారిని ఎటువంటి వారైనా అనగా కర్మ, భక్తి యోగ, జ్ఞాన మున్నగు భ్రాంతులు గలవారైనా వారికి అభయమిచ్చి, ఆశీర్వదించి, వస్తునిశ్చయపూర్వకమైన పరిపూర్ణ బోధను ప్రబోధిస్తూ అది దృఢ పరచు కొనుటకు, ఆరూఢపరచుకొనుటకు, సహజమైపోవడానికి సరిపడ సులభమైన మార్గములను ఉపదేశించగల అనుభవజ్ఞులైన వారని మీగొప్పతనము, ప్రజ్ఞ అనుభవజ్ఞులద్వారా తెలుసుకొని ఆశ్రయించాను. మీ సామర్థ్యాన్ని గుర్తించడంలో అల్పజ్ఞుడనైన నేను నాశక్తి సరిపడదు. అందుకు వలయు శక్తి సామర్థ్యాలు అనుగ్రహించి ఈబోధకు సరిపడునట్లుగా నన్ను తీర్చి దిద్దండి.

## బోధ దృఢీకరణ విధానము

సిద్ధాంత పద్ధతిని అవగాహన కల్గించి ఆరూఢ పరచుకొనే ప్రయత్నం చేయడంలో వివరణ చాలా అవసరమైయున్నది. లేనిచో సిద్ధాంత పద్ధతియందు స్పష్టమైన పట్టు చిక్కదు. ఉదాహరణకు రామాయణ సమగ్ర రూపం కట్టె కొట్టె తెచ్చె అను మూడు ముక్కలలో ఇమిడ్చి విచారణద్వారా మొత్తం రామాయణం పట్ల అవగాహన కల్గించుకొన్నరీతిగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అనుసిద్ధాంత పద్ధతిని గూడా వివరించుటకు విచారణ అవసరమై యున్నది. ఇందు అనేక దృష్ట ద్రాష్టాంతములు బోధను అనుభవంలోకి తేవడానికి ఉపయోగింపబడు చున్నవి. ఇందు

ప్రయోగించిన దృష్టాంతములు కఠినమైన అంశాన్ని అవగాహన పరచుకొనుటకు చెప్పబడినవే ఏలననగా మనో వాక్కుల కందని కేవలత్వము కల్గిన పరిపూర్ణమును మాటలతో వర్ణింపబూనుట సాధ్యముగాని పని అయినా శిష్యునికి బోధనా పద్ధతి కోసం గురువుసాహసించి చెప్పినవే, ఈ దృష్టితో మాత్రమే దృష్టద్రాష్టాంతములను స్వీకరించాలి, వీటి ద్వారా మొత్తం బోధ సమగ్రరూపం దృఢ పరచే ప్రయత్నం జరుగుతోంది.

**కం॥ సూటిగను బోధనామది। నాటినదిక చాలుచాలునని నీకైనీ।**
**నోట నీవుబల్కు దాకను। సాటువులను జెప్పుచుందు। సరేనా**
**నామాటా। రాగోరూచు। మరినేనీమాటా। నూటికొక్కటె సేలు**
**మాటానితెలియూము। మాటిమాటికివట్టి పాటాలేమిటి కింక।**
**సరేనా నామాటా। రాగోరూచు మరినేనీమాటా॥ 29**

## ప్రతిపదార్థము

సూటిగా = స్పష్టంగా
బోధ = పరిపూర్ణబోధ
నామదికి నాటినది = నాకు చాలా అర్థమై ఆరూఢత కొచ్చినది
ఇకచాలు చాలు నని = ఇక బోధింప వలసినపనిలేదు అని
నీకై నీనోట నీవు పల్కుదాకను = నీ అంతట నీవు చెప్పేవరకును
సాటువులను చెప్పు చుందు = ఉదాహరణలను చెపుతుంటాను
సరేనా నామాట = ఇది నేను నీ కిచ్చే హామీ
రా గోరుచు మరి =రాబోయే విషయాన్ని దృష్టిలో పెట్టుకుని
నేనీ మాట = ఈ మాట చెప్పవలసి వస్తోంది
నూటి కొక్కటి సేలు మాటాని తెలియుము = వంద సందేహములు ఒక అనుభవ వాక్యంతో సరిపెట్టి నట్లుగా గ్రహించుము
మాటి మాటికి వట్టి పాటా లేమిటికి = వ్యర్థమైన మాటలు మాని విషయ నిరూపణ కొరకు ఎదురు చూడుము
ఇంక = ఇకపై

## తాత్పర్యము

వస్తు నిశ్చయ పూర్వకముగా సిద్ధాంత పద్ధతి యందలి పరిపూర్ణము, ఎరుక అను అంశములను దృష్ట ద్రాష్టాంతములతో నీకు అర్థమై బాగా దృఢ పడునట్లుగా ప్రబోధించగలవాడను. ఇందు ఎట్టి సందేహము లేక నీవు విని దృఢ పరచు కొనవచ్చును. విన్నమీదట నీకునీవుగా పైఅంశము లందు స్పష్టమైన అవగాహన, ఆరూఢత కల్గి చాలు చాలు అని సంతృప్తిగా నీమాటగా చెప్పగల్గేటట్లు చేస్తాను. ఇంక అనవసరమైన చర్చమాని విషయ నిరూపణకు ప్రయత్నిద్దాం. ఈ మాటలైనా నిన్నుబట్టి మాత్రమే చెప్పవలసి వస్తోంది.

## ప్రశ్నోత్తరములు

ఇందు ప్రశ్నలు శిష్యునివి. సమాధానం గురువు గారిది. పరిపూర్ణ గురువు వద్దకు ప్రవేశించుటకు పూర్వంలో శిష్యునికి వేదాంత స్వరూప స్వభావ అవగాహనలో కొన్ని సందేహాలు "ఉపదేశ సారము" విన్నమీదట పరిపూర్ణబోధను గురించి కొన్ని సందేహములు సహజముగా కల్గి ఉండవచ్చు. జన్మ కర్మలకు అత్యంతమూలకారణమైన బ్రహ్మపదార్థము యొక్క వస్తునిశ్చయ జ్ఞానంతో వేదాంతాంశము ముగుస్తోంది. ఇక్కడనుండి పరిపూర్ణబోధ ప్రారంభమౌతోంది. కావున పరిపూర్ణ బోధయందు అంతకుముందు గల వేదాంత జ్ఞానమందు కొంతవరకైనా విషయ ప్రవేశం అవసరం. ఈరెంటి విషయ నిరూపణలో తేడాని గమనించి పరిపూర్ణబోధ ఆరూఢపరచుకొనుట చాలా అవసరం. "అది ఇది అవుతుంది" "ఇది అది అవుతుంది" అనే విషయ నిరూపణలో వేదాంతం ముగుస్తుంది "అది ఇది కాదు" "ఇది అది కాదు" అని పరిపూర్ణ బోధ సిద్ధాంతీకరిస్తుంది. ఇట్టి మీ మాంసలో ఈ ప్రశ్నోత్తర కందార్థాలు చెప్పబడు చున్నవి.

కం॥ తానేననకనునిండిన। దానికి పేరేమి బయలు। తానేననుచున్
నేననియెద నేనెవ్వరు। లేనెరుకవు। వుంటి వుంటే। లేనేలేననుమీ।
అంటిని। అంటె। లేనేలేవునుమీ। లేనేలేనని నేను
లేకాపోయినవెనుక। తానుండుగదవుంటె। దాన్నెట్లెరిగెద నీవు।
లేనేలేననుమీ। అంటిని అంటే। లేనేలేవుసుమీ॥ 30

## ప్రతిపదార్థము

తానేనన కను = తాను, నేను అను గుర్తులేకుండా

నిండినదానికి పేరేమి = సమస్తమందు వ్యాపించిన దానికి పేరేమిటి?

బయలు = నీవు కానిది, నీవు లేనిది,నీకు వేరై వున్నది.

తానేననుచును, నేననియెద నేనెవ్వరు = తాను, నేను అను ద్వంద్వ పద్ధతిగ గుర్తెరుగు చున్న నేను ఎవరు?

లేనెరుకవు = వున్న దాని యందు వునికి లేని వాడవు.

వుంటి = నేనున్నాను గదా

వుంటే లేనే లేననుమీ=సిద్ధాంత పద్ధతిగా నీవు లేవని చెప్పుచున్నాను గదా

అంటి = లేనని అనుకుంటున్నాను. అలా అనుకున్నమరుక్షణమే నీవు లేకుండా పోతావు

లేనేలేనని నేనులేకా పోయిన వెనుక తా నుండుగద = నేననే గుర్తు లేకుండా పోయిన తర్వాత వున్న వస్తువు వుంటుంది గదా

వుంటే దాన్నెట్లెరిగెద నీవు = నీవు లేక పోయిన వెనుక వున్న దాని గురించి నీవెట్లా తెలుసు కుంటావు?

## తాత్పర్యము

తాను, నేనను గుర్తు లేకుండా అంతా నిండి వున్న దానికి పేరేమి? పరిపూర్ణ పరబ్రహ్మము. తా, నేననుచును నేననియెద నేనెవ్వరు? లేనెరుకవు వుంటి? వున్నానుగదా! లేనేలేనను మీవున్నదానియందు నీకు మూలముగాని స్థానముగాని లేదు కదా! లేనే లేననుమీ, అందుచే నీవు లేక పోతావు. లేనే లేనని నేను లేకాపోయిన వెనుక తానుండుగద = నేను లేకపోయిన వెనుక తానను వస్తువు వుంటుంది గదా వుంటె దాన్నెట్లెరిగెద నీవు? (నువు వున్నట్లైతే) లేనివాడివి వున్నదానిని ఎట్లాగుర్తిసావు.

## శంకా నివృత్తికి శిష్య విజ్ఞాపన

పై కందార్థము ద్వారా బోధ యందు చాలా నిగూఢమైన రహస్యము లున్నాయని, మనసు విప్పి విడమరచి చెపితే తప్ప గ్రహించడం సాధ్యం

కాదని గ్రహించి, సందేహ నివృత్తి చాలా అవసరం కాబట్టి ఇచ్చిన హామీ ప్రకారము క్రొత్తగా విషయ నిరూపణలో శ్రద్ధ కలిగి వినడం చాలా ముఖ్యమని గ్రహించి సిద్ధాంత పద్ధతినివిపులీకరిస్తూ అనుకున్న విధంగా బోధించండి అని ఈ కందార్ధమందు చెప్పబడు చున్నది. పరిపూర్ణబోధ "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యధా గ్రంధకోటిభి:" అని చెప్పబడుచున్నది. గురుర్వాక్యం యధా తధంగా స్వీకరించి చతుర్విధ శుశ్రూషలయందు ఏమరపాటు లేకుండా గురుకృపకు పాత్రులైన వారికే విషయ నిర్ధారణ కాగలదు.

కం॥ మీరాజ్ఞ యిచ్చివుంటిరి। నేరువుతో బయలు నెరుక
నెరిగించిపయిన్। పేరణతుయెరుకననియ ట్లారీతిన యెరుక
పరచు మయ్యాబ్రెుక్కేనూ। అనుమానాము। జెయ్యాకి
య్యేడనూ। సారెకు మీపాద జలజా యుగ్మము నాహృ।
త్సారాసముననిల్పి సల్పాచుపూజానో। యయ్యాబ్రెుక్కేనూ।
అనుమానాము జెయ్యాకియ్యేడనూ॥ 31

## ప్రతిపదార్ధము

అయ్యా బ్రెుక్కేను = అయ్యా మీకు నమస్కరిస్తున్నాను.

మీరాజ్ఞ ఇచ్చివుంటిరి = మీరనుగ్రహించి వుంటిరి. హామీ ఇచ్చి వుంటిరి.

నేరువుతో = వస్తునిశ్చయ పూర్వకంగా విడమరచి

బయలు నెరుక ఎరిగించి = పరిపూర్ణమును ఎరుకను గుర్తింప జేసి

పయిన్ పేరణతు ఎరుకనని = ఆపై గుర్తించే గుర్తును లేకుండా చేస్తానని

అట్లారీతిన ఎరుక పరచు = ఆ విధంగా, హామీ ఇచ్చినట్లుగా తెలియపరచు

అనుమానముచెయ్యకియ్యేడను = నాపైన ఎటువంటిసందేహాన్ని వుంచొద్దు

సారెకు = ఇకపై

మీపాదజలజాయుగ్మము = మీదివ్య శ్రీచరణాలను

నాహృత్సారాసముననిల్పి = నాహృదయ పద్మములో నిల్పి

సల్పుచూపూజ = నిరంతరము ధ్యానిస్తూ

## తాత్పర్యము

ఓ గురుదేవా మీరు హామీ ఇచ్చిన విధంగా పరిపూర్ణమును, ఎరుకను ఎరిగించి ఎరుకను విడిపిస్తానని హామీ ఇచ్చివున్నారు. ఆ విధంగానే నా యెడల అనుగ్రహించి, ఎటువంటి అనుమానము వ్యక్తపరచకుండా బోధ యొక్క క్రమాన్ని ఉపదేశించండి. మీరు చెప్పిన క్రమాన్ని పాటిస్తూ, మీదివ్య శ్రీ చరణాల్ని ధ్యానిస్తూ, మీ అనుగ్రహం కల్గించుకొనే ప్రయత్నంలోనే వుంటాను. ఇక ముందు జరుగబోయే విషయాన్ని ఉపదేశించండి అని శిష్యుడు నమస్కరించాడు.

## అచల పరిపూర్ణ దర్శనము

రామాయణమంతా మూడు ముక్కలచే మలచి కట్టె, కొట్టె తెచ్చె అను శబ్దములచే సూచింపబడినట్లుగా ఈ పరిపూర్ణ సిద్ధాంతము కూడాసూత్రపాయంగా మూడు అంశాలుగా చెప్పవలసి వస్తోంది. పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అని చెప్పవలసి వస్తోంది. అచలమనగా కదలనిది. ఏదైనా ఒక వస్తువు కదలవలెనంటె చోటు, శక్తి అవసరం. పిపీలికాది బ్రహ్మ పర్యంతం చలన స్వరూపమై, సృష్టి లోని ప్రాణులన్నియు చలనాత్మకమై వున్నవి. ఇది స్థూల, సూక్ష్మములుగా వ్యవహరించుచు, క్రియాశక్తి, జ్ఞానశక్తిగా పనిచేయుచున్నవి. పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ రూపముగా వాక్కు సూక్ష్మరూపమై చలనాత్మకమగుచున్నది. అంతరేంద్రియముల ద్వారా ఈచలనము ఇంకనూ సూక్ష్మమైవున్నది. సృష్టి కారణమగు బ్రహ్మము నందు నిక్షిప్తమై యున్న పరావాక్కు సంకల్పరూపమై, సూక్ష్మమైన మానసిక చలనం ఏర్పడుచున్నది. అట్టి సంకల్ప రూప పరిణామమందు కలిగిన సృష్టి యందు కూడా ఈ చలనము కలిగి యున్నది. ప్రత్యక్షంగా యోచించినచో సృష్టిలోని సమస్తమూ చలిస్తూనే వున్నది. అయితే సృష్టికి పూర్వపు దశయందు సృష్టికి కారణమగు బ్రహ్మము తాత్కాలిక అచలస్థితి కలిగి వున్నది. సృష్టి సంకల్పముతో ప్రధమ చలన మేర్పడి ప్రళయా నంతరము వరకు చలనరూపంగానే వుండి సృష్టి స్థితి

లయ ఆకర్షణలను చేయుచున్నది. కావున ఇట్టి వస్తువు చల, అచల రెండు లక్షణములు కలిగి సాపేక్షిక శబ్దము లోనికి జేరుచున్నది.

ఎట్టి మార్పు లేక కేవలాచల స్థితి కలిగిన దాన్నే అచలశబ్దము చేత సూచింపబడు చున్నది. పూర్ణము అనగా ఒక ఆవరణము నందు పరిపూర్ణముగా ఏమీ ఖాళీలేకుండా నిండి యుండుట అనవలెను.ఇట్లు వున్నపుడు దేనియందు పూర్ణమై నిండియున్నదో ఆ ఆవరణ రూపవస్తువు మాత్రమువేరుగా వున్నదన వలెను. కాని పరిపూర్ణమన్నపుడు ఆవరించిన వస్తువు కూడా లేక పరిపూర్ణముగా నిండిన వస్తువు తప్ప మరి ఇతరమైన దేమీ లేదు. దాని నావరించిఉన్న వస్తువు కాని ఏ ఒక్క పేరుతో వ్యవహరించు టకు అన్యులెవరైనా గాని వుండుటకు స్థానము కాని లేదన్నమాట. ఇట్టి పరిస్థితుల్లో దానికి పేరు కూడా వుండుటకు సావకాశము లేదు. కాని శిష్య ప్రబోదార్ధము వ్యవహారపరంగా అచలము, బయలు, బట్టబయలు, పరిపూర్ణము అను శబ్దములచే దాన్ని సూచించుట జరిగింది. ఈ శబ్దములైనా బోధ దృఢీకరణకు ఒక ప్రత్యేకార్ధముతో మాత్రమే చెప్ప బడుచున్నవి.

పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప మిగతా సర్వ ప్రపంచము చలన స్వరూపమై యున్నది. పరిపూర్ణమును సూచించుటలో, అచలమను సాపేక్షిక శబ్దము ప్రయోగించుటలో చలించుటకు కావలసిన తెలివి, చోటు లేనిది అని చెప్పుటకు, దానిని సూచించుటకు అచల శబ్దము ఉపయోగింపబడు చున్నది. పరిపూర్ణము అనుశబ్దముచే తాను తప్ప ఇతరమైన దేమియు లేదనుటకు ఈశబ్దము ఉపయోగింపబడినది. పరిపూర్ణపరబ్రహ్మమను శబ్దము ఒకటే నరుని నోట ఎంగిలి కాక విలక్షణమై వున్నది. మిగతా సమస్త శబ్దములు వాక్కు చేత ఉచ్ఛరించుటకు వీలైవున్నవి. కావున మనోవాక్కుల కందనిదై కేవలత్వము కలిగి వున్నది. ఎట్టి పరిణామములకు మార్పులకు లోనుకాక తనకు తాను స్వతస్సిద్ధమై చలించుటకు వీలుగాక తానై వున్నది అను దానిని సిద్ధాంతీకరించుటయే ఈ హెడ్డింగులో వున్న ముఖ్యాంశము. దర్శనమనగా చూచుట అని సామాన్యార్ధము. వాక్కునకగోచరమై యున్న ఇట్టి

పరిపూర్ణ పరబ్రహ్మమును బోధనార్థము గురువులు శిష్యులకు ఎట్లు బోధింపగలరు? అను సందేహం కలుగుట సహజం. శాస్త్రీయంగా ఏవస్తువునైనా సూచించుటకు అట్టిది ఇట్టిది అని వాక్కుచే వర్ణించి చెప్పుట విధి ముఖముగా చెప్పబడుట అనబడును. పరోక్షంగా కనిపించే ప్రతీదాన్ని వ్యతిరేకిస్తూ ఇదికాదు, ఇదికాదు అను తటస్థ లక్షణముచే బోధించుటకు వీలగు చున్నది. సర్వ లక్షణ విలక్షణమైన పరిపూర్ణపరబ్రహ్మమును వాక్కుచేత బోధించలేము. సర్వ లక్షణములకు కారణమైన కారణ వస్తువును (ఎరుకను) శిష్యులకు బోధించిన (స్థాన, స్వరూప, స్వభావముల ద్వారా) అట్టిబోధచే తానే ఆ బ్రహ్మమునని ఆరూఢ పరచుకొని యున్న శిష్యునికి ఇట్టి నీస్థితికి రూపమునకు బైట వేరైవున్న పరిపూర్ణమును అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్దములచే గురువు సూచించుట, శిష్యుడు తానున్న స్థితిని విడిచిచూచుట జరుగును. ఇదియే దర్శనమను శబ్దమునకు నిజ అభిప్రాయము. ఎరిగి భావించుట అనునది భావన దృఢమైన తర్వాత ఎరిగిన దాన్ని విడచుట లేక ఎరుక లేక సేవించుట అని గ్రంథకర్త ఈకందార్థములకు సెలవిచ్చియున్నారు.

కం॥ పుట్టుటగిట్టుటలేకను। పుట్టే గిట్టేటి యెరుకపోడి మెరుగకన్।
చట్టువలెకదల కుండును। బట్టబయల్ యిట్టిదె రిగి।
భావింపదగునూ। యెరుకలేక సేవింపదగునూ। వట్టియా
శలచాత పట్టూబడకనుయీ। గుట్టూ దేశికునోట గట్టీగ
దెలుసూక। భావింపదగునూ। యెరుకలేక సేవింపదగునూ॥32

## ప్రతిపదార్థము

పుట్టుట, గిట్టుట లేకను = పుట్టుక, చావు అనులక్షణములు లేకుండా

పుట్టే గిట్టేటి ఎరుక పోడిమెరుగకన్ = పుట్టు, చావులు కలిగిన వస్తువుతో ఏమాత్రము సంబంధపడక

చట్టు వలెకదలకుండును = చట్రాయివలె చలించక వుండును

బట్ట బయలు = పరిపూర్ణ పరబ్రహ్మము

ఇట్టిది = పై లక్షణములు కలిగి

ఎరిగి = గుర్తించి

భావింపదగును = గురు ప్రబోధ ద్వారా దృఢ పరచుకొనవలెను

ఎరుకలేక సేవింపదగును = వున్న పరిపూర్ణమును గుర్తించి దానియందు గుర్తించిన ఎరుక లేనిదని దృఢపరచుకొనవలెను

వట్టి ఆశలచేత పట్టుబడక = గురుముఖత: గాక తన స్వప్రయత్నము చేతను సాధ్యముగాక

గుట్టు = రహస్యము లేక తెలుసు కునే విధానము

దేశికునోట = సాంప్రదాయబద్ధ మైన గురువు ద్వారా

గట్టిగ తెలుసూక = బాగా దృఢపడేవరకు తెలుసుకో వలెను

## తాత్పర్యము

జనన మరణములకు కారణమైన ఎరుకను, జనన మరణములతో సంబంధపడక దానికి వేరై వున్నఅచల పరిపూర్ణమును వస్తునిశ్చయ పూర్వకముగా గురు ప్రబోధ ద్వారా దృఢపరచుకొని (అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్దములద్వారా) ఏ గుర్తుచే ఈరెంటి వివరము గ్రహించనైనదీ అట్టిగుర్తును కూడా వాక్కుచేత విడిచిపెట్ట వలెను. ఇదంతయు గురు ప్రబోధ ద్వారా శిష్యుడు పై అంశములు బోధనా పద్ధతిగ దృఢ పరచుకోవల్సిందే తప్పవూహా పోహలు తన స్వప్రయత్నముచే ఏ మాత్రము సాధ్యపడదు.

కం॥ యెరుకై నరీతినుండును। యెరుగనశక్యంబటంచు
యెన్నినయురుకన్। యెరుగుదుననినను యెరుకకై।
యెరుగుటన్ దుర్లభముసుమ్మి। యీవృత్తబైలూ। యెరుగనె
యెరుగ। దెరుకాని బైలూ। పెరుగాదు విరుగాదు వొరుగాదు
తరుగాదు। అరుగాదు కరుగాదు తిరుగాదు మొరుగాదు।
యీవృత్తబైలూ। యెరుగ నెయెరుగ। దెరుకానీబైలూ॥ 33

## ప్రతిపదార్థము

ఈ ఉత్త బయలు = ఈ పరిపూర్ణ పరబ్రహ్మము

ఎరుకైన రీతినుండును = తెలియబడినట్లుగా అనిపిస్తుంది

ఎరుగన శక్యం బటంచు ఎన్నిన = ఈగుర్తు చేత తెలియ బడనిది అనినను

ఎరుకన్ ఎరుగుదునన్నను = గుర్తుచేత నాకు స్వానుభవమైనది

ఎరుకకే = ఇవన్నీ గుర్తుకి సంబంధించినవే

ఎరుగుట దుర్లభము సుమ్మీ = గ్రహించుట చాలా కష్టమైన విషయము

ఎరుగనే ఎరుగదు ఎరుకన్ = ఈ గుర్తుచేత ఏ మాత్రము తెలియబడదు

ఈ బయలు = ఈ పరిపూర్ణ పరబ్రహ్మము

పెరుగాదు = వృద్ధిచెందదు

విరుగాదు = ముక్క చెక్కలు గాదు

ఒరుగాదు = దిగజారదు

తరగదు = తరుగు దల లేనిది, వ్యయంకానిది

అరుగాదు = (క్షయం) తగ్గదు

కరుగదు = మార్పు చెందదు

తిరుగదు = చలించదు

మొరుగదు = మాట్లాడదు

## తాత్పర్యము

ఈ పరిపూర్ణ పరబ్రహ్మము గుర్తుచేత ఏమాత్రము గుర్తింపబడక, తనయందు ఎరుకకు మూలముగాని, స్థానము గాని లేక ఎట్టి పరిణామములకు లోనుగాక, మార్పు చెందక స్వతస్సిద్ధమై వున్నది. గుర్తుచేత లొంగినట్లుగా, తెలియబడినట్లుగా, తెలియ బడనట్లుగా ఎన్నివిధాల అనిపించినా ఇవి ఎరుకకు సంబంధించిన మాటలే గాని, పరిపూర్ణము ఎట్టి మాటచేత సూచింప బడదు.

కం॥ పలుకునబలుకగరాకను। తలపోయుద మనినమదికి దగులక
యెంపుడున్। ములుగ్రుచ్ఛసంధిలేకను। కలిగున్నది
బట్టబయలు। గదరామాయన్నా। యిదిగోచూడు। కదులాదో
యన్నా। పలుకన్న బలుకాక తలపన్నదెరుగాక। చలియండ
వానాల నలయాక నిలచుండు గదరా మాయన్నా। ఇదిగో
చూడు। కదులాదోయన్నా॥ 34

## ప్రతిపదార్థము

మాయన్నా = మానాయనా, నాతండ్రీ
బట్టబయలు = పరిపూర్ణ పరబ్రహ్మము
పలుకున పలుకగరాదు = మాటలచేత చెప్పటానికి సాధ్యముగాక
తలపోయుదమనిన మదికి తగులక=ధ్యానించుటకు మనసుకు గుర్తుకు వీలుగాక
ఎపుడున్ = సర్వకాల సర్వావస్థలయందు
ములుగ్రుచ్ఛ సందులేక = గుండు సూది మొన కూడా దిగుటకు ఖాళీ లేక
కలిగున్నది = స్వత: సిద్ధమైవున్నది
ఇదిగో చూడు = నీగుర్తును విడిచి చూడు
కదులా దోయన్నా = చలించక వున్నది
పలుకన్న పలుకక = మాటలచేత తెలియరాక, మాటలు తనయందు లేక
తలపన్నదెరుగక = ఆలోచనన్నదిలేక
చలి,యండ, వానలనలయక = కాలము, ప్రకృతి చేత బాధింప బడక
నిలుచున్నది = స్వత: సిద్ధమై వున్నది.

## తాత్పర్యము

నాయనా! పరిపూర్ణ పరబ్రహ్మము ఎట్టి వాక్కుచేత వచింపబడక, ఆలోచనకు మనసుకు స్వాధీనపడక, గుండుసూది బెజ్జము గుచ్చుటకు కూడా ఖాళీ లేక గుర్తించే స్వభావము కలిగిన నీకు వేరై వున్నది. అట్టిదానిని నీగుర్తుచే విడిచి చూడు. దానియందు పలుకుకు కారణమైన శబ్దముగాని, మనసుకు కారణమైన జ్ఞానము గాని లేక త్రికాలా బాధ్యమై కదలక స్వత: సిద్ధమై వున్నది.

కం॥ సామార్థ్యమేమిజూపదు। కామక్రోధాదికములగల యదనిశమే।
బాములెరుంగదుయితరులు। యేమని ననువూరు
బల్కాదీబట్టబైలా। దీనికిమ్రొక్కే। రితరాజేజేలా।
నామరూపక్రియనటనాలన్నియుమీరి। యేమానియనరాక
యేకామై యున్నాది। యీ బట్టబైలా। దీనికి మ్రొక్కే।
రితరాజేజేలా॥ 35

## ప్రతిపదార్థము

సామర్థ్యము = శక్తి, లేక ప్రభావము

ఏమీ చూపదు = ఏ మాత్రము ప్రదర్శించదు

కామక్రోధాదికములు = కామము, క్రోధము మొదలగు ఆకాశాంశ గుణములు

కలయదు = సంబంధపడదు

అనిశము = ఎల్లప్పుడు

బాము లెరుంగదు = కష్టాలు, సమస్యలు తెలుసుకోదు

ఇతరులు ఏమనినను మారు పల్కదు = తనకు వేరై వున్నవారు ఏవిధంగా స్పందించినా ప్రతి స్పందించదు

ఈ బట్ట బయలు = ఈ పరిపూర్ణ పరబ్రహ్మము

దీనికి మ్రొక్కేరు = దీనికి నమస్కరిస్తారు

ఇతర జేజేలు = సత్వగుణ సంబంధమైన దేవతా సృష్టిలో ఏర్పడిన దేవతలకు వేరైనవారు

నామ రూప క్రియ నటన లన్నియు మీరి = నామము,రూపము, క్రియ మున్నగునవి అతిక్రమించి

ఏమని అనరాక = నోటితో ఏమాత్రము వర్ణించడానికి వీలు కాక

ఏకమై యున్నాది = తాను తానుగా స్వత:సిద్ధమై యున్నది.

## తాత్పర్యము

ఈ పరిపూర్ణ పరబ్రహ్మము ఎటువంటి శక్తిని ప్రదర్శించదు. ఆకాశ భూత సంబంధమైన కామ క్రోధాదులతో సంబంధపడదు. సర్వకాల

సర్వావస్థలయందు ఏకమై ఎట్టి పరిణామములకు మార్పులకు లోను కాదు. ఇతరులు ఏమనినను మారు పల్కదు. స్పందన, ప్రతిస్పందన లేక తనకు తానై వుండును. నామము, రూపము, క్రియ, నటనలు వీటినన్నిటిని అతిక్రమించి మనో వాక్కుల కందక తనకు తానుగా స్వత:స్సిద్ధమై వున్నది. దీనిని గూర్చిన అవగాహన కలిగించుకొన్నవారు, అట్టి స్థితియందున్న వారు మాత్రమే దానియందు చింతించుచు ఉనికి గల్గి యుందురు.

కం॥ ఇంతంతనియనరానిది। వింతలుశాయనిది। యెన్నివిధముల
గనినన్। చింతలెరుంగని దీబయు। లెంతని వినిపింతు
నేనీకేమిరవృథుకా। తెల్పుటవినుట। మిక పెద్దకథకా।
సంతాతమొకరీతి సకలాదేశములాయం। దంతాటనిండున్న
దదుగోపరిపూర్ణాము। యేమిరవృథుకా। తెల్పుటవినుట। మిక
పెద్దకథకా॥ 36

## ప్రతిపదార్థము

పృథుకా = పృథ్వీనుండి జన్మించినవాడా! ఓ శిష్యుడా!
ఇంతింతని యనరానిది = చిన్న, పెద్ద అనుకొలతలేనిది
వింతలు సేయనిది = మార్పులకు లోను కానిది
ఎన్ని విధముల గనినన్ చింతలెరుంగనిది = ఎన్నివిధాలుగా పరిశీలించినా ఎట్టి మనో వికారములు లేనిది
ఈ బయలు = ఈ పరిపూర్ణ పరబ్రహ్మము
ఎంతని వినిపింతు నేనీకు = ఎన్నివిధములుగా నేను నీకు దృఢపరచగలను?
తెల్పుట వినుట = చెప్పుట, వినుట అను క్రియలు
ఇక పెద్దకథకా = అంతము లేని కథగా పెరుగుచునే యుండును
సంతాతము = ఎల్లప్పుడు
ఒకరీతిగా = ఒక్క విధముగా
సకల దేశములయందు = అన్నివస్తువులయందు

అంతటా నిండివున్నది=అంతటా పరిపూర్ణమై తను తప్ప రెండోది లేక నిండి వున్నది

అదిగో పరిపూర్ణము=పై లక్షణములన్నియు కలిగి వున్నది పరిపూర్ణ పరబ్రహ్మము.

## తాత్పర్యము

ఓ శిష్యుడా! ఈ పరిపూర్ణ పరబ్రహ్మము అణు ప్రమాణము మధ్యమ ప్రమాణము, మహత్ ప్రమాణము అను మూడిటికి లోను గాక ఎటు వంటి మార్పులకు పరిణామములకు లోనుగాక, ఎట్టి సంకల్ప వికల్పములు లేక, ఎట్టి వర్ణనకు వీలుకాక ఏకమై వున్నది. ఇట్టి దాని గురించి ఏవిధముగాను వర్ణించుటకు వీలు పడదు. సకల దేశములయందు, సర్వకాలములందు, సమస్తమైన వస్తువులయందు చలించక తనకుతానుగా స్వత:సిద్ధమై వున్నది.

కం॥ కనరానిదాన్ని శూన్యం। బనియనదగుగానిబయలు
నందగదుసుమీ। కనవచ్చుచున్న దిందులో। కనుగొను టకు
యెరుకలేదు। కనుగొనరాదా। యెరుకనెశూన్యమని।
యనరాదా। కనవొచ్చెనాలేద కనుగొంటిలేదాని। యనరా
దభయముమేమియను మానించకు। మిదుగొ। కనుగొన రాదా।
యెరుకనె। శూన్యమని యనరాదా॥ 37

## ప్రతిపదార్థము

కనరానిదాన్ని = మనస్సుకు వాక్కుకు అందనిదాన్ని

శూన్యంబని = లేనిదని

అనదగుగాని = అనవచ్చును గాని

బయలు ననతగదు సుమీ = పరిపూర్ణము ననుటకు వీలు లేదు

కన వచ్చుచున్నది = వస్తునిశ్చయముగా ఎరుకను గుర్తించి, అది విడచినవారికి కనిపించుచున్నది

ఇందులో కనుగొనుటకు ఎరుక లేదు = అట్టి స్వత:స్సిద్ధమైన దానియందు గుర్తించే తెలివి లేదు.

కనుగొనరాదా = విచారించి తెలుసుకొనవచ్చును గదా
ఎరుకనే శూన్యమని అనరాదా = గుర్తించే గుర్తే లేదని అనవచ్చును గదా
కన వొచ్చెనా లేదా = పైన పేర్కొన్న అంశములు దృఢమైనవాలేదా
కను గొంటి = దృఢ పరచు కొంటిని
లేదని అనరాదా భయమేమి = గుర్తించిన తెలివిని లేదని చెప్పుటకు సందేహ మెందుకు?
అనుమానించకు = ఎటువంటి తొట్రుపాటు పడకు

## తాత్పర్యము

మనస్సుకు, వాక్కుకు అనుభవంలోకి వచ్చిన దానిని వున్నదని, అట్లనుభవమునకు రానిదానిని లేనిదని చెప్పుకొనుట ప్రపంచంలో సహజమై వున్నది. ఈ రెండు అంశములు పరిపూర్ణ బోధయందు పనికిరావు. ఏలననగా స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తించే ఎరుక లేనిది. కావున ఇట్టి లేని ఎరుకకు అనుభవానికి సంబంధించిన మాటలేవీ పనికిరావు. వస్తు నిశ్చయపూర్వకముగా పరిపూర్ణము ఎరుకలు గుర్తించినవారికి ఈ తేడా స్పష్టంగా తెలిసియుండి ఉన్న పరిపూర్ణమందు లేని ఎరుక శూన్యమని తెలియ గలదు. ఇట్టి వస్తు నిశ్చయ జ్ఞానమందు మాత్రమే ఎట్టి సందేహము లేక వున్నదున్నట్లుగా గ్రహించుకొన వీలగును

కం॥ దేవుణ్ణి నిన్ను యెరుగవు। నీవిప్పటికెట్టివారొ నేదెల్పెదనీ।
కేవెర్రిబోధలెందుకు। కావున దేవుణ్ణి యిదుగొ। కనుగొన వోయీ।
నామరూప। కర్మాలేవోయీ। నీవాదేవుని లోనని నులెన్నవెదకిన।
న్నావాలిముచ్చాటనడుగోయీ తెల్పెదకనుగొన వోయీ
నామరూప। కర్మాలేవోయీ॥ 38

## ప్రతిపదార్థము

దేవుడ్ని నిన్ను ఎరుగవు=పరిపూర్ణము ఎరుకల గూర్చి ఇంతవరకు నీవు గుర్తించలేదు
ఎట్టి వారొనే తెల్పెద = ఎటువంటివో నేను ఈబోధ రీత్యా దృఢ పరచగలను.

నీకే వెఱ్రి బోధ లెందుకు = నీకితరమ్మైన భిన్న భిన్న మత సాంప్రదాయమ్మైన వాదనలెందుకు?
కావున దేవుడ్ని = అందుచేత పరిపూర్ణ పరబ్రహ్మమును
ఇదుగో కనుగొన వోయీ = నేబోధించిన విధంగా నిన్ను విడిచి చూడు
నామ రూపకర్మలేవోయి = నామము, రూపము, పని లేవు
నీవా దేవుని లోన నిను లెన్నవెదకి=నీగుర్తుచేత పైవిధముగా పరిపూర్ణమును గుర్తించి విచారించి
నన్నావలి ముచ్చట = ఆపైన నీకు కలిగిన అనుభవం
అడుగోయి = దృఢపరచుకొన్న పిదప కల్గిన భావము
తెల్పెద = వివరిస్తాను

## తాత్పర్యము

పరిపూర్ణ పరబ్రహ్మమను దేవుడు, నీవు ఎటువంటి వారో నీకింతవరకు దృఢము కాలేదు. పై రెండంశములు ఎటువంటివో నేను వివరంగా నీకు దృఢ పరచెదను. ఈ రెండంశముల గూర్చి వివరించుటలో మతములు భిన్న భిన్న అభిప్రాయములు కల్గి వున్నవి. వాటితో సంబంధము లేకనే ఉన్న స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమును నీవు గుర్తించిన గుర్తుని విడచి చూడుము. దానియందు నామము, రూపము, క్రియ లేనిదై యున్నది. అట్టిదానిని గురు ప్రబోధచే దృఢ పరచుకొని నీ ఆరూఢతను వివరించుము. దృఢము కానియెడల తిరిగి దృఢపరచు కొనుట ఎట్లో వివరించెదను.

**కం॥ లేదనుకుమున్నదదుగో। నేదెలసితిననకు దీన్నినీ వెరిగేవా।**
**కాదదినీచే దెలియను। యేదిరతన్మాత్రసమితి। యీబట్టబైటా।**
**దీనికిసాటి। దేదియెచ్చోటా। వాదేలలేనెరుకతో దీన్నిగనిపెట్టి।**
**పోదొట్టు మెరుకనిం। కేది బట్టదుచాలు। యీబట్టబైటా।**
**దీనికి సాటి దేదీయెచ్చోటా॥ 39**

## ప్రతిపదార్థము

ఈ బట్టబైలు = ఈపరిపూర్ణము నందు
తన్మాత్ర సమితి = శబ్ద, స్పర్శ, రూప, రస,గంధములు
ఏవిర = ఎక్కడున్నాయి?

లేదనకుము = పరిపూర్ణమును
వున్నది = స్వత: సిద్ధమై వున్నది
అదిగో = గుర్తించే నీకు వేరై వున్నది
నే తెలిసితిననకు = నేను గుర్తించానని అనకు
దీనిని నీవెరిగేవా? = గుర్తులేని దాన్ని నీవు గుర్తించడం సాధ్యమా
కాదు = సాధ్యము కాదు
అది నీచే తెలియును =పరిపూర్ణము నీచే తెలియ బడాలంటే
దీనికి సాటి దేది ఎచ్చోట = దీనితో సమానమైనది వేరొకటి లేదు
వాదేల = వాద ప్రతి వాదనకు లోనుకాకుండా
లేనెరుక తో దీన్నికనిపెట్టి = గురువాక్యముద్వారా బోధను దృఢపరచుకొని
పో దొట్టు మెరుక = ఎరుక లేనిదని విడచిపెట్టు
ఇంకేదీ పట్టదు = ఇంకేవిధమైన భ్రాంతి నీకుండదు
చాలు = సరిపోతుంది

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణమును లేదని చెప్పకు. వున్నదాన్ని నిన్ను విడచి చూడు. ఆపైన దాన్నెరిగితినని చెప్పకు, నీవుదాన్ని ఎరుగుట సాధ్యముగాదు. ఏలననగా తెలుసుకొనుటకు వీలుగా నున్న పంచ తన్మాత్రలుగాని, వాటి సమిష్టి రూపమైన ఎరుక గాని దానియందు లేవు. పరిపూర్ణముతో పోల్చదగిన ఇతర వస్తువేమియు లేదు. వస్తునిశ్చయ పూర్వకముగా తెలుసుకొన్నవారికి ఇది స్పష్టమగును. ఉన్న పరిపూర్ణమును లేని ఎరుకతో కనిపెట్టి ఎరిగిన దానిని విడచిన చాలును. భ్రాంతి రహితమునకు ఇంతకంటే మార్గము వేరే లేదు.

కం॥ కనవచ్చియిట్టి దట్టి ది। యనియనరాకుండు బయలు
నదెకనుగొనుమీ। కనరాకపోతెశూన్యం। బనుమిట్టి దియట్టి
దనుచు। పలుకవచ్చిననూ। యెరుకదాంట్లో। పలికీజొచ్చిననూ।
వినుమూబయలును నీవేమనినా। నొప్పెదగ। నొప్పను
నీమాటనునే। జెప్పినరీతిగనవస్తె। పలుకవ్చిననూ। యెరుక।
దాంట్లో పలికీ జొచ్చిననూ॥ 40

## ప్రతిపదార్థము

కనవచ్చి = స్వచ్ఛముగా వున్నదని దృఢ పడినమీదట

ఇట్టిదట్టిదని అనరాకుండు బయలు = ఇటువంటిది, అటువంటిది అని గ్రహించడానికి వీలు లేనిది పరిపూర్ణము

అదె కనుగొనుమీ = నిర్భయంగా దృఢ పరచుకో

కనరాకపోతే శూన్యంబను = నీకు దృఢము కాని ఎడల లేదని చెప్పు

ఇట్టి దట్టి దనుచు పలుక వచ్చినను=ఇటువంటిది, అటువంటిది అనిచెప్పబూనిన

ఎరుక దాంట్లో పలికి జొచ్చినను=గుర్తించే తెలివి దానియందు ప్రవేశించినను

వినుమా బయలును నీవే మనిన ఒప్పె = నీగుర్తుచేత ఎటువంటి అనుభవం మాట్లాడినా అంగీకరిస్తాను.

తగనొప్పను నీమాటను నే చెప్పినరీతిగనవస్తె = సిద్ధాంత రీత్యా నేచెప్పిన ప్రబోధచే నీ అనుభవమును నే నంగీకరించను.

## తాత్పర్యము

పరిపూర్ణము వాక్కుచేత ఇటు వంటిదటువంటిదని చెప్పుటకు వీలులేదు. చెప్పేనీ గుర్తుని విడిచి చూడుము. నీ గుర్తునకందనిచో శూన్యమని చెప్పుము. పరిపూర్ణము గూర్చి నీ గుర్తుచే గ్రహించు విషయములన్నియు ఎన్ని చెప్పినా నేను వినియెదను. కాని సిద్ధాంత రీత్యా నేబోధించిన విధానముచే మాత్రమే నీకు సంశయ నివృత్తి కాగలదు.

కం॥ కనవొచ్చు బయులులేదని। యనవచ్చునె యిట్టి దట్టి
దనవచ్చునె ఛీ। యనరాదుయెరుకకెన్నడు। కనుకనెయీ
బయలు। యెల్లకాలాముంచుండీ। దీనందెరుకే। కాలాము లేందీ
వినుమీ లేనెరుకానువివరించ శూన్యామా। అనుమా నమే
మెరుకగను। విశ్వమట్టిదే। కాలాముంచుండీ। దీనందె రుకే।
కాలాములేందీ॥ 41

## ప్రతిపదార్థము

కనవొచ్చు బయలు లేదని అనవచ్చునె=స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమును లేనిదని అనవచ్చునా

ఇట్టి దట్టిదనవచ్చునె = గ్రహించిన గుర్తుచేత ఇట్టి దట్టిదని అనవచ్చునా

ఛీ యనరాదు = ఏ అనుభవము చెప్పరాదు

ఎరుక కెన్నడు = గుర్తుచేత ఏ మాట మాట్లాడరాదు

కనుక నె = అందుచేతనె

ఈ బయలు ఎల్ల కాలాముంచుంది=ఈపరిపూర్ణము సర్వకాల సర్వావస్థల యందు స్వత:సిద్ధమైవున్నది

దీనందెరుకే కాలము లేంది = దీనియందు గుర్తు ఏమాత్రము లేదు

వినుమీలేనెరుకాను వివరించశూన్యమౌ = గురుర్వాక్యముచేత ఎరుకను విచారించిన లేనిదగును

అనుమాన మే ఎరుకగను విశ్వమట్టిదే = ఎరుకలేదు కావున దాని పరిణామ రూపమగు విశ్వముకూడా లేనిదే అగును

## తాత్పర్యము

స్వత: సిద్ధమైన పరిపూర్ణము లేదని చెప్పవచ్చునా? చెప్పరాదు. లేని ఎరుక ఉన్న బయలును చూచి ఎట్టినిర్ణయమైనా చేయగలదా? కాబట్టి పరిపూర్ణము సర్వకాలము లందు ఉంటుంది. అట్టిదానియందు ఎరుక ఏ కాలములేంది. కావున ఈ లే నెరుకను విచారించిన ఎడల శూన్యమై లేకపోవుచున్నది. దాని పరిణామమైన ప్రపంచము గూడా లేనిదే అగుచున్నది.

కం॥ గురుమూర్తి జూవకున్నను। పరిపూర్ణంబెట్లు తనకం ప్రత్యక్షమగున్। గురుమూర్తిజూపెనేనియు। పరిపూర్ణము తనకు లెస్స। ప్రత్యక్షమౌరా। చూస్తునెయెరుక। పారిపోవునురా। యెరుకాబోయినవెనుక యెవరా ప్రత్యక్షాన్ని। యెరిగిట్టి। దట్టి దంచె రిగెవారటుమీద। ప్రత్యక్షమౌరా। చూస్తునె। యెరుక పారిపోవునురా॥ 42

## ప్రతిపదార్థము

గురుమూర్తి చూపకున్నను = గురువు వస్తు నిశ్చయ పూర్వకముగా ఎరుక, పరిపూర్ణములను దృఢ పరచకుండా

పరిపూర్ణము ఎట్లు తనకు ప్రత్యక్షమగున్ = పరిపూర్ణము వున్నదని ఎట్లు తనకు దృఢము కాగలదు?

గురుమూర్తి చూపె నేనియు = గురువు దృఢపరచిన మీదట

పరిపూర్ణము తనకు లెస్స ప్రత్యక్షమౌరా = గురుసూచనద్వారా స్పష్టముగా తనకు దృఢ పడగలదు.

చూస్తూనె ఎరుక పారిపోవునురా=అట్టి దృఢభావన యందు ఎరుక లేక పోవుచున్నది

ఎరుకా పోయిన వెనుక = ఎరుక లేదని దృఢమైన పిమ్మట

ఎవరా ప్రత్యక్షాన్ని ఎరిగి = ఎవరు వున్నదాన్ని గ్రహించి

ఇట్టి దట్టిదంచెరిగేవారటుమీద = ఆపైన వారు గ్రహించిన విషయాన్ని చెప్పడానికి గుర్తు లేదు

## తాత్పర్యము

గురువు ఎరుక, పరిపూర్ణములను వస్తునిశ్చయ పూర్వకముగా కేటాయించి చెప్పకుండా ఎవరికి వారే స్వతంత్రంగా పరిపూర్ణమును గుర్తించలేరు. గురుప్రబోధ మాత్రము చేతనే దానిని దృఢ పరచుకొనగలరు. పరిపూర్ణమును దర్శించిన తోడనె గుర్తించు ఎరుక తనకు తానుగా లేక పోవును. అట్టి స్థితియందు ఉన్న దానిని గూర్చి లేనిగుర్తు ఎట్టి అనుభవము చెప్పజాలదు.

కం॥ పరమపదమనిన బయలన। గురుగుహ్యమనంతమనిన గోప్యంబనినన్। పరిపూర్ణ మచలమనినను। తిరమనగా బట్టబయలు। తెలియుమాయప్పా। యీ తెలిసిన తెలివి మానప్పా। యెరుకానెరుగనిదన్న నెరుకమీరినదన్న। యెరుకా మరుపులులేనిపర వస్తువనబయలె। దెలియుమా యప్పా। యీతెలిసిన తెలివిమానప్పా॥ 43

## ప్రతిపదార్థము

పరమ పదము = అత్యంత శ్రేష్ఠమైన స్థితి
బయలన = బహిఃప్రదేశము, విశాలమైనది
గురు గుహ్యము = గురువు వద్దనున్న రహస్యము
అనంతము = అంతము లేనిది
గోప్యంబు = రహస్యముగానున్నది
పరిపూర్ణము = తాను తప్ప రెండోది లేనిది
అచలము = కదలనిది
స్థిరము = ఎట్టి మార్పులకు లోనుకానిది
బట్టబయలు = ఆకాశము + ఆత్మ అను ఈ రెంటికి వేరైనది
తెలియుము = గ్రహించుము
మాయప్పా = నాయనా
ఈతెల్సిన తెలివి మానప్పా = ఏగుర్తుచే గ్రహించితివో ఆగుర్తుని విడిచిపెట్టు
ఎరుక నెరుగనిదన్న = గుర్తుచేత తెలియబడనిదన్న
ఎరుకా మీరినదన్న = గుర్తు నతిక్రమించియున్నదన్న
ఎరుకామరపులు లేని పరవస్తువన = ఎరుక, మరపులకు వేరైవున్న వస్తువు
బయలె = పరిపూర్ణమె

## తాత్పర్యము

నాయనా! పరమ పదము, బయలు, గురురహస్యము, అనంతము, రహస్యము, పరిపూర్ణము, అచలము స్థిరము మొదలగు పేర్లతో పరిపూర్ణమును పోల్చవచ్చును. ఏగుర్తుచేత దాన్ని తెలియు చున్నామో అట్టి గుర్తును విడువవలెను. ఎరుక చేత తెలియబడనిది, ఎరుకకు వేరైవున్నది, ఎరుక, మరపులను వస్తువులు లేనిది, స్వతఃసిద్ధమైయున్నదిగా పరిపూర్ణమును తెలియ వలెను.

కం॥ బట్టబయంలనుచందీనికి। మొుట్టమొుదల్ పేరులేదు
ముదమునయెరుకే। పుట్టిపేర్బెట్టిదీనిని। పట్టుకలవ్వాడలేక।
పారిపోవునురా। కనరాదిందు। దూరానేరదురా। పుట్టిచచ్చుచు
మళ్ళిబుట్టి గిట్టుచుబుట్టు। నిట్టితిప్పలనొందు యెురుకె
బయంలును జూస్తే। పారిపోవునురా। కనరాదిందు।
దూరనేరదురా॥ 44

## ప్రతిపదార్థము

బట్టబయలు = పరిపూర్ణము
దీనికి మొుట్ట మొుదల్పేరు లేదు = మొుదటిలో ఎట్టి పేరు లేదు
ముదమున = సంతోషముగా, తనకు తానుగా
ఎరుకే పుట్టి = గుర్తు ఏర్పడి
పేర్బెట్టి = సకల వ్యవహారాలు చేస్తూ
దీనిని పట్టుకలవ్వాడలేక=వున్నదానియందు మూలముగాని స్థానము గాని లేక
పారిపోవునురా = లేకుండా పోతుంది
కనరాదిందుదూరనేరదురా=మూలము లేక వచ్చిన తాను తనకు తానే లేక పోవును
పుట్టి చచ్చుచు మళ్ళిపుట్టి గిట్టుచు పుట్టు = జనన మరణములు పొందుచు
ఇట్టతిప్పలనొందు ఎరుకె = ఇట్టి మార్పులకు లోనైన గుర్తె
బయలును చూస్తె పారిపోవునురా=పరిపూర్ణమును గ్రహించి తాను లేక పోవుచున్నది

## తాత్పర్యము

పరిపూర్ణమునకు మొుట్టమొుదట ఏ పేరులేదు. ఏపేరులైనా ఎరుక పుట్టినతరువాత ఏర్పడినవె. వున్నదానియందు లేని తాను, తన చేనిర్ణయింపబడిన పేర్లు పరిపూర్ణమునందు కానరాకపోవుచున్నవి. జనన మరణములకు కారణమైన ఎరుక పరిపూర్ణమును వుండ జూచిన మీదట తనకు తానే లేకపోవుచున్నది.

# ఎరుక నిర్ణయము

పరిపూర్ణ బోధ యందు ఎరుక యొక్క వస్తునిశ్చయ జ్ఞానము చాలా ప్రధానాంశముగా చెప్పబడు చున్నది. ఈ బోధయందు తెలియ వలసినది, విడువవలసినది ఇదే అంశము కాబట్టి దీని గూర్చి సమగ్రమైన వివరణ ఈ శీర్షికలో చెప్పబడు చున్నది. ఎరుక అను శబ్దము సాంకేతికముగా కందార్థమందు చెప్పబడుచున్నది. వేదాంత శాస్త్రమునందు ఈ శబ్దమునకు అనుబంధంగా ఆత్మ, బ్రహ్మము, అధిష్టానము అనుశబ్దములచే సూచింపబడుచున్నది. ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి అనగా పిండాండ మందున్న జ్ఞానము చేత ఏ మేరకు తెలియబడు, తెలుసుకొను లక్షణములు కల్గి యుండి సమగ్ర దర్శనం లేక అఖండ జ్ఞానము కల్గుటకు వీలున్నదో దానినే ఎరుక శబ్దము చేత సూచింపబడుచున్నది. ఇది తెల్సినమీదట తెలివిచే తెలియ వలసినది ఇక ఏమీ మిగలదు. మతనిర్ణయమునందు జ్ఞానాద్దైవతు కైవల్యం అనగా జ్ఞానము యొక్క అత్యంత చివరిదశ పొందడమే మోక్ష శబ్దమునకు నిర్వచనముగా చెప్పబడుచున్నది. పరిపూర్ణభావము ఈ అంశము నుండియే ప్రారంభమగుచున్నది. పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి ఎరుకను మాను అను అంశములో ఎరుగుట అనగా వినుట అని సామాన్యార్థము. విశేషార్థములో గుర్తించుట అనికూడా కలదు. ఆగుర్తింపు కూడా స్థాన, స్వరూప, స్వభావములుగా ఒక నిర్దుష్టమైన విధానముగా మాత్రమె చెప్పబడు చున్నది. శాస్త్రమునందు గ్రంధస్తముకానిది గురువు తప్ప ఇతరులు ఎవరూ చెప్పలేనిది ఈ అంశమే. ఉదాహరణకు పంచదారను గుర్తించుటకు డబ్బాలో వున్నది అనునది స్థాన నిర్ణయము. తెల్లగా వున్నది, మెత్తగా వున్నది స్వరూప నిర్ణయము తియ్యగా వున్నది అనునది స్వభావ నిర్ణయము. ఈ క్రమంలో దీని ననుభూతం చేసుకొనుటలో పంచదార ఇతర వస్తువులతో సమిశ్రితమై భిన్న భిన్న నామ రూపములతో వ్యక్త పరచబడుచున్నది. మూల పదార్థమును గుర్తించినవారు భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శిస్తారు. అట్టి విధానము నెరుగనివారు నామరూపాత్మకమైన

పదార్థ జ్ఞానంతో వ్యవహరిస్తారు. ఈ సిద్ధాంతమందు ఎరిగి విడువ వలసినదిగా ఉన్నందున మరీ స్పష్టముగా ఈ రచనయందు దీనిని గురించి వివరించ బడుచున్నది. శాస్త్రదృష్ట్యా సత్యజ్ఞానమనంతం బ్రహ్మ అని చెప్పబడుచున్న ఈ వస్తువు పరిపూర్ణబోధ సిద్ధాంతరీత్యా లేనిది అని చెప్పబడుచున్నది. ఈ అంశములు రెండును విరుద్ధముగా నున్నందున స్పష్టమైన అవగాహన కల్గించు కొనవలసి యున్నది. ఇది ఎవరికి వారే కల్గించుకోవలసిన అంశంకాదు. ఇతరులు ఎవరూ కల్గించలేనిది. ఈ సిద్ధాంతమందు ప్రముఖమై గురుముఖతా వస్తునిశ్చయ పూర్వకముగా తెలియవలసిన అంశము.

కం॥ పిండ బ్రహ్మాండ బులు। రెండును యా రెంటిలోని
రెండహములు। యీ ఖండములు నాల్గుగూడియు। ఖండంబగు
యెరుక రూపుగనరామాతండ్రీ। యిదిదేల్పిన। ఘనుడే
తలిదండ్రీ। ఖండా ఖండములూ గగనిపించె యెరుకానె।
దండీదనెటి యుద్ధండూలకలనైన। గనరామా తండ్రీ।
యిదిదెల్పిన। ఘనుడె తలిదండ్రీ॥ 45

## ప్రతిపదార్థము

పిండ బ్రహ్మాండములు రెండును = పిండాండ మనగా కుండలినీ శక్తి వ్యష్టి ప్రాణము బ్రహ్మాండమనగా సమిష్టి ప్రాణము ఈ రెండూ

యా రెంటిలోని = ఈ రెండింటిలోని

రెండహములు = అహమనగా నేననుగుర్తు

యీఖండములు నాల్గుగూడి = ఈ నాల్గు భాగములు కలసి

అఖండంబగు ఎరుకరూపు గనరా = ఏక రూపముగా అంతటా వ్యాపించి యున్న జ్ఞానము యొక్క రూపముగుర్తించు

మాతండ్రీ = మానాయనా

ఇది దెల్పినఘనుడే = ఈవిషయాన్ని తెలియజేసిన గొప్పవాడు

తల్లీతండ్రి = నీజన్మకు ( ఉనికికి ) కారణభూతమైనవారు

 

ఖండా ఖండములూగగనిపించె ఎరుకానే=ముక్కచెక్కలుగా కన్పిస్తున్న ఈగుర్తుని
దండీదనెటి = గొప్పదిగా చెప్పబడుచున్న
యుద్ధండుల కల =గొప్పవారి యొక్క కల

## తాత్పర్యము

ఓ శిష్యుడా! వ్యష్టి రూపముగా ఉపాధి గతము చెంది కుండలినీరూపములో వున్న వ్యష్టి ప్రాణము, చరా చరాస్పృష్టిలో అనగా పృధివ్యాది పంచ భూతములయందు చలనాత్మకమై (శక్తివంతమై) సమిష్టి ప్రాణము ఈ రెంటియందు నేను అనబడు గుర్తు (మన: ప్రాణ సంయోగమువల్ల) ఈనాలుగు అనగా పిండాండము, అందలి అహము, బ్రహ్మాండము అందలి అహము కూడి అఖండమైన ఎరుక స్వరూపముగా గుర్తించుము. ఈ నిర్ణయ విధానము గురుముఖత: తెలియుట వలన గురువే నీకు తల్లి, తండ్రి అగుచున్నాడు. ఏక రూపముగా ఉన్నను ఈ ఎరుక ఉపాధులందు ఇది భిన్న భిన్నములుగా వ్యక్త పరచు చున్నది. ఖండా ఖండములుగా వ్యక్తమగుచున్న దీనినే మోక్షస్థానమని మత సాంప్రదాయకములయందు నిర్ణయింపబడుచున్నది. కాని పరిపూర్ణబోధ సిద్ధాంత రీత్యా ఇది లేనిది అనిగుర్తించుము.

కం॥ యెరుకేదేహేంద్రియములు। యెరుకేవర్ణాశ్రమములు
యెరుకేశృతులున్। యెరుకేనీవునునేనును। యెరుకేసతిసోద
రాదు లెరుగుమువత్సా। నేదీర్చెద। నిదుగోనీయిచ్ఛా। హరిహర
బ్రహ్మదిసురనరగిరిసరి। త్తరుమృగ ముఖచరాచరమూలు
యెరుకాని। యెరుఁగుమువత్సా। నేదీర్చెద। నిదుగోనీయిచ్ఛా॥46

## ప్రతిపదార్థము

వత్సా = నాయనా
నే తీర్చెద ఇదుగో నీఇచ్ఛ=నీవు కోరిన విధముగా ఎరుక ఉత్పత్తి, స్థితి నాశనాన్ని వివరిస్తాను,

ఎరుకే దేహేంద్రియములు=పంచ భూతాంశ గుణములతో కూడిన శరీరము, గుర్తెరిగే శరీరము, పంచతన్మాత్రలచే ఏర్పడిన ఇంద్రియములు

వర్ణాశ్రమములు = కర్మానుష్టాన విధానముగా ఆశ్రయింపబడుచు నిర్ణయించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రాదులు ఆశ్రమములు అనగా బ్రహ్మ చర్యము, గృహస్థు, వానప్రస్థము, సన్యాసము

శృతి = చూసి చెప్పునది

స్మృతి = విని చెప్పబడుచున్నది

నీవు, నేను, సతి సోదరాదులు=చెపుతున్ననేను, వింటున్ననీవు, భార్యాపిల్లలు మొదలైన వారంతా

హరిహర బ్రహ్మాది సురలు = హరి = విష్ణువు; హరుడు = శివుడు; బ్రహ్మాది సురలు = బ్రహ్మ మొదలగు దేవతలు

నర గిరి సరితరు మృగ మఖ = నరులు - మానవులు (నారములు = ప్రాణములు) గిరి = కొండలు

సరి=నదులు తరు=వృక్షములు మృగ = మృగములు; మఖ = చేపలు (జల చర) చరా చరములు = కదులుతున్నవి, కదలనివి రాళ్ళు వృక్షములు మొదలైనవి.

## తాత్పర్యము

ఓ శిష్యుడా సృష్టి పరిణామ క్రమంలో వస్తుజాలమంతయు ఎరుకే, రసగ్రాహ్యమైనస్థావరములు, రసరూపమను రెండు తెల్వ్యేలుగల జలచరంబులు. గంధ, రస రూపమను మూడు తెల్వ్యేలు గల పక్షులు, గంధ, రస, రూప, స్పర్శ నాలుగు తెల్వ్యేలు గల మృగాదులు, గంధ, రస, రూప, స్పర్శ, శబ్దమను అయిదు తెల్వ్యేలు గల మానవులు ఈ విధముగా పంచ భూతాంశ గుణములతో ఏర్పడిన సమస్త వస్తుజాలము ఎరుకే. వీటిద్వారా ఏర్పడిన స్థూల శరీరము, ఇంద్రియములు, వర్ణాశ్రమములు మానవోపాధి యందలి తరగతులు ఇంతే కాక బ్రహ్మాది దేవతలు, కొండలు, చెట్లు, నదులు, జంతు జాలము (మృగ) చేపలు మున్నగు కదలీ కదలని సమస్త సృష్టికూడా ఈ ఎరుక స్వరూపమే అని గ్రహించుము. ఈ విధముగా ఎరుక ఉత్పత్తి పరిణామక్రమమునకు లోనై యున్నది. ఇదిగాక అధిష్టానము

నందలి సంకల్పముచే జీవ జగత్ సృష్టి సత్వ గుణముచేత దేవతా సృష్టి, రజో గుణముచేత జీవసృష్టి తమో గుణము చేత జగత్ సృష్టి కలిగెను. ఈ మొత్తమంతయు ఎరుక స్వరూపమె. దీనికి సంబంధించిన జ్ఞానము కలిగించు వేద వాఙ్మయ మంతయు అనగా శబ్దజ్ఞానమంతయూ ఎరుక స్వరూపమె అని తెలియుము.

కం॥ యెరుకే విద్యావిద్యలు। యెరుకేప్రణవంబు। నాదమెరు
కేకళయున్। యెరుకేబిందువుసత్చి। త్తెరుకే ఆనందమివినీ
వెరుగూసద్బుధీ। నీనామాట। లెరుకేనిబద్ధీ యెరుకేనిర్గుణస
గుణాలెరుకే। యెరుకకుయంత యెరుకోనేనిదియంత
యెరుకాజేసితినీవిట్లెరుగూసద్బుద్ధీ। నీనామాట। లెరుకేనిబద్ధీ॥47

## ప్రతిపదార్థము

సద్బుద్ధి = విచక్షణా జ్ఞానము కలవాడు

విద్యావిద్యలు = విద్ అనగా ప్రకాశము లేక జ్ఞానము

అవిద్య = అప్రకాశము, అజ్ఞానము

ప్రణవము = అ కార ఉ కార మ కార అర్ధమాత్రా స్వరూపమైనది ఓంకారము

నాదము = శబ్దము లేక ధ్వని

కళ = జ్ఞానముచే అనుభూతము కావింపబడు భావనలు (షోడశ కళలు)

బిందువు = నిశ్చలాత్మకమైన మానసిక స్థితి

సత్ చిత్ ఆనందము = త్రికాలా బాధ్యమై జ్ఞానమే స్వరూపముగా గల్గి సుఖ దు:ఖములు లేని అద్వయ స్వరూపము

నీనామాట = ఉపదేశిస్తున్ననేను, వింటున్న నీవు

నిర్గుణము=సృష్టి అంతయు తనలో బీజప్రాయంగా ఇముడ్చుకొన్న బ్రాహ్మీస్థితి

సగుణము = సృష్టి విజృంభణలో బ్రహ్మాండ పరిణామము

ఎరుకకు ఎంత ఎరుకో = గుర్తుకు తెలియబడునంతవరకు

నేను అది అంతా ఎరుక జేసితి = సమగ్రంగా వివరించాను

నీవిట్లెరుగు = పైన చెప్పబడిన అంశములన్ని శ్రద్ధగా గ్రహించు

## తాత్పర్యము

ఓ శిష్యుడా జ్ఞానాజ్ఞానములు. ఓంకారము, నాదబిందు కళలు, సత్ చిత్ ఆనందము మున్నగున్నవి ఎరుక యొక్క పరిణామములే. మనిద్దరిమధ్య జరుగు ప్రసంగములు, సృష్టికి పూర్వము ఉన్న నిర్గుణము, తదనంతరము వున్న సగుణము. ఇది,అది అని మినహాయింపు లేకుండా గుర్తుచేత అనుభూతమౌ సమస్తము ఎరుక స్వరూపముగా గ్రహించుము. ఇందు సర్వ శబ్దము చేత ఎరుక యొక్క అఖండత్వము ప్రతిపాదింపబడుచున్నది.

**కం॥ యెరుకేఇహపరసౌఖ్యము। లెరుకేజ్ఞానం బుజ్ఞేయమెరుకే మోక్షం।**
**బెరుకేభక్తివిరక్తులు। యెరుకేసంకల్పమనినీ మెరుగూసత్కీర్తి।**
**యెక్కడికౌర। యెరుకాసంపూర్తి। యెరుకే జీవుండీశు**
**డెరుకెతదేకత। యెరుకేసర్వమునే గుర్తెరిగీ చెప్పితియీకీ।**
**లెరుగూసత్కీర్తి। యెక్కడికౌర। యెరుకా సంపూర్తి॥ 48**

## ప్రతిపదార్థము

సత్కీర్తి = గొప్పదైన పుణ్యసంస్కారము గలవాడు.

ఇహపరసౌఖ్యములు=ఇహమనగా స్థూలశరీరముతో కలసి అనుభవించు భోగములు పరమనగా సూక్ష్మశరీరముతో అనుభవించు పరలోక భోగములు

జ్ఞానము జ్ఞేయము=జ్ఞానము అనగా గుర్తించునది. జ్ఞేయమనగా గుర్తింపబడునది

మోక్షము = విడుదల

భక్తి = విడవబడిన వ్యష్టి తత్వము తన మూల తత్వములో చేరుటకు చేయు ప్రయత్నము

విరక్తి = వైరాగ్యము లేక సన్యాసము

సంకల్పము = కార్యసాధనకు మొదటి అంశము

నీవెరుగు = ఒకటిగా ఎరుకగా గుర్తించు

ఎక్కడి కౌర ఎరుక సంపూర్తి=ముగింపులేని అనగా మొదలు కొన లేని స్వరూపము

జీవుండు = మన: ప్రాణ సంయోగములో ఏర్పడిన పిండాండ మందలి చైతన్యము

ఈశుడు=బ్రహ్మాండ మండలి సమిష్టి చేరికలో కల్గిన మన: ప్రాణముల చైతన్యము
తదేకత = మహా వాక్య విచారణ ద్వారా పొందు జ్ఞానము
సర్వము నేగుర్తెరిగి చెప్పితి=సమగ్రమైన అవగాహనతో ఈ నిర్ణయము చెప్పుచున్నాను
ఈ కీలెరుగు = ఈ రహస్యాన్ని గుర్తించు

## తాత్పర్యము

ఓ శిష్యుడా స్థూల శరీరము ద్వారా అనుభవించు ఐహిక భోగములు, సూక్ష్మ శరీరము ద్వారా అనుభవించు పరలోక సుఖములు ఒకే ఆవరణ బద్ధమై వున్నవి. జ్ఞానము (విషయరూపకమైన జ్ఞానము) దానిద్వారా తెలియబడు వస్తువు జ్ఞేయము, మోక్షస్థానము, కూడియుండుట, విడచియుండుట, సంకల్పము, జీవేశ్వరులు, మహావాక్యవిచారణద్వారా వీటి ఏకత్వము, మొదలైన అంశములన్నియు ఎరుకగా గుర్తించుము. ఈ ఏకభావనను నేను అనుభూతము గావించుకొని నీకు చెప్పుచున్నాను. ఇది రహస్యము. నీవును అనుభవము గావించుకొని గుర్తించుము.

కం॥ చింతలతోటననెరుకే। వింతలపుట్టిల్లనంగవెలసినదెరుకె।
తంతుల పేటన యెరుకె పంతములకుచూడ। మూలబల
మన్నెరుకె జగజ్జనన। స్థలమన్న నెరుకే। భ్రాంతూలకెల్లాను
పట్టాణమనజెల్లి। కాంతాదిరూపూలు గల్పించుటకు। మూల।
బలమన్నెరుకే। జగజ్జననస్థలమన్నెరుకే॥ 49

## ప్రతిపదార్థము

చింత = ఆలోచన, తలంపు
తోట = సమూహము లేక అనేకము
వింతలు = విచిత్రములు
పుట్టిల్లు = ఆధారము, కేంద్రము
తంతులు = పనులు
పేట = కేంద్రము
పంతము = ఆధారము లేక పట్టు

మూల బలము = అత్యంతకేంద్రస్థానము
జగజ్జననస్థలము=పంచభూతాత్మకమైన ఈ ప్రపంచము వుండుటకు స్థానము
భ్రాంతి = వున్నది లేనట్లు లేనిది వున్నట్లు కనిపించుట
పట్టణమనజెల్లి = కేంద్రముగా చెప్పబడు
కాంతాది రూపులు = స్త్రీలు మొదలగు భిన్నత్వమునకు
గల్పించుటకు = తయారు చేయుటకు లేక ప్రవేశ పెట్టుటకు

## తాత్పర్యము

ఈ ఎరుక ఆలోచనలకు తోట వంటిది. విచిత్రములకు పుట్టిల్లు వంటిది. సమస్త వ్యవహారములకు కేంద్రము. సమస్త కదలికలకు అత్యంత మూలాధారము. పంచ భూతాత్మకమైన జగత్తు పుట్టుటకు స్థానము. సమస్త భ్రాంతులకు కేంద్రస్థానము. స్త్రీపురుషాది భేదములు కల్పించుటకు కారణము కూడా అయి వున్నది.

కం॥ అన్నియుతానైతనకవి। పన్నుగవేరనుచునోటబలుకం
చుమరితా। నన్నిటినెరిగేయెరుకై। యున్నాననియెరుకే
యెరుకనూహింపు చుండూ తనలోతానె। మోహింపుచుండూ।
యెన్నోవిచిత్రాలీయెరు కాశాతలువింటె। వున్నాదిలేదు
లేకున్నది కలదానిది। వూహింపు చుండూ। తనలోతానె।
మోహింపు చుండూ॥ 50

## ప్రతిపదార్థము

ఎన్నో విచిత్రాలీ ఎరుక సేతలు = ఎన్నో ఆశ్చర్య కరమైన పనులకు
అన్నియు తానై = సృష్టిలో కలిగిన పిపీలికము మొదలు బ్రహ్మాండము వరకు గల వస్తువులుగా తానే పరిణామముచెంది
అవి = ఆ వస్తువులు
పన్నుగ = స్పష్టంగా
వేరనుచు = ఇతరముగా భావిస్తు
నోట బలుకుచు = వ్యవహారిస్తు

మరి = తరువాత

తానన్నిటినీ ఎరిగే ఎరుకై వున్నానని = సమస్తమును ప్రకాశింపజేయ గలుగు సత్పదార్థము తానే అయివున్నానని

ఎరుకే ఎరుక నూహింపుచుండు=తెలివే తనను జీవుడుగా, ఈశ్వరుడుగా, జగత్తుగా, వేరువేరుగా వున్నట్లు యోచించును

తనలో తానే = తనంతట తానుగా

మోహింపుచుండు = ప్రేమను పెంచుచుండు

విచిత్రాలు = సర్వసాధారణముగా జరగని పనులు

సేతలు = పనులు

వున్నాది లేదు లేకున్నాది కలదు =సత్యమైనది అసత్యముగా, అ సత్యమైనది సత్యముగాను

## తాత్పర్యము

సృష్టిలో కలిగిన సమస్త వస్తువులుగా తానే పరిణామము చెంది వ్యవహార సత్తాచేత గుర్తించే తనకు అవి వేరుగా వున్నవని పేర్కొనుచు, మరియు ఈ సమస్తమునుప్రకాశింప జేయుటకు తానే ఆధారము, మూలము గాను పేర్కొనుచు, తనయందు తానే భ్రమకల్గి వుండును. తన సృష్టిలోని వస్తువులచేత తనకు తానే ఆకర్షింపబడుచూ భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వంగా ప్రకాశిస్తూ, ఆశ్చర్యకరమైన జనన మరణములకు కేంద్రముగా వుండి, సత్యవస్తువైన పరిపూర్ణము లేనట్లుగాను, అసత్యమగు ఎరుక వున్నట్లుగాను, తనలో తానే భ్రమించి, సమస్త భ్రాంతులకు కారణమైనదిగా ఈ ఎరుకే వ్యవహరించు చున్నది.

కం॥ తల్లిదండ్రులుజీవేశులు। యిలవ్యోమములేను వేను
ఎరుకమరుపులున్। కలమేల్క లుశుక్లాశ్రం। బులునీరాన్న ములు
ప్రకృతి। పురుషూడాల్మగడూ। గానైయెరుక। కెరుకెకా నబడూ।
తెలసీబయలున్నాదిదెలసి యీతెలివిని। తెలివిచాత నెపట్టి।
తీసివెయ్యుము ప్రకృతి। పురుషూడాల్మగడూ। గానైయెరుక।
కెరుకేకానబడూ॥

## ప్రతిపదార్థము

తల్లిదండ్రులు=బీజకారణమైన తండ్రి, అది అభివృద్ధిచెందుటకు కారణమైన తల్లిగాను

జీవేశులు=పిండాండ చైతన్యము జీవుడుగాను, బ్రహ్మాండ చైతన్యము ఈశ్వరుడు గాను

ఇల వ్యోమము = భూమి, ఆకాశముగాను

నేను మేను = స్థూల, సూక్ష్మ శరీరములుగాను

ఎరుక మరపులు = సమస్తమును గుర్తించు జ్ఞానముగాను, అట్టిభావము లేక వ్యక్తిగా ప్రకాశించుట

కల మేల్కొ = స్వప్నావస్థ, జాగ్రదావస్థ

శుక్లా శ్రమములు = సృష్టి కామనకు పురుషుడు యందు శుక్లముగాను, స్త్రీయందు శోణితము గాను తయారయే పదార్థము

నీరాన్నములు = కఠినాంశమైన ఆహారము, ద్రవాంశమైన నీరు

ప్రకృతి పురుషుడు = ప్రకృతి = ప్రాణము పురుషుడు = జ్ఞానము

ఆలు మగలు = భార్యా భర్తలుగాను

ఎరుకే ఎరుక కనబడు = ఒకటిగానున్న తాను రెండుగా పనిచేయును

తెలిసి = పై అంశములను చక్కగా దృఢపరచుకొని

బయలున్నాదితెలిసి = వీటికి వేరై పరిపూర్ణము వున్నదని తెలుసు కొని

ఈ తెలివిని తెలివి చేతనే పట్టి = పైన పేర్కొన్న వాటిని విచారించు తాను గుర్వాక్యము అనేగుర్తు చేతనె

తీసి వేయుము = లేదనిదృఢ పరచుకొనుము

## తాత్పర్యము

ఒక్క ఎరుకయే తల్లిదండ్రులుగా, జీవుడు, ఈశ్వరుడుగా, భూమి ఆకాశములుగా, నేను, మేనులుగా ఎరుక మరపులు, కల, మేల్కొలు, శుక్ల శోణితములు, అన్నపానములు, ప్రకృతి పురుషులు, భార్యాభర్తలుగానై, ఏకము ద్వంద్వముగాను, ద్వంద్వం ఏకముగాను ప్రకాశిస్తు లేక తెలియబడుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మమును, ఇట్టి ఎరుకను బాగా

దృఢపరచుకొని, అట్టి ఎరుకను, గురుర్వాక్యము అనగా షోడశి మంత్రముచేత లేనిది అని విడిచి పెట్టుము.

కం॥ ఆటాడియాడకుండును। ఆటాడినమేని బొమ్మయా టాడకనే।
ఆటాడునెరుకయనియెడి। యాటాడించేటివాడు।
యతడేరాకర్తా అంతటికీయా। యచలామకర్తా। చేటూపాటుల
రెంటిచేవొచ్చుఫలము। ముమ్మాటికి కనుభవించి మరణాజ
ననములొంద। నతడేరకర్తా। అంతటికీయా యచలామకర్తా॥52

## ప్రతిపదార్థము

ఆట = జాగ్రదావస్థ
ఆడకుండు = సుషుప్త్యావస్థ
ఆటాడిన మేని బొమ్మ ఆటాడకనే ఆటాడు = స్వప్నావస్థ
ఎరుక యనెడి ఆటాడించేటివాడు=గుర్తెరిగే తెలివితో ఈ మూడు అవస్థలకు కారణమైనవాడు
అతడేర కర్త = అట్టి ప్రత్యగాత్మయే ఆధారము కారణమై వున్నాడు
అంతటికీ = ఈపనులన్నిటికీ
అచలము = పరిపూర్ణము
అకర్త = కారణము కాదు
చేటు పాటులు = మంచి చెడ్డలు లేక పాప పుణ్యములు
వచ్చు ఫలము = కలిగే ఫలితము
ముమ్మాటికి = తప్పని సరిగా
అనుభవించి= ఫలప్రదము చేయుటకై
మరణ జననము లొంద = పుట్టు చావులు పొందుటకు
అతడేరకర్త = ఎరుక పురుషుడే కారణము

## తాత్పర్యము

జాగ్రత, స్వప్నము, సుషుప్తి అనుమూడు అవస్థలకు పిండ బ్రహ్మాండములయందు ప్రత్యగాత్మ పరమాత్మ రూపంగావున్న ఎరుకే

కారణము, మూలముగా నున్నాడు. పరిపూర్ణమునకు దీనికి ఎట్టి సంబంధము లేదు. ఈ అవస్థల యందు జరుగు కర్మఫలము పాప పుణ్యరూపములో అనుభవింప జేయుటకు, జనన మరణములు పొందుటకు ఈ ఎరుక పురుషుడే కర్త, భోక్త అయివున్నాడు. ఈ వ్యవహారములో అచల పరిపూర్ణమునకు ఎట్టి సంబంధము లేదు.

కం॥ దేహమునుజూచుకన్నులు। దేహమునకు వేరులేని
తీరునయెరుకే। కోహంకస్త్వంతవదా। సోహంసోహం బటంచు।
చూచుచుండుసుమీ। తనకుతానె తోచూచుం డుసుమీ।
దేహిదేహములానెతెరగూనప్రసరించి। దేహము గానివి
దేహిగతననూ తాజూచూచుండుసుమీ। తనకుతానెతో
చూచుండుసుమీ॥ 53

## ప్రతిపదార్థము

దేహమును జూచు కన్నులు = శరీరమందలి ఇతరభాగములను గుర్తించు చక్షురీంద్రియము
దేహమునకు వేరులేని తీరున = శరీరమునకు వేరుగా లేనప్పటికి
కో+ అహం = నే నెవ్వడను?
క + స్త్వం = నీ వెవ్వరు?
తవ దాసోహం = నీకు సేవకుడను
సో + అహం = నేనే
బ్రహ్మమటంచు = అన్నవిధంగా
చూచు చుండు సుమీ = భిన్న భిన్నముగా వ్యవహరించుచుండును
తనకు తానే = తనంతట తానే
తోచు చుండుసుమీ = వూహించుచుండు సుమీ
దేహి = లోపలున్న జ్ఞానము
దేహము = దాని కావరణాత్మకమైన శరీరము
ప్రసరించి = మార్పు చెంది

విదేహినని = దేహము లేని వానిగ

తనను తాచూచుచుండు సుమీ = తన్ను తానుగా భావించుచుండును

## తాత్పర్యము

శరీర మందున్న నేత్రములు శరీరమునకు వేరుగా లేకుండా, శరీరమందలి ఇతర భాగములను తనకు వేరుగా వున్నట్లు ఎట్లు గ్రహించునో అట్లే గుర్తెరిగే జ్ఞానము వేరుగా లేకున్న నేనెవరు? నీవెవరు? నీవు, నేను ఒకటే వేరు కాము అను భిన్నరీతులుగా వ్యవహరించుచుండును. తనకు తాను ఒకటిగా వున్నా వేరుగా వూహించుచుండును. తనకు తానుగా తోచుచుండును. దేహి దేహములుగా లేక నేను మేనులుగా పరిణామము చెంది నేను శాశ్వతమని, మేను అశాశ్వతమని తన్ను తానుగా భావించుకొను చుండును.

కం॥ పరిపూర్ణ మొకటిదక్కని। తరమైనప్రపంచ మెల్లతగ దెలి
యుమునీ। వెరుకేననిమది లోపలయెరుకే పరిపూర్ణ మెరిగే
దెరుకానెరిగేది। యింకొకటిలే। దీరెంట్నెరిగేదీ। యెరుకాపుట్టువు
మూలమెరుగానిదీ యెరుకే। యెరుకెతాబుట్టీన దెరుగా
బోయితేలేదంచ్చెరుకానెరిగేదీ। యింకొకటిలేదీ రెంట్నెరిగేదీ!54

## ప్రతిపదార్థము

పరిపూర్ణ మొకటి దక్క = పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటి తప్ప

నితరమైన = వేరైవున్న

ప్రపంచమెల్ల = జీవేశ్వర జగద్రూపమైన సమస్తము

మదిలోపల = నీ మనస్సులో

తగ తెలియుము= సరిపడునట్లుగా తెలియుము

నీవు ఎరుకేనని = ఒక్క ఎరుకే వున్నదని స్పష్టముగా గ్రహించుము

పరిపూర్ణ మెరిగేదీ ఎరుక నెరిగేదీ ఎరుకే = తనకు, తనకన్యమైన పరిపూర్ణమును గుర్తించునదీ ఒక్కటే

ఈ రెంటినీ ఎరిగేది ఇంకోటి లేదు = పరిపూర్ణమును, ఎరుకను కేటాయించు తెలివి వేరుగాలేదు

ఎరుక పుట్టువు మూలమెరుగానిది ఎరుకే = అన్నిటినీ గుర్తించు తనకు మూలమును, స్థానమును గుర్తించలేనిది తాను పుట్టిన విధానమును తెలిసికొన ప్రయత్నం చేసినపుడు

లేదు = లేనిదానను

ఎరుక నెరిగేదీ = ఈ అంశాన్ని గుర్తించేది కూడా ఎరుకే

## తాత్పర్యము

స్వత:స్సిద్ధమైయున్న పరిపూర్ణము తప్ప దానికితరమైతోచు సమస్తము ఒక్క ఎరుకగా నీ మనసులో స్పష్టముగా గ్రహించుము. ఈ ఒక్క ఎరుకయే తనకు తనకన్యముగా నున్న పరిపూర్ణమును కేటాయించి తెలుసుకో గల్గుతున్నది. ఇదిగాక వేరే తెలుసుకోగల వస్తువు లేదు. తన ఉత్పత్తి క్రమము ఎరుగనిది తెలుసుకొను ప్రయత్నము చేసినచో, తాను లేనిది అని గుర్తించునది కూడా ఎరుకయే అని దృఢపరచు కొనుము.

కం॥ పాపములు పుణ్యములుభువి। బ్రాపించును యెరుక
చాతభ్రమసినవారిన్ ప్రాపింపవెరుక విడచిన। తాపసులను
చిత్తమందు। తగదెల్సుకొనుమీ। ఆగామిబో। ధనులెస్సా
వినుమీ। పాపాలలోశుద్ధస్ఫటికాసన్నిభమైన। ఆపోజ్యోతిని
ప్రత్యగాత్మానీ మదిలోన। తగదెల్సుకొనుమీ। ఆగామిబో।
ధనులెస్సావినుమీ॥ 55

## ప్రతిపదార్థము

చిత్తమందు తగ తెల్సుకొనుమీ=నీ ఆలోచనతో స్పష్టముగా కేటాయించి తెలుసుకొనుము

పాపములు = ఇతరులకు హానికల్గించునది. తనకు లాభము కల్గించునది

పుణ్యములు=తనకు కష్టము కలిగినా ఇతరులకు ప్రయోజనము కల్గించునది

భువి ప్రాపించును = ఈ భూమండలమందు ఏర్పడుచున్నది.

ఎరుకచేత భ్రమసినవారు = గుర్తెరిగే శరీరమే సత్యమని వ్యవహరించువారు

ప్రాపించును = సంక్రమిస్తాయి

ఎరుక విడచిన తాపసులను = పరిపూర్ణబోధద్వారా పరిపూర్ణము వున్నది

ఎరుకలేనిది అని ఆరూఢ పరచుకొన్నవారు, పరిపూర్ణ భావజ్ఞులు
ప్రాపింపవు = సంక్రమించవు
ఆగా మీబోధ = ఇకముందు జరుగు విచారణ
లెస్సగా వినుమీ = స్పష్టముగా గుర్తించుము
పాపాలలో = కంటి గ్రుడ్డులో
శుద్ధ స్ఫటిక సన్నిభమైన = స్వచ్ఛమైన కాంతితో ప్రకాశించు ఆపోజ్యోతిని
ప్రత్యగాత్మ = ప్రత్యేకముగా కేటాయించు ఆత్మ
మదిలోన = మనస్సులో
తగ తెల్సుకొనుమీ = స్పష్టముగా గుర్తించుమీ

## తాత్పర్యము

పరిపూర్ణ సిద్ధాంత రీత్యా పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అని దృఢ పరచుకొని వ్యవహరించు వారికి, వారుచేయు క్రియలయందు ఎట్టి పాప పుణ్యములు సంక్రమించవు ఎరుకను సత్యమని నమ్మియున్నవారికే అవి సిద్ధించును. ఈ అంశము చాలా స్పష్టముగా గ్రహించుము ఇది జరగబోవు విచారణలో అత్యంత శ్రద్ధతో గమనించవలసిన అంశములలో ఎరుక నిరూపణ యందు నేత్రపంచీకరణ ద్వారా కంటి గుడ్డులో ప్రతిఫలించిన శుద్ధ స్ఫటికాకారముతో ప్రకాశించుచున్న ఆపోజ్యోతినే ఎరుకను శబ్ధమునకు వస్తువుగా సూచిస్తారు. ఇది పరిపూర్ణము కంటె భిన్నముకాదని కూడా వాదిస్తారు. అది ప్రత్యగాత్మయని, ఈ శరీరముతో నశించిపోయేదని నీవుగుర్తించుము.

## ప్రతిపదార్థము

కం॥ యెరుకన్ననుమరుపన్నను। యెరుకకు యెరుకన్న దేహి
యనమాయయనన్। గురుతనసా। క్ష్యనజ్ఞప్త్యన। స్ఫురణయ
నన్ ద్రష్టయనిన। చూడూ మొక్కటిగా। యిది లేకుంటె।
చూడామొక్కటిగా। మరిచలాచలమూలమర్మా మెరిగేటిదన్న।
యెరిగితాలేనాని। యెగిరీపొయ్యేటిదన్న। చూడూమొక్కటిగా
యిదిలేకుంటే। చూడా మొక్కటిగా॥ 56

ఎరుక పుట్టువు మూలమెరుగానిది ఎరుకే = అన్నిటినీ గుర్తించు తనకు మూలమును, స్థానమును గుర్తించలేనిది తాను పుట్టిన విధానమును తెలిసికొన ప్రయత్నం చేసినపుడు

లేదు = లేనిదానను

ఎరుక నెరిగేదీ = ఈ అంశాన్ని గుర్తించేది కూడా ఎరుకే

## తాత్పర్యము

స్వత:స్సిద్ధమైయున్న పరిపూర్ణము తప్ప దానికితరమైతోచు సమస్తము ఒక్క ఎరుకగా నీ మనసులో స్పష్టముగా గ్రహించుము. ఈ ఒక్క ఎరుకయే తనకు తనకన్యముగా నున్న పరిపూర్ణమును కేటాయించి తెలుసుకో గల్గుతున్నది. ఇదిగాక వేరే తెలుసుకోగల వస్తువు లేదు. తన ఉత్పత్తి క్రమము ఎరుగనిది తెలుసుకొను ప్రయత్నము చేసినచో, తాను లేనిది అని గుర్తించునది కూడా ఎరుకయే అని దృఢపరచు కొనుము.

కం॥ పాపములు పుణ్యములుభువి। బ్రాపించును యెరుక
చాతభ్రమసినవారిన్ ప్రాపింపవెరుక విడచిన। తాపసులను
చిత్తమందు। తగదెల్సుకొనుమీ। ఆగామిబో। ధనులెస్సా
వినుమీ। పాపాలలోశుద్ధస్ఫటికాసన్నిభమైన। ఆపోజ్యోతిని
ప్రత్యగాత్మానీ మదిలోన। తగదెల్సుకొనుమీ। ఆగామిబో।
ధనులెస్సావినుమీ॥ 55

## ప్రతిపదార్థము

చిత్తమందు తగ తెల్సుకొనుమీ=నీ ఆలోచనతో స్పష్టముగా కేటాయించి తెలుసుకొనుము

పాపములు = ఇతరులకు హానికల్గించునది. తనకు లాభము కల్గించునది

పుణ్యములు=తనకు కష్టము కలిగినా ఇతరులకు ప్రయోజనము కల్గించునది

భువి ప్రాపించును = ఈ భూమండలమందు ఏర్పడుచున్నది.

ఎరుకచేత భ్రమసినవారు = గుర్తెరిగే శరీరమే సత్యమని వ్యవహరించువారు

ప్రాపించును = సంక్రమిస్తాయి

ఎరుక విడచిన తాపసులను = పరిపూర్ణబోధద్వారా పరిపూర్ణము వున్నది

ఎరుకలేనిది అని ఆరూఢ పరచుకొన్నవారు, పరిపూర్ణ భావజ్ఞులు
ప్రాపింపవు = సంక్రమించవు
అగా మీబోధ = ఇకముందు జరుగు విచారణ
లెస్సగా వినుమీ = స్పష్టముగా గుర్తించుము
పాపాలలో = కంటి గ్రుడ్డులో
శుద్ధ స్ఫటిక సన్నిభమైన = స్వచ్ఛమైన కాంతితో ప్రకాశించు ఆపోజ్యోతిని
ప్రత్యగాత్మ = ప్రత్యేకముగా కేటాయించు ఆత్మ
మదిలోన = మనస్సులో
తగ తెల్సుకొనుమీ = స్పష్టముగా గుర్తించుమీ

## తాత్పర్యము

పరిపూర్ణ సిద్ధాంత రీత్యా పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అని దృఢ పరచుకొని వ్యవహరించు వారికి, వారుచేయు క్రియలయందు ఎట్టి పాప పుణ్యములు సంక్రమించవు ఎరుకను సత్యమని నమ్మియున్నవారికే అవి సిద్ధించును. ఈ అంశము చాలా స్పష్టముగా గ్రహించుము ఇది జరగబోవు విచారణలో అత్యంత శ్రద్ధతో గమనించవలసిన అంశములలో ఎరుక నిరూపణ యందు నేత్రపంచీకరణ ద్వారా కంటి గుడ్డులో ప్రతిఫలించిన శుద్ధ స్ఫటికాకారముతో ప్రకాశించుచున్న ఆపోజ్యోతినే ఎరుకను శబ్ధమునకు వస్తువుగా సూచిస్తారు. ఇది పరిపూర్ణము కంటె భిన్నముకాదని కూడా వాదిస్తారు. అది ప్రత్యగాత్మయని, ఈ శరీరముతో నశించిపోయేదని నీవుగుర్తించుము.

## ప్రతిపదార్థము

కం॥ యెరుకన్ననుమరుపన్నను। యెరుకకు యెరుకన్న దేహి
యనమాయయనన్। గురుతనసా। క్ష్యనజ్ఞప్త్యన। స్ఫురణయ
నన్ ద్రష్టయనిన। చూడూ మొక్కటిగా। యిది లేకుంటె।
చూడామొక్కటిగా। మరిచలాచలమూలమర్మా మెరిగేటిదన్న।
యెరిగితాలేనాని। యెగిరీపొయ్యేటిదన్న। చూడూమొక్కటిగా
యిదిలేకుంటే। చూడా మొక్కటిగా॥ 56

ఎరుకన్నను, మరుపన్నను = జ్ఞానము, అజ్ఞానముగను

ఎరుకకు ఎరుకన్నను = గుర్తించే తెలివికి కూడా తెలివిచ్చునది

దేహి = శరీరమును ధరించు జ్ఞానము

మాయ = లేనిది వున్నట్లుగా భ్రమింప జేయునది

గురు తన = గుర్తించే తెలివి

సాక్షియన = సమస్తమును, జరుగుచున్న విధానము చూచునది

జ్ఞప్తి = అన్నిటి గురించి ఆలోచించునది

స్ఫురణ = స్ఫురింపజేయునది, గుర్తు చేయునది

ద్రష్ట = చూచునది

ఇది లేకుంటే చూడమొక్కటిగ=ఈ గుర్తెరిగే తెలివే లేనిచో గుర్తింప జాలము

చలా చలముల మర్మమెరిగేటిదన్న = ఎరుక, పరిపూర్ణముల ఉనికిని నిర్దుష్టంగా గ్రహించగలిగేది

ఎరిగితాలేనాని ఎగిరి పోయ్యేటిదన్న = పరిపూర్ణము ఉన్నదని గుర్తించి తాను లేనిదని దృఢపరచుకొన్నది

చూడు మొక్కటిగ=పైన పేర్కొన్న అంశము లన్నిటిని గుర్తించి వ్యవహరించునది.

## తాత్పర్యము

అన్నిటినీ గ్రహించు గుర్తన్నా, కొంత తెలిసి, కొంత తెలియని మరుపన్నా, అన్నిటినీ గుర్తించు అఖండ జ్ఞానమన్నా, శరీరమందు చిన్మయ రూపముగా ప్రకాశించుచు లేనిది వున్నట్లు, వున్నది లేనట్లుగా భ్రమింప జేయు మాయయన్నా, ఏ వస్తువు కావస్తువును విడిగా గ్రహించ గలుగు గుర్తన్నా, సకలము తోపింపజేయు స్ఫురణయన్నా, తనయందుజరుగు సకల వ్యవహారములు గుర్తించు ద్రష్టయనిన ఒక ఎరుకగా గుర్తించుము. ఇదియే లేనిచో మన మేమీ తెలియజాలము చూడజాలము. చలనాత్మకమగు తనను, అచలమగు పరిపూర్ణమును కేటాయించి విడివిడిగా గుర్తించునది. పరిపూర్ణము వున్నదని, తాను లేనిదని గ్రహించి తనకు తానుగా లేకపోవునది ఒక ఎరుకేనని తెలుసుకొనుము.

కం॥ అనుమానముమదినుంచక। వినుమింకనుయెరుక పేర్లు।
వివరించెదము। ధ్యనచిత్తంబనమానస। మనన హంకార
మనిననంతఃకరణనినన్। సంకల్పమంచని। నాయిచ్ఛనినన్।
తననితరులనేతానని గుర్తెరిగెటిదన్న। తననేకానితరూల
తననూ దిలిశెటిదన్న నంతఃకరణనినన్ సంకల్ప। మంచనినా
యిచ్ఛనినన్॥ 57

## ప్రతిపదార్థము

అనుమానము = సందేహము

మదినుంచకు = మనసులో నుంచకు

వినుమింకను ఎరుక పేర్లు వివరించెద = ఎరుకకు గల ఇతర వ్యవహార నామములు వివరించెదను

బుధ్యన, చిత్తమన, మానసమన, అహంకారమనిన = అంతఃకరణగా చెప్పబడు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము

అంతఃకరణమనినన్ = వీటి సమిష్టి రూపముగానున్న ఏకైక వస్తువు

సంకల్పమంచనిన, ఇచ్ఛనిన = సంకల్పించు సంకల్పము

ఇచ్ఛ = కోరిక

తననితరులనే తానని గుర్తెరిగేటిదన్న=తనను, ఇతరులను వేరువేరుగా గుర్తించునది

తననే కానితరూలతననూ తెలిసేటిదన్న=మొత్తమంతయు వేరు వేరుగా వున్న ఒక్కటేనని

## తాత్పర్యము

ఎరుకను వివరించుపట్ల ఎటువంటి సందేహము నీమనస్సులో వుండరాదు. అంతరేంద్రియ పంచకము, వాటి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ధర్మములు ఒక్క ఎరుకగా గుర్తించుము. వ్యష్టిరూపముగానున్న తాను, సమిష్టిరూపముగా ఉన్న ఈశ్వరత్వమునకు వేరుగా వున్నానని, మహా వాక్యవిచారణద్వారా సమస్తమును గుర్తించునది తానేనని, వేరు వేరుగా ఉపాధులందున్నను మొత్తము తానఖండస్వరూపమని ఒక్క ఎరుకే వున్నదని గుర్తించుము.

కం॥ తనువెరుకలు రెండొక్కటి। యని యనరాదనుచు
కొందరందురు భువిలో। తనువెరుకలలోనొక్కటి గనరా
కుంటేను। రెండు గనరావోయన్నా। రెండొక్కటె। వినరా
మాయన్నా। అనుమానమికయేల అందారిమాటాలు। విన
బోకనేబోధించినరీతి నెప్పుడు। గనరావోయన్నా। రెండొక్కాటె।
వినరా మాయన్నా॥ 58

## ప్రతిపదార్థము

ఓ అన్నా = ఓ శిష్యుడా
తను వెరుకలు = దేహి, దేహములు
రెండొక్కటియని = ఒకే వస్తువుగా వున్నాయని
అనరాదనుచు = చెప్పరాదని
కొందరందురుభువిలో=వేదాంత శాస్త్రమందు కొందరు ప్రతిపాదించుచున్నారు
తనువెరుకలలో =పైన పేర్కొన్న రెంటిలో
ఏ ఒక్కటికానరాకుంటేను = ఏ ఒక్క దానిని విడిచి చూచినా
రెండుకానరావు = రెండింటికీ ఉనికి లేదు
రెండొక్కటేవినరా = రెండు ఒక్కటిగా గుర్తించుము
అనుమానమికఏల = ఎటువంటి సందేహము ఇక పనికిరాదు
అందరిమాటలువినబోక = మతవాదుల అభిప్రాయములతో
సంబంధము లేకుండా
నేబోధించినరీతిని = నేను ఉపదేశించిన క్రమంలో
కనరా = దృఢపరచుకొనుము

## తాత్పర్యము

ఆవరణాత్మకమైన శరీరము, దానిని గుర్తింపజేసి ప్రకాశించు తెలివి ఒకటికాదని రెండూ భిన్న భిన్న వస్తువులని మతవాదములయందు ప్రతిపాదింపబడుతోంది. ఇది సరియైన నిర్ణయము కాదు. అనుభవంలో ఈరెంటిలో ఏ ఒక్క దానిని విడిచి చూచినా రెండవదాని ఉనికి లేకుండా

పోతుంది. కావున ఈ రెంటిని ఒక్కటిగా గుర్తించుము. ఎటువంటి సందేహములకు లోనుగాక, మతవాదుల నిర్ణయములకు ప్రాధాన్యత నివ్వకుండా ఎరుకయొక్క వస్తు నిశ్చయ జ్ఞానం నేబోధించిన క్రమములో ధృఢపరచుకొనుము.

కం॥ కనకమనభూషణంబులు। యినుమనశస్త్రాదికంబు లిత్తడి
యనినన్। గనుగొనపాత్రలు గనుపడు। తనువననవ
యువములన్ని। తగదొంతియనినా। కుండలుభూత।
తతిజగత్తనినా। వినుమిట్ల యెరుకన్న వివరించతత్వాలు।
మనసందు గట్టిగ మరువాకుమీ మాట తగదొంతియనినా।
కుండలు భూత। తతిజగత్తనినా॥ 59

## ప్రతిపదార్థము

కనకమన భూషణములు = బంగారము ఆభరణములుగా ప్రకాశించును
ఇనుమనశస్త్రాదికములు = ఇనుము వస్తు రూపములో
ఇత్తడి యనిన కనుగొనపాత్రలు = ఇత్తడి యనేది మనంఉపయోగించు వస్తురూపంలో వున్నది
తనువనఅవయవములన్ని = శరీరమనగా అవయవములతో కూడినది
తగదొంతియనిన కుండలు = మట్టిరూపంలో వున్నటువంటి పాత్రలు
భూతతతిజగత్తనిన = జగత్తనగా పంచభూతములతో కూడినది
వినుము = పైనపేర్కొన్నవిధంగా గుర్తించుము
ఎరుకన్న వివరించతత్వాలు=ఎరుకనగా నానాత్వంతో కూడుకున్నఏకవస్తువు
మనసందు గట్టిగ మరువకీమాట = భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం అని గట్టిగ దృఢపరచుకో

## తాత్పర్యము

బంగారం ఆభరణముగాను, ఇనుము వస్తువులుగాను, ఇత్తడి పాత్రలుగాను, శరీరము అవయములు గాను, మట్టి కుండలుగాను, జగత్తు

 

పంచభూతములుగాను, ఎట్లు తెలియబడుచున్నవో, ఆవిధంగానే ఎరుకను వస్తువు ఇరవై అయిదు తత్వముల చేరికయని నీమనసులో చాలా స్పష్టముగా గ్రహించుము.

కం॥ పొలరటిదుంపయనినను తరువులు వనమనినరవలు
ధారుణియనినన్ గిరియనినరాళ్ళు బట్టలు ధరముళ్ళియ
యనినతత్వ తతియెరుకంచనినా లేనిదెయెరుక స్థితి
లెస్సకనినా యెరుకా జేసిన విశ్వమెరుక వంటిదెబయలు
నెరుకాగుర్తెగిరితానేగీతెసరి తత్వతతియెరు కంచనినా
లేనిదెయెరుక స్థితి లెస్సకనినా॥ 60

## ప్రతిపదార్థము

లెస్స కనిన = స్పష్టముగా విచారించిన

పొరలరటి దుంపయనిన = అరటి దుంప పొరలుగా ఉన్నట్లుగ

తరువులు వనమనిన = వనమనగా వృక్షముల సమూహం

రవలుధారుణి యనినన్ = అణువుల సముదాయము భూమియనిన

గిరియనిన రాళ్ళు = పర్వతము లనగా రాళ్ళ సమూహమని

బట్టలు ధరముళ్ళియయని = మూట యనగా బట్టల సమూహము

తత్వతతి ఎరుకంచనిన =ఎరుకనగా తత్వముల సమూహము

లేనిదె ఎరుకస్థితి లెస్సకనిన=వస్తు నిశ్చయముగా విచారించినచో ఇది లేనిదే యగుచున్నది.

ఎరుక చేసిన విశ్వము = ఎరుక పరిణామ రూపమగు జగత్తు

ఎరుక వంటిదే = లేనిదే అగుచున్నది

బయలు నెరుకా గుర్తెరిగి తానేగితే = వున్న పరిపూర్ణమును లేని తానుగుర్తించి సమాధానపడుటతో

సరి = పూర్తవుతుంది

## తాత్పర్యము

పొరల సమూహమును అరటి దుంపగాను, వృక్షముల సమూహము వనముగాను అణువుల సముదాయము భూమి యని, రాళ్ళసమూహము పర్వతమని, బట్టల సమూహము మూటయని గుర్తించిన విధముగానే 25 తత్వములతో కూడుకున్నది ఎరుకయని గుర్తించుము. ఎంత గొప్పగా దీనిని గూర్చి విచారించినా పరిపూర్ణబోధయందు స్థితి లక్షణముచే ఇది లేనిదె అగుచున్నది. ఎరుక నుండి ఏర్పడిన విశ్వము ఎరుక వలెనే లేకపోవుచున్నది. ఉన్న పరిపూర్ణమును వున్నదున్నట్లుగా గుర్తించిన వారికి ఎరుక, దానిపరిణామమగు జగత్తు లేనివే యగుచున్నవి.

## బయలెరుకల అత్యంత విభిన్నతత్వము

బయలు = బహి: ప్రదేశము గుర్తించు తనకు వేరైవున్నది
ఎరుక = అఖండ ఎరుక

ఈ దృష్టితో విచారించిన వారికి తెలివి చేత తెలియబడున దంతయు ఎరుక అను వస్తువుగాను, ఎరుకతో గుర్తింపరాక దానికి వేరైవున్నది పరిపూర్ణముగాను గుర్తించి, ఈరెంటికీ ఒకదానికొకటి సంబంధము ఏమాత్రంలేక అది ఇది, ఇది అది కాక విలక్షణమై వున్నదను సిద్ధాంతము ఈ శీర్షిక ద్వారా చెప్పబడుచున్నది. ఏలననగా అద్వైత సిద్ధాంతమునందు అదినీవైతివి, నీవు అది అయితివి అను అన్వయార్ధముతో సిద్ధాంతము ప్రతిపాదింపబడుచున్నది. అద్వైతము పరిపూర్ణము ఒకటికాదు. జ్ఞానము యొక్క సమగ్ర దర్శత్వం అద్వైతమైతే జ్ఞానమునకు, జ్ఞేయమునకు విషయరూపము కాక విలక్షణమైయున్నది. పరిపూర్ణ సిద్ధాంతము అందుకు అనాదిగా పెక్కు దృష్టాంతములు ప్రతిపాదిస్తూ ఎట్లు వేరై వున్నది ఈ శీర్షికద్వారా చెప్పబడుచున్నది. ఈ సిద్ధాంతము ఆగమ, నిగమ ఉపనిషత్ సాగరమధితార్ధ మవలిది. కనుక ఇందు బోధకు సంబంధించిన సమగ్రమైన వివరణ ప్రతిపాదింప బడుచున్నది.

కం॥ దానము ధర్మమునగుణ। ధ్యానము ప్రతిమార్చనంబు
తజ్జపతీర్థ। స్థానములివిముక్తిదమని। మానవులొనరించ
బయలు మాటాడదేమీ। యెరుకేలేదు। మాటాడెదేమీ।
ఔనూకాదనకానీవనకనేననకొక్క। మేనైనతాగాక మితిమీరీ
యున్నాది। మాటాడదేమీ। యెరుకేలేదు। మాటాడెదేమీ॥ 61

## ప్రతిపదార్థము

దానము = 16 దానములు

గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథ దానము, గజదానము, అశ్వదానము, భాగదానము మహిషదానము

ధర్మము = పుణ్యము, న్యాయము, సామ్యము, స్వభావము, ఆచారము, అహింస, వేదోక్తవిధి ఉపనిషత్ యజ్ఞము

సగుణధ్యానము=విష్ణు, రుద్ర మొదలగు దేవతలకు రూపములు కల్పించుకొని, వాటికి ప్రాణప్రతిష్టలు చేసి మనస్సు ద్వారా అనుభూతము కావించుకొను విధానము

ప్రతిమార్చనము = పైనపేర్కొన్న దేవతా స్వరూప ఛాయా చిత్రాలు, విగ్రహాలు, సాలిగ్రామాలుగా ఏర్పాటు చేసుకుని, వాటిని ధూప దీప నైవేద్యాలతో ఉపచార యుక్తంగా ఆరాధించుట

జపము = "మంత్రాధీనం దైవం" భగవంతుడు అక్షరరూపుడై వున్నాడని, అక్షర సముదాయముద్వారా మంత్రము ఏర్పాటు చేస్కుని, పంచాక్షరి, చతురాక్షరి, షడాక్షరి, దశాక్షరి, ద్వాదశాక్షరి, షోడశాక్షరి, 24 అక్షరములతో కూడుకున్న గాయత్రి మొదలగు మంత్రములు అక్షరలక్షలు జపించి మంత్రాధిష్టాన దేవత అనుగ్రహప్రాప్తిని పొందుట

తీర్థ స్నానములు = తీర్థము - పుణ్యప్రదమైనది తీర్థమనగా ప్రవాహం ప్రవహించు నదియందు ప్రాణశక్తి హెచ్చుగా ఉండును. ఇందు స్నానం చేసినవారికి బాహ్యా భ్యాంతర ఆధ్యాత్మిక, అదిభౌతిక శౌచమేర్పడి శరీరము,

మనస్సు ఆరోగ్యవంతమగును. ఇవే పంచ గంగలు.గంగ, కావేరి, తుంగభద్రా, కృష్ణా నది, గోదావరి చెప్పబడుచున్నవి. వీటితో పాటుగా ఆయా క్షేత్రములందు దేవతా స్వరూపములు ప్రతిష్ఠింపబడి పుణ్యస్నానములతో పాటు దైవదర్శనం ప్రాప్తించును. ఇందు స్నానము, దర్శనము ముఖ్యమైనవి. ఇవి పుణ్యప్రదములని, మోక్షప్రదములని తలచి చేయు కర్మలు

ముక్తిదమని = మోక్షకారకములని

మానవులొనరించ = మనుషులు ఆచరించగా

బయలు మాట్లాడదేమీ? = గుర్తులేదు కనుక మాట్లాడలేదు.

ఔను = అలాగే

కాదు = కాదు

నీవనక, నేననక = నేను, నీవు అను గుర్తించు ద్వంద్వ పద్ధతి లేకుండా

ఒకమేనైన తాగాక = ఎట్టి పరిణామమునకు లోనుగాక

మితిమీరి యున్నది = ఆవరణమును దాటియున్నది

## తాత్పర్యము

జన్మరహిత విధానమునకు ప్రపంచములో మానవులు అనేక కార్యక్రమములు మార్గములుగా నిర్ణయించుకుని పాటించుచున్నారు. అవి దాన ధర్మాలు, దేవతా ధ్యానములు, విగ్రహారాధన, జపతపాలు, తీర్థయాత్రలు మున్నగునవి. ఇట్టి ప్రక్రియలు ఎన్ని పాటించినా పరిపూర్ణము ఏమాత్రము స్పందించుటలేదు. ఏల ననగా స్పందనకు అవసరమగు గుర్తు దానియందు లేదు. గనుక ఎరుకతో సంబంధపడక, తనయందు ఎరుకలేక స్వతఃస్సిద్ధమై, ఔనని, కాదని, నీవని, నేనని అనక స్థూల శరీరముతో సంబంధపడక జగన్నిర్మాణానికి కావలసిన ప్రకృతిని కూడా అతిక్రమించి స్వతఃస్సిద్ధమై వున్నది. కావున ఎరుకచేత, దాని పనుల చేత ఏ మాత్రము గుర్తింప బడక వేరైవున్నదని తెల్సు కొనవలెను.

కం॥ ఆకాశాదికభూతా। నీకాత్మకమగుచుయెరుకయీ జగమయ్యేన్।
రాకడపోకడ దీనికి ప్రాకటముగదేనిలోనో। బట్టాబయలదిరా।
కాదనియంటె। వట్టీపల్కిదిరా। లోకత్రయ ముతనలోపాల
తిరుగాగ। జోకాతోడుతనదాని జోలెరుగ నిదియేదొ। బట్టా
బయలదిరా। కాదనియంటే। వట్టీపల్కిదిరా॥62

## ప్రతిపదార్థము

ఆకాశాదికము కూటస్థుడు (సమీకరణ) భూతానీకాత్మకమగుచు

ఎరుక ఈ జగమయ్యేన్ = అధిష్టాన బ్రహ్మము బ్రహ్మాండ పిండాండములుగా మార్పుచెందెను

" జ " అనగా పుట్టునది " గ" అనగా గతించునది.

రాకడ పోకడ దీనికి = రావడం పోవడం అనగా జనన మరణాలకు లోను కావడం

ప్రాకటముగ దేనిలోనో = స్పష్టముగా దేనియందో

బట్టబయలదిరా= అది పరిపూర్ణ పరబ్రహ్మమురా

కాదని అంటె = ఈ పరిణామక్రమము నిజముకాదనిఅంటె

వట్టిపల్కిదిరా = అసత్యమౌతుంది

లోకత్రయము = స్వర్గము, భూమి, పాతాళము

తనలోపాల తిరుగాగ జోకా తోడుత = తనయందు ఆవిర్భావ, తిరోభావములు అత్యంత వేగంగా చెందుచున్నను

దాని జోలెరుగనిది = దానితో సంబంధపడనిది

ఏదో = ఏవస్తువు స్వత: సిద్ధమైయున్నదో

## తాత్పర్యము

సృష్టి కారణమగు బ్రహ్మము తన సంకల్పముచే బ్రహ్మాండ, పిండాండములుగా మార్పు చెందుచు, తాబేలు తన అవయవములను అవసరానుగుణ్యంగా ఎట్లు సంకోచ, వ్యాకోచములు పొందు చుండునో అట్లే బ్రహ్మాండ పిండాండములుగా మార్పుచెందుచు, ఈపరిణామ క్రమము

స్పష్టముగా దేనియందు జరుగుచున్నదో అట్టిదానిని అచల పరిపూర్ణముగా గ్రహించుము. ఇందు ఎట్టి అనుమానమునకు లోను కాకుము. స్వర్గ, మర్త్య, పాతాళమను లోకములుగా మార్పుకులోనై అత్యంత వేగముతో నిరంతర పరిణామమునకు లోనవుచున్న ఎరుకతో ఎట్టి సంబంధము లేక తనకు తానుగా ఉనికి కల్గియున్న దానిని పరిపూర్ణ పరబ్రహ్మముగా గుర్తించుము.

కం॥ తండోపతండములుగా। దండీఝుషాదికములన్ని తనన
లోపలను। ద్ధండతనుండినపోయిన। నుండుసముద్రం
బుయెరుగా। కుండూ నెప్పటికీ। పరిపూర్ణమి। ట్లుండూనెప్పటికీ।
యండామావులరీతినుండేటీ బ్రహ్మండ। ముండీనపోయీన
రెండూ గుర్తెరుగానిదుండూ నెప్పటికీ పరిపూర్ణమి। ట్లుండూ
నెప్పటికీ॥ 63

## ప్రతిపదార్థము

తండోప తండములుగా = గుంపులు గుంపులుగా
దండి = గొప్పగా
ఝుషాదికములు = జలచరములు, చేపలు మొదలైనవి.
ఉద్దండత = గొప్పగా, విరివిగా
నుండిన పోయిన = పుట్టిన, నశించి పోయిన
ఉండు సముద్రము = ఉనికి గల్గియున్న సముద్రము
ఎరుగకుండు నెప్పటికీ=ఎట్టి పరిస్థితిలోనూ ఈమార్పు గుర్తించకుండా ఉండును.
పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ=పరిపూర్ణము ఈవిధముగా స్వతఃస్సిద్ధమై యుండును.
ఎండామావుల రీతి = తీవ్రమైన ఉష్ణోగ్రతలో ఏర్పడిన ఆవిరిచేకలుగు కెరటముల వలె
ఉండేటి = ఉన్నట్లు కన్పడుచున్న
బ్రహ్మండము = పంచభూతాత్మకమైన ఈ ప్రపంచము
ఉండినపోయిన = కన్పించినా, కన్పించక పోయినా
రెండూ గుర్తెరుగాని దుండు = ఉత్పత్తి, స్థితి, నాశనములతో సంబంధపడనిది

## తాత్పర్యము

ఈ సముద్రము నందు నడయాడు జలచరములు గుంపులు గుంపులుగా ఏర్పడి, ఉత్పత్తి, స్థితి, నాశనములు చెందుచున్నను, వాని ఉనికి తో సముద్రమునకు ఎట్టి సంబంధము లేదో, ఆవిధముగానే స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమునందు ఎరుక యొక్క పరిణామ రూపమైన బ్రహ్మాండ, పిండాండములు ఎండమావులవలె తోచబడును. ఒక దాని కొకటి ఎట్టి సంబంధము లేక యుండును.

కం॥ యెరుకతో వచ్చినవిశ్వము। యెరుకతో జనుగాని
నిల్వదీబయలైతే యెరుకతోరాదెరుకతో బోదెరుకతనందేమి
లేదు। యిదినిశ్చయమురా। వుండుంటెయీ। యెరుకెతానౌరా
యెరుకాయెరిగినవస్తు వెరుకాని తెలియూము। యెరుకా
యెరుగదు బయలు నిట్టి దట్టిదియని। నిదినిశ్చయమురా।
వుండుంటెయీ యెరుకేతానౌరా॥ 63

## ప్రతిపదార్థము

ఎరుకతో వచ్చిన విశ్వము = ఎరుక పరిణామ రూపమగు ప్రపంచము

ఎరుకతో జనుగాని నిల్వదు = ఎరుకతోటే లేకుండా పోవును గాని ఉండదు

ఈ బయలైతే = ఈ పరిపూర్ణపరబ్రహ్మము

ఎరుకతో రాదు, పోదు = తెలివితో రాదు, పోదు

ఎరుక తనయందేమీ లేదు=రాకపోకలెగాక, గుర్తుతనయందు కూడా ఏమిలేక వున్నది.

ఇది నిశ్చయమురా = ఈ అంశాన్ని గట్టిగా దృఢపరచుకో

ఉండుంటె ఈ ఎరుకె తానౌర = ఉన్నట్లైతే ఈ ఎరుకే పరిపూర్ణమౌను

ఎరుకా ఎరిగిన వస్తువెరుకాని తెలియుము = తెలివిచే తెలియబడునంతయు తెలివిగానే గ్రహించుము

ఎరుక ఎరుగదు బయలు నిట్టిదట్టిదియని = ఇటువంటిది, అటువంటిది అని ఎరుక పరిపూర్ణమును గుర్తింపజాలదు.

ఇదినిశ్చయమురా = ఈ విధముగా దృఢపరచుకొనుము

## తాత్పర్యము

అధిష్టానము యొక్క పరిణామమైన జీవేశ్వర జగత్తు దాని పరిణామ క్రమమునకు లోనై వుండును. స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము ఎరుకతో ఏమాత్రము సంబంధపడక, తనయందు ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేక ఉనికి కల్గి యున్నదియని గుర్తించుము. అట్లు కానిచో ఎరుకే పరిపూర్ణమగును. తెలివిచే తెలియబడు నంతయు ఎరుకేనని తెల్సుకొనుము. ఇట్టి ఎరుక చేత పరిపూర్ణమును ఇట్టిది, అట్టిది అనుటకు వీలుకాదు అని స్పష్టముగా గ్రహించుము.

కం॥ రవితమసమున్న దెరుగునె। ప్రవిమలదావాగ్నిచదలు
బట్టుటెరుగునా। దినమునురాతిరిరాత్రిని। దివమెరుగునెలేమి।
లక్ష్మీదేవీయెరుగునా। అన్నమునూ భూదేవియెరుగునా।
భవనాశస్థితులురాపాడేటియెరుకాను। భవనాశస్థితిలేని
బయలట్లెరుగదు। లక్ష్మీదేవీయెరుగునా అన్నమునూభూ।
దేవీయరుగునా॥ 64

## ప్రతిపదార్థము

రవి తమసమన్నదెరుగునె = సూర్యుడు చీకటి యున్నట్లు గుర్తించునా
ప్రవిమల దావాగ్ని చెదలుపట్టుటెరుగునా=తీవ్రమైన జ్వాలలతో కూడిన నిప్పును చెదలు ఆక్రమించునా
దివమును రాత్రి, రాత్రి దివము నెరుగునా=పగలును రాత్రి, రాత్రి పగలును గుర్తించునా
లేమి లక్ష్మీదేవి ఎరుగునా = దరిద్రము లక్ష్మీదేవి ఎరుగదు
అన్నము = జీవాధారమైన అన్నము
భూదేవి ఎరుగునా = వాటికాధారమైన మట్టి గుర్తించునా
భవనాశస్థితులు = పుట్టుక, చావులు
రాపాడేటి ఎరుకను = పొందుచుండు గుర్తును
భవనాశస్థితిలేని = పుట్టుక, చావు లేని
బయలట్లెరుగదు = పరిపూర్ణము ఆవిధంగా గుర్తించదు

## తాత్పర్యము

చీకటి సూర్యుడ్ని ఎన్నడైనా గుర్తించునా? అగ్నికి చెదలు పట్టునా? పగలును రాత్రి, రాత్రిని పగలు గుర్తించునా? బీద తనమును లక్ష్మీదేవి ఎరుగునా? అన్నము యొక్క రుచిని భూదేవి గుర్తించునా? ఆవిధంగానే పుట్టుక, చావులుగల ఎరుక పుట్టు, చావులు లేని పరిపూర్ణమును గుర్తెరుగదు.

**కం॥ లేనికలగలిగినప్పుడు। దానికి దశదిశలయందు తగమొదట**
**కొనన్। తానంటకున్నమేల్కను। లేనికలే చూచెనేని।**
**లేకాపోవుగదా। కలతోమేల్కలేకాపోదుగదా। లేనెరుకబయలు**
**యీలాగనీకెపుడు। గానవచ్చితెబోధగావాలెననవపుడు।**
**లేకాపోవుగదా। కలతో మేల్కలేకా పోదుగదా॥ 66**

## ప్రతిపదార్థము

లేని కల = లేనియొక్క ఎరుక
కల్గినపుడు = ఉత్పత్తి అయినపుడు
దానికి దశ దిశలయందు తగమొదట కొనన్=గుర్తెరిగే తెలివి యొక్క పూర్వాపరముల యందు
అంటకున్న మేల్కను = సంబంధ పడని పరిపూర్ణమును
లేనికలే చూచెనేని = ఉన్నదని గ్రహించి తాను లేనని దృఢపరచుకొంటె
లేక పోవుగదా = లేకుండా పోతుంది, రద్దవుతుంది
కలతోమేల్క లేకా పోవుగదా=ఎరుకతో పాటుగా పరిపూర్ణము లేకుండా పోదు
లేనెరుక బయలు = ఉన్న పరిపూర్ణము, లేని ఎరుక
ఈలాగ నీ కెప్పుడు గానవచ్చితె = పైవిధంగా నీకెప్పుడు దృడమైతే
బోధ కావలె ననవపుడు = మరల తిరిగి బోధించండని అనవలసినపనిలేదు

## తాత్పర్యము

మన: ప్రాణముల సంయోగములో జాగ్రత, స్వప్నము, సుషుప్తి అను అవస్థలు ఏర్పడుచున్నవి. జాగ్రదావస్థయందు మన:ప్రాణముల

కలయిక సంపూర్ణముగా ఉండుటచే గుర్తు వ్యవహారసత్తా కల్గియుండి కొన్నిపనులు నెరవేర్చి, మరికొన్ని సంస్కారరూపంగా అంత:కరణయందు నిల్వయుండును. స్వప్నావస్థయందు మన: ప్రాణములు కలిసి కలియక అస్పష్టంగా గుర్తేర్పడుచుండును. ఇందు వలన అంత:కరణయందు నిలువ వున్న భావనలు మనస్సు గ్రహించి అవి అనుభూతులుగా మార్చుకొను చుండును. ఇదే స్వప్నావస్థ. ఇందు జాగ్రదావస్థలో అనుభవింపగా మిగిలిన వాసనలేగానీ క్రొత్తగా ఏర్పడినవి గావు. ఇవి సముద్రమందలి అలలవలె విజృంభించు చుండును. దీనికి సంబంధించిన మెళకువ కూడా [illegible]యందే కలసి యుండును. మెళకువ రీత్యా కల లేనిదగుచున్నది. ఈ రెండు అనుభూతులు అంత:కరణకే కల్గుచున్నవి. క్రొత్తగా వేరే స్థానంనుండి సరఫరా అగుటలేదు. ఈ విధంగానే ఎరుక స్వత: స్సిద్ధమైన పరిపూర్ణమునందు కలవలె ఏర్పడి గురు ప్రబోధ అను మెళకువచే స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నదని అందుతాను లేనని దృఢ పరచుకొని తాను లేకపోవును. లేక పోవుట అనగా వున్నది అని దృఢపరచుకొనుటయే తానులేకపోవుట. క్రొత్తగా రానూలేదు పోనూలేదు. ఈ విధముగా ఉన్న పరిపూర్ణమును, లేని ఎరుకను దృఢపరచుకొన్న వారికి తరువాత బోధతో పనిలేదని తెలియ వలెను.

కం॥ చచ్చుట పుట్టుట మేలుక। వచ్చుటగాఢాసుషుప్తి వచ్చుటలీనా।
ల్గచ్చముగ సహజమెరుకకు। పొచ్చముయీ యెరుక నిల్వబోదు
మాయప్పా। అచలముకిట్లు లేదుగదప్పా మచ్చికతో
రెంటిమర్మాము నీకిప్పు। డెచ్చాగదెల్పితినెరుగు। మెరుక
నిల్వబోదూమాయప్పా। అచలముకిట్లు। లేదుగదప్పా॥ 67

## ప్రతిపదార్థము

అప్పా = నాయనా
చచ్చుట = మరణావస్థ
పుట్టుట = జన్మించుట
మేలుక వచ్చుట = జాగ్రదావస్థను పొందుట

గాఢాసుషుప్తి వచ్చుట = శుద్ధమైన నిద్రావస్థలోకి వెళ్ళుట
ఈనాలుగు = పైన పేర్కొన్న నాలుగు అవస్థలు
అచ్చముగా = స్పష్టముగా
సహజమెరుకకు = గుర్తెరిగే శరీరానికి స్వభావ సిద్ధముగా నున్నవి
పొచ్చము = ఏ మాత్రము
ఈ ఎరుక నిల్వబోదు = మార్పులకు లోనైన ఇట్టి గుర్తు శాశ్వతముకాదు
అచలము కిట్లు లేదు = ఇట్టి మార్పులు పరిపూర్ణము పొందదు
మచ్చికతో = అనేక దృష్ట ద్రాష్టాంతములతో అనుభవ పూర్వకంగా
రెంటి మర్మము = ఎరుక, పరిపూర్ణముల భిన్నత్వము
నీకిపుడెచ్చుగా తెల్పితి = నీకు స్పష్టముగా విడమరిచి దృఢపరుస్తున్నాను
ఎరుగుము = గుర్తించుము

## తాత్పర్యము

నాయనా! చచ్చుట, పుట్టుట, మెళకువలోకి వచ్చుట, గాఢ నిద్రలోకి వెళ్ళుట అను నాల్గు అవస్థలు ఎరుకకు సహజముగా నున్నవి. అనగా జన్మించుట జాగ్రదావస్థతో మరణించుట సుషుప్త్యావస్థతో పోల్చబడుచున్నది. ఈ రెండు అవస్థలు పరిణామ క్రమమునకు లోనై వున్నవి. కావున మార్పు చెందునది ఏ దియు శాశ్వతము కాదు అనునది సిద్ధాంతము. అచల పరిపూర్ణము ఇట్టి మార్పులకు లోనుగాక స్థిరముగా నున్నది. మార్పు చెందు ఎరుక మార్పు చెందని పరిపూర్ణము నందు మూలము గాని స్థానము గాని లేనిది అని తెలియ వలెను. పైరెంటి యొక్క తేడాను స్పష్టముగా గుర్తించి దృఢ పరచు కొనుటకు వీలుగా పలు దృష్టాంతములుగా బోధించుచున్నాను అని తెలియవలెను.

కం॥ తలయెత్తి జాడ జూలునె। అలచీకటి యెందుటనిల్చి
యబ్జాప్తకళన్। కలవచ్చిమేల్కయందున। గలచేష్టలు
మోలనిల్చి గనుగొనగలదా। అట్లనెయెరుక కనుగొనగలదా।
యిలలో సద్గురు బోధ నెరిగీన నరునిచే। ష్టలు గంటే నుళ్ళక్కి
సద్గురు బోధౌట కనుగొనగలదా అట్లనెయెరుక కనుగొన గలదా॥

68

## ప్రతిపదార్థము

అబ్జాప్తు కళన్ = అబ్జ + ఆప్తుడు + కళన్ సూర్య భగవానుని యొక్క కళలు (కాంతి)

తలెత్తి చూడజాలునె అలచీకటి = దట్టమైన చీకటి సూర్యకాంతిని చూడగల్గుతుందా?

ఎదుటనిల్చి = ఎదురుగుండా, ప్రత్యక్షంగా

కలవచ్చి = స్వప్నావస్థ

మేల్కయందుగల చేష్టలు = మెళకువలో వున్నటువంటి పనులతో పోలిస్తే

మ్రోలనిల్చి కనుగొనగలదా = ఎదురుగా నిలచి అనుభవము గుర్తించ గలదా?

అట్లనే = ఆవిధంగానే

ఎరుక కనుగొనగలదా =గుర్తు తెలుసుకోగల్గుతుందా?

ఇలలో = ఈ భూమండలంలో

సద్గురుబోధ =పరిపూర్ణబోధ

ఎరిగిన నరుని = దృఢ పరచుకొన్న మానవుని

చేష్టలుగంటే = జీవనవిధానాన్ని గమనిస్తే

ఉళ్ళుక్కే = నిజంకాదు

ఎరుక కనుగొన గలదా = అట్టివారిని ఈ గుర్తుతో గుర్తించగలమా?

### తాత్పర్యము

ఓ శిష్యుడా చీకటి సూర్యుని ఎదురుగా నిలబడి ఎట్లు చూడలేదో, మెళకువయందు కల యందలి భావనలు ఎట్లు నిజంకావో ఆప్రకారం పరిపూర్ణబోధ యందు ఆరూఢత చెందిన మహాత్ముని జీవన విధానమందు నేను, నాది అను కర్తృత్వ మమకారములు విడిచిపెట్టి చేయు పనుల యందు జన్మ పరంపరలకు కారణమగు పుణ్య, పాప సంస్కారములు వారికుండవు.

కం॥ ఎరుగదు సుషుప్తిని జాగ్రత నిరవందసుషుప్తి రెంటి నెరుగును
మేల్కు। ట్లరయగ బయలెరుకల రెంట్నెరుగదు బయలెరుక।
రెంటినెరుగుచు నుండూ। గురుముఖమూన। నెరిగియీరెండూ।
తిరమూగ యెరుకాను తీసివేసితెజాలు। పరులూనేనని యేటి
పలుకే లేకుండుని। ట్లెరుగూచునుండూ గురుముఖమూన।
నెరిగీ యీరెండూ॥ 69

## ప్రతిపదార్థము

ఎరుగదు సుషుప్తిని జాగ్రత = సుషుప్తి యొక్క అనుభవం జాగ్రదావస్థ గుర్తించలేదు

ఇరవంద = అలాగే

సుషుప్తి రెంటినెరుగును మేల్కు = సుషుప్తి అనుభవాన్ని, జాగ్రత అనుభవాన్ని రెంటినీ అనుభూతం చేసుకునేది మేల్కు

అట్లరయగ = పైవిధంగా విచారించగా

బయలెరుకల రెంట్నెరుగదు బయలు = ఎరుక పరిపూర్ణములను గూర్చి పరిపూర్ణము గుర్తించదు

ఎరుక రెంటి నెరుగు చునుండు = గుర్తు పై రెంటి అనుభవాలను గుర్తించగలదు.

గురుముఖమున ఎరిగి ఈ రెండు = వస్తు నిశ్చయ పూర్వకముగా ఎరుక పరిపూర్ణములను గుర్తించి

తిరముగా = నిశ్చయముగా, దృఢముగా

ఎరుకను తీసి వేసితెచాలు = పైరెంటిని గుర్తించే తెలివిని తీసివేసితె చాలు

పరులు నేనని యేటిపలుకే లేకుండు = పరిపూర్ణము వున్నది, ఎరుకలేదు అని నిర్ణయించే గుర్తు లేకుండును.

## తాత్పర్యము

సుషుప్తి అవస్థ తనగురించిగాని, జాగ్రదావస్థను గురించిగాని

గుర్తించదు. జాగ్రదావస్థ, సుషుప్తిని, జాగ్రదావస్థని రెంటినీ గుర్తించగల్గును. ఆవిధంగానే పరిపూర్ణము తనను, ఎరుకను గుర్తింపలేదు. ఎరుక రెంటినీ గుర్తించగల్గును. ఈ అంశమును స్వంతంగా తన ప్రయత్నం చేత కాకుండా గురువు ద్వారా వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక అని గుర్తించి, ఏ గుర్తుచే ఈ భావన కల్గించుకున్నామొ ఆగుర్తును కూడా విడచిఉండుము. ఆపై పరిపూర్ణము ఉన్నదనిగాని, ఎరుక లేనిదనిగాని ఏమీలేదని గాని అనుటకు ఏమీ మిగలక స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము శేషించిఉండును.

**కం॥ ఎరుక జడమజడమీ జగ। మరయగ పరిపూర్ణయేమి యనరానిది। యా యెరుక జగముల స్థిరములు। పరి పూర్ణము శాశ్వతముపుదిపాటించికనరా। కావారెండీ పాటీవి వినరా। గురుముఖమున వీట్నేనరుడు గుర్తెరుగునో తిరిగి పుట్టడు వాడీ ధరపై మునుపటివలె। పాటించికనరా। కావారెండీ పాటివి వినరా॥** **70**

## ప్రతిపదార్థము

ఎరుక జడమజడమీజగమరయగ = విచారించగా ఎరుక చైతన్యవంతము, శక్తి వంతము కూడానై జగద్రూపముగా ప్రకాశించుచున్నది

పరిపూర్ణముమేమీ అనరానిది = కేవలత్వము కల్గి పరిపూర్ణము పైవాటితో సంబంధపడనిది

ఎరుక జగములస్థిరములు = గుర్తు, దానిపరిణామ రూపమగు ప్రపంచము మార్పుకు లోనైయున్నవి.

పరిపూర్ణము శాశ్వతపుది = పరిపూర్ణము స్థిరమైనది, త్రికాలాబాధ్యమైనది

రెండీపాటివి = ఎరుక, పరిపూర్ణము అత్యంత విభిన్నమైవున్నవి.

గురు ముఖమున వీటినే నరుడు గుర్తెరుగునో = ఏ వ్యక్తి వస్తు నిశ్చయపూర్వకముగా గురువుద్వారా ఈ భేదమును గుర్తించునో లేక

దృఢపరచుకొనునో

తిరిగి పుట్టడు వాడీ ధరపై మునుపటివలె = ఇది వరకు మాదిరిగా జనన మరణములకు లోనుకాడు.

## తాత్పర్యము

విచారించి చూడగా ఎరుక పరిపూర్ణము అత్యంత విభిన్న రూపమై యున్నవి. జీవేశ్వర జగత్తునందు ఈ ఎరుక చైతన్యవంతము, శక్తి వంతముగాను ద్వంద్వ రూపముగా ప్రకటమగు చున్నది. కేవలము జడముగా గానీ, చైతన్యవంతముగా గానీ కలిగియుండలేదు. నిరంతర పరిణామ శీలనమై మార్పుకు లోనగు చున్నది. ఇట్టి పరిణామ క్రమమునకు లోనుగాక జడ, అజడ పద్ధతులు గాక కేవలత్వము కల్గి వున్నది పరిపూర్ణము. ఈవిధముగా ఎరుక పరిపూర్ణము అను రెండు వస్తువులు ఒకదానితో ఒకటి సంబంధపడక వేరై వున్నవి. గురుముఖత: వస్తు నిశ్చయ పూర్వకముగా ఈ భేదము గమనించి దృఢపరచు కొనునో అట్టి భావన కల్గిన మానవునికి ఈ ధరిత్రిపై జనన మరణ భ్రాంతి రాహిత్యము కల్గి తిరిగి జనన మరణములకు లోనుకాడు.

కం॥ మరుపుకుతన్మాత్రలుగల వెరుకకు తన్మాత్రలున్న వీరెండొకటే।
పరిపూర్ణమునకులేవవి।పరిపూర్ణము యెరుక గాదు। మరుపూ
గాదోయీ। వెతకినదీని। సరిదిలే దోయీ। పరిపూర్ణమెరుకాల
పరిశోధించీ గ్రంధము। రచించినీకిస్తి మరువక చదువెరుక
మరుపుగాదోయీ। వెతికినదీని। సరిదిలేదోయీ॥ 71

## ప్రతిపదార్థము

మరుపుకు తన్మాత్రలు కలవు = మరుపు అనగా బ్రహ్మాండం పృధ్వ్యాది పంచభూతముల యందు శబ్దాది తన్మాత్రలు ఇమిడి వున్నవి.

ఎరుకకు తన్మాత్రలున్నవి = అలాగే అధిష్టానమందు కూడా ఈ తన్మాత్రలు బీజరూపముగా నున్నవి.

ఈ రెండొకటే = ఎరుక, మరుపు ఈ విధంగా ఒకటే

పరిపూర్ణమునకు లేవవి = ఈ రెండు లక్షణములు పరిపూర్ణమునకు లేవు

పరిపూర్ణము ఎరుక గాదు, మరుపుగాదోయి = ఉన్న పరిపూర్ణము ఎరుక మరపులు కాదు

వెతకిన దీనికి సరిది లేదోయి = ఎంత విచారించినా పరిపూర్ణముతో సమానమైన రెండో వస్తువు లేదు

పరిపూర్ణ మెరుకాల పరిశోధించి = ఎరుక, పరిపూర్ణములగురించి స్పష్టమైన అవగాహన కల్గించుకొని

గ్రంథము రచించినీకిస్తి = ఈ కందార్థరచనద్వారా ఆతేడాను గమనించగల్గేలా రచన చేసినీకప్పచెపుతున్నాను

మరువాక చదువు =అశ్రద్ధ చేయక, నిర్లక్ష్యము చేయక గ్రహించు

## తాత్పర్యము

ఎరుక, ఎరుక, మరుపులను రెండు రూపములను కల్గియున్నది. అధిష్టానమందు ఏక తెలివి యై బీజరూపముగా తనయందు సమస్తమును ఇముడ్చుకొని పరిణామ దశలో సంకల్ప బలముచే పంచతన్మాత్రల రూపమై బ్రహ్మాండాకారము చెందినది. అదిష్టానమునందు బీజరూపముగానున్న తెలివి బ్రహ్మాండమందు పంచతన్మాత్రలుగా పరిణామము చెంది పంచీకృతమై పిండాండమందు 25 రీతులుగా వ్యవహరించుచున్నది. ఇదంతయు ఎరుక యొక్క పరిణామ క్రమమె. ఈవిధముగా ఎరుక సగుణ నిర్గుణములు రెండుగాను ప్రకాశించుచున్నది. ఈ రెంటితో సంబంధపడనిది పరిపూర్ణము. దానియందు ఎరుకకు గాని, మరుపుకు గాని మూలము గాని, స్థానముగాని లేదు. పరిపూర్ణముతో సరిసమానమైన వస్తువు వేరొకటి లేదు. పై అంశములన్నియు స్పష్టముగా దృఢపరచుకొనుటకు, తేడాని గమనించుకొనుటకు విశేషమైన కృషి చేసి ఈ గ్రంధమును రచించి నీముందుంచినాను. ఎట్టి సందేహమునకు, అనుమానమునకు చోటియ్యక

అత్యంత శ్రద్ధతో ఈ గ్రంధమును చదివి అందలి భావమును దృఢపరచుకొనుము.

కం॥ సంకల్పాదికగుణముల। సంకులమీయెరుకయందు
సమకూడుండున్। సంకల్పాదికగుణముల సంకుల మచలము
నజూడ। జూడాలేదన్నా। యీరెంటీకియీడుగాదన్నా। కొంకాక
యీరెంట్నిగూర్చి గ్రంధముజేస్తి సంకోచింపక జదువు। శంక
బుట్టదు శంక। జాడలేదన్నా యీరెంటీకి। యీడుగాదన్నా॥72

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా

సంకులము = సమూహము

సంకల్పాదిక గుణములు = సంకల్పము మొదలైన గుణములు

ఈ ఎరుకయందు సమకూడుండున్ = గుర్తెరిగే తెలివియందే కూడి వుంటాయి (నిండుకొని)

అచలమునజాడ = పరిపూర్ణమునందు చూడ, విచారించగా

జాడలేదన్నా = మూలముగాని ఆధారముగాని లేదు

ఈ రెంటికీ ఈడుగాదన్నా = ఈ రెంటికీ సంబంధము లేదు

కొంకాక = సందేహపడక, నిర్భయంగా

ఈరెంట్ని గూర్చి గ్రంధము జేస్తి = ఎరుక, పరిపూర్ణముల తేడాను గుర్తింప చేస్తూ ఈ కందార్థ రచన చేసాను

సంకోచింపక చదువు = ఎట్టి సందేహము లేక దృఢపరచుకో

శంకబుట్టదు = ఎటువంటి సందేహము నిల్వదు

## తాత్పర్యము

గుర్తెరిగే తెలివియందు వాసనామయమైన మనస్సుతోపాటు సమస్త వ్యవహారము నిండియుండును. ఇట్టిదానితో సంబంధపడక పరిపూర్ణము స్వతఃసిద్ధమై వున్నది. కావున ఎరుక పరిపూర్ణములు ఒకదానితో ఒకటి

సంబంధపడక వేరైవున్నవి. నిర్భయంగా ఈ తేడాను నేను గమనించి ఈ కందార్థరచన ద్వారా స్పష్టపరుస్తు భ్రాంతి రహితమునకు మార్గమును బోధించి యున్నాను. కావున ఎట్టి సందేహమునకు లోనుకాక ఈ రచనను చదివి దృఢపరచుకొన్నచో జనన మరణ భ్రాంతి తొలగును.

## బయలాకాశముల ఆరోపిత తాదాత్మ్యము

బయలు అనగా ఖాళీ ప్రదేశము అనిఅర్థము. పంచభూతములలో ఈ లక్షణము కలది ఆకాశ భూతము. వస్తునిశ్చయ పద్ధతి యందు ఆకాశమునకు బయలాంశమని, వర్తులాకారమని, సునీలవర్ణమని, ఆత్మకు శరీరభూతమని శబ్దగుణము కలదని, వ్యాపించి విస్తరించే లక్షణము కలదని, కదలనిదని చెప్పబడుచున్నది.వీటిని దృష్టిలో వుంచుకొని ఇంతవరకు విచారించిన కందార్థము లందు అచల పరిపూర్ణమునకు కూడా ఇందులోని కొన్ని లక్షణాలు అనగా అచలమైయుండుట అంతటా వ్యాపించి ఉండుట అను ప్రముఖ లక్షణము ఆధారముగా తీస్కుని ఆకాశబయలు. అచల పరిపూర్ణ బయలు ఒకటేనని అపోహ పడుటకు అవకాశమున్నది. కాని సూక్ష్మముగా వస్తునిశ్చయ పూర్వకముగా గురుముఖత: విచారించినగాని ఇందలి భేదము గుర్తించ జాలము. అట్టి భేదము ఏవిదముగా గుర్తించుటకు వీలగుచున్నదో ఈ శీర్షిక క్రింద కందార్థములలో వివరంగా పేర్కొన బడుచున్నది. ఈ భేదమును గుర్తించుట ముఖ్యాంశము. ఇది గురు గోప్యమైన రహస్యము.

కం॥ ఎరుకైన భూతపంచక। మెరుకకుచరణములుకటియు
హృదయమ్ముగళమున్। శిరమునునయ్యేనుక్రమమున। ధరణి
మొదల్ జేసియిట్లు। తనయాగుర్తెరుగూ। గగనము బయలం।
చనరాదీ మరుగూ। యెరుగాకకాశామె పరిపూర్ణమనుచు
కొందరుబల్కిరిది విని గురిదప్పి యుండేవు। తనయా
గుర్తెరుగూ। గగనము బయలం చనరాదీమరుగూ॥ 73

## ప్రతిపదార్థము

తనయా = నాయనా

మరుగు = రహస్యము

భూతపంచకము = పంచభూతములు. పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము

ఎరుకకు = ఆత్మకు, గుర్తించే తెలివి

చరణములు = పాదములు

కటియు = గుహ్యము

హృదయము = వక్షఃస్థలము

గళము = కంఠము

శిరము = తల

అయ్యేను క్రమమున = క్రమపద్ధతి (వరస) పరిణామము చెందినవి

ధరణి మొదల్జేసి = పృధ్వితో మొదలైన భూత పంచకములు

గగనము = ఆకాశము

బయలంచనరాదు = పరిపూర్ణముగా గుర్తించరాదు

ఈ మరుగు ఎరుగక = ఈరహస్యమును గుర్తించలేక

కొందరు పల్కిరి = వస్తునిశ్చయ జ్ఞానము లేనివారు చెప్పుచున్నది

ఆకాశమే పరిపూర్ణమనుచు = శబ్దగుణముతో కూడి చోటు ఇచ్చేలక్షణం కల్గివున్న ఆకాశమునే పరిపూర్ణముగా చెప్పుచున్నారు

విని = పైమాటలు గుర్తించి

గురితప్పియుండేవు = నీలక్ష్యమును అనగా వస్తునిశ్చయ జ్ఞానమును మరచి పోవద్దు

## తాత్పర్యము

సృష్టి కారణమైన ఆత్మ (ఎరుక) తన సంకల్ప బలముచే తనయందుగల సృజనాత్మక శక్తితో పరిణామ క్రమమునకు లోనై, అపంచీకృత పంచమహా భూతములు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము అను గుణములు కలిగి, వస్తువులుగా, పంచభూతములుగా

పరిణమించెను, అలంకారికముగా, ఒక వ్యక్తిగా ఎరుక తత్వమును గుర్తించ పూనినపుడు పృధ్వి పాదములు, జలము గుహ్యముగా, అగ్నిహృదయముగా, వాయువు కంఠముగా, ఆకాశము శిరస్సుగా, సూర్య చంద్రులు నేత్రములుగా పేర్కొనబడుచున్నది. పరిణామ క్రమమునకు లోనైన ఇట్టి వస్తువును పరిపూర్ణముగా భావించరాదు. వస్తునిశ్చయ జ్ఞానము ద్వారా ఎరుక, పరిపూర్ణముల భేదమును గురుముఖత: విచారించిన వారికిఈభేదము స్పష్టముకాగలదు. ఇది అత్యంత రహస్యము, గోప్యము. ఇది గుర్తించనివారు ఆత్మకు శరీర భూతముగానుండిన శబ్ద గుణ ఆకాశ తత్వమునే అచల పరిపూర్ణముగా భ్రమపడుచున్నారు. వారి మాటలు విని భ్రమ చెందక వస్తు నిశ్చయ జ్ఞానముద్వారా పైభేదమును గుర్తించి దృఢపరచు కొనుము.

కం॥ ఎరుకబయలందులేమిని। యెరుకనుశూన్యంబటంచు
యెరిగించబడెన్। యెరుగుమిదెఆకసం। బిట్లెరిగితెయెరు
కాకసములు। యేకామౌగదరా ఆకసమూబయలేకమెట్లౌరా।
పరిపూర్ణమిదుగొ కన్పడు శూన్యమనరాదు। యెరి గుండు
మెదిరిస్తె యికనా బైజూచేవు। యేకమౌగదరా ఆకసము బయు।
లేకమెట్లౌరా॥ 74

## ప్రతిపదార్థము

ఎరుక = గుర్తించే తెలివి
బయలందు లేమిని = పరిపూర్ణమునందు లేకపోవుట
శూన్యంబటంచు ఎరిగించబడెన్ = లేనిదని ఉపదేశింప బడుచున్నది
ఎరుగుము = గుర్తించుము
ఇదే ఆకసము = పైలక్షణము కల్గినది ఆకాశము
ఇట్లెరిగితె = ఈవిధముగా ఆకాశ బయలును, అచల బయలును గుర్తిస్తె
ఏకమౌను = ఒకటి అగును
ఎరుకా కాశములు ఏకమౌ గదరా = గుర్తు ఆకాశము ఒకటే అవుతాయి
ఆకాశము బయలు ఏకమెట్లౌరా=ఎరుక, పరిపూర్ణము ఎప్పుడు ఒకటి కావు

పరిపూర్ణము ఇదుగోకన్పడు = గురువాక్యము ద్వారా భేదమును గుర్తించి ఎరుకను విడచిన వారికి పరిపూర్ణము స్వతఃస్సిద్ధమై యున్నది.
శూన్యంబనరాదు = లేనిదనరాదు
ఎరిగుండుము = భేదమును స్పష్టముగా గుర్తించుము.
ఎదిరిస్తె = కాదని అంటె
ఇక నాచేయి చూచేవు=ఇక నాసామర్థ్యమును, నాప్రభావమును చూపించెదను.

## తాత్పర్యము

సిద్ధాంత పద్ధతిచే ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక. కావున ఎరుకను షోడశి వాక్యముచే లేనిది అని చెప్పబడు చున్నది. మూలము లేని గుర్తెరిగే శరీరము అట్టి లేని ఎరుకను ఆకాశ వస్తువుగా గుర్తించి ద్వాదశివాక్యము "ఏతన్మిధ్య శుద్ధవియత్ కించిన్నాస్తి" గా చెప్పబడుచున్నది. ఈ విచారణచే ఎరుకను శబ్దమునకు ఆకాశమే వస్తువుగా చెప్పబడు చున్నది. ఎరుక, ఆకాశము అను రెండు శబ్దములు ఒక దానిని విడచి ఒకటివుండనివి. ఒకటి లేనిచో రెండో దానికి ఉనికి లేదు. శబ్దము వేరు గాని వస్తువు ఒకటే. ఈభేదము గుర్తించినవారికి అచల పరిపూర్ణము, ఎరుక ఒకటి కావని వేరువేరు వస్తువులని దృఢమగును. అనుభవం కొరకు ప్రయత్నించువారికి గురువాక్యము ద్వారా ఈ భేదమును గుర్తించిన వారికి ఆకాశ శబ్దము, బయలు శబ్దము రెండింటి తారతమ్యము గ్రహించి, ఈ రెండింటిలో ఒకదాని కొకటి సంబంధ పడనివని గ్రహించుము.

కం॥ కనపడెడిబయలులోపల। కనుగొనలేదయ్యె యెరుక గావున
శూన్యం। బనవలసెదీన్నెఆకన। మనవలసెనుదీన।
విశ్వమాయ నోయప్పా। యింతకువేరె। మాయయేదప్పా।
కనుకానె యీ విశ్వమును లేనిదనితెస్స। వినజెప్పనాయెను
కనబోకుండని పోని। మాయనోయప్పా యింతకువేరె।
మాయయేదప్పా॥

75

## ప్రతిపదార్థము

అప్పా = నాయనా
కనుపడెడి బయలు లోపల = స్వతస్సిద్ధమైయున్న పరిపూర్ణమునందు
కనుగొన లేదయ్యె ఎరుక = విచారించి చూడగా ఎరుక లేని దగుచున్నది.
కావున శూన్యంబనవలసె = అందుచే దానిని షోడశి వాక్యముచే లేదని అనవలసి వచ్చింది
దీన్నె ఆకసమనవలసెను = ఇట్టి దానినే ఆకాశవస్తువుగా గుర్తించు
దీన విశ్వమాయనో యప్పా = లేనటువంటి ఈ ప్రపంచము ఏర్పడెను.
ఇంతకు వేరె మాయ ఏదప్పా = ఇంతకుమించి మోసగించు వస్తువు వేరే లేదు
కనుకనె = అందుచేతన, ఈవిశ్వమును = ఈ తోచబడే ప్రపంచమును
లేనిదని = నిజముకానిదని
లెస్స వినజెప్ప నాయెనుకనబోకుండని = లేనిదని చాలాస్పష్టముగా దృఢపరచవలసి వచ్చింది. విడిచిపెట్టమని.

## తాత్పర్యము

స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు ఎంత విచారించినా గుర్తెరిగే శరీరమునకు మూలము గాని స్థానము గాని లేదు అని షోడశి వాక్యము ద్వారా చెప్పబడుచున్నది. ఇదియే ఆకాశమను వస్తువు. దీనిచేతనే ప్రపంచము ఉత్పత్తి అయినది. లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా భ్రమింపచేయు మాయ అనే వస్తువు ఇదే. కావున ఇది లేనిదని నిర్దుష్టముగా చెప్పబడుచున్నది. ఉన్నట్లుగా కనపడుటయె కాని వాస్తవముగా ఇది లేనిదని దృఢపరచుకొనుము.

కం॥ ఆవరణమునాకసము। నిరావరణమునచల మనుచు
అనిరిమహాత్ముల్। ఆవరణమిమితిగలిగిన। దావరణములేంది
యమితమని తెలుసుకోరా। యీరెంటిన్నివే। రనికనుక్కోరా
ఆవరణము ననే నిరావరణమునుజూచి। యావరణమెడలీన
నావాలమాట లేదని కనుక్కోరా। యీరెంటిన్ని। వేరనికనుక్కోరా॥76

## ప్రతిపదార్థము

కనుక్కోరా = విడమరచి నిర్దుష్టంగా గుర్తించుము
ఆవరణము ఆకాశము = ఆకాశమను వస్తువు ఆత్మకు శరీర భూతమై యున్నదని తెలియుము
నిరావరణము అచలము = ఆకాశబయలు లేక దానితో సంబంధపడక వున్నది పరిపూర్ణము
అనిరి మహాత్ముల్ = వస్తునిశ్చయ పూర్వకముగా మహాత్ములు నిశ్చయించి వున్నారు.
ఆవరణము మితికలిగినది = ఆకాశము అణువు, మహత్, బ్రహ్మాండములకు లోనైవున్నది.
ఆవరణము లేనిది అమితము = ఇట్టి ఆవరణము లేనిది పరిపూర్ణము
అనితెల్సుకోరా = వేరు వేరుగా వున్నవని గుర్తించుము
వేరని కనుక్కోరా = ఒకదానితో ఒకటి సంబంధపడవని గుర్తించుము.
ఆవరణముననే నిరావరణమును జూచి = వస్తుపద్ధతిచే ఎక్కడెక్కడ అవకాశమున్నదో అచట పరిపూర్ణము వున్నదని గుర్తించుము
ఆవరణమెడలీన ఆవలమాట = ఉన్న పరిపూర్ణమునందు లేనిది ఎరుక అని తెల్సిన మీదట
ఆవలమాట లేదని కనుక్కోరా = ఉన్నది, లేనిది అని గుర్తించుటకు గుర్తు లేనిదని గ్రహించుము

## తాత్పర్యము

పరిపూర్ణ భావము ఆకాశమును గూర్చి నిర్ణయిస్తు అవకాశరూపమైనదని, ఆవరణ బద్ధమై, అణు మధ్యమ, మహత్ ప్రమాణము కలదై వస్తువుల యందు ఇమిడి వుండునని, ఇట్టి ఆకాశముతో సంబంధ పడక వేరై అచలపరిపూర్ణము వున్నదని, అది అంతటా నిండి యున్నదని చాలా స్పష్టముగా, వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచి యున్నారు. ఎందెందు ఆకాశము వ్యాపించి వున్నదో అందందు అచల పరిపూర్ణము వున్నదని దానియందు ఈ ఆవరణ బద్ధమైన ఎరుక లేదని, ఎట్టి నిర్ణయము చేయుటకు గుర్తించే గుర్తే లేనిదని సిద్ధాంతీకరించి యున్నారు.

కం॥ బయలాకాసమనికొందరు। భయపెట్టెదరందువలన
భయపడకుసుమీ। బయలందు శబ్దమున్నను। బయలా
కసమనుచు నమ్మ। బడని నీచాతా। శబ్దములేదీ। భ్రమ
యెందుచాతా। బయలాకాశము గాదు పరిపూర్ణమని నమ్మి।
నయమూగ యెరు కానునమ్మాక విడిచిపో। బడనినీ చాతా।
శబ్దము లేదీ భ్రమయెందు చాతా॥ 77

## ప్రతిపదార్థము

బయలు = పరిపూర్ణము

ఆకాశమని = పంచభూతములలో మొదటిదైన ఆవరణము

కొందరు భయపెట్టెదరు = కొందరు ఒకటేనని బోధించెదరు

అందువలన భయపడకు = దానివలన సందేహ పడకు

బయలందు శబ్దమున్నను = పరిపూర్ణము నందు శబ్దగుణ ఆకాశము కల్గియున్న

బయలా కాశమనుచు నమ్మబడని నీచేత = ఆకాశ బయలు పరిపూర్ణము ఒకటే అని అనుకోవచ్చు

శబ్దము లేదు = ఆకాశవస్తువు లేదు

భ్రమ ఎందుచేత = ఉన్నదను భ్రమకు లోనుకాకు

బయలాకాశము కాదు పరిపూర్ణమని నమ్మి = నీవు దృఢపరచుకొన్న పరిపూర్ణము ఆకాశ బయలు కాదని

నయముగ = స్పష్టంగా

ఎరుకను నమ్మక = ఎరుక నిజమని గుర్తించక

విడిచి పోబడని నీచేత = షోడశి వాక్యముద్వారా విడచి పెట్టుము

## తాత్పర్యము

వస్తు నిశ్చయ పూర్వకముగా సిద్ధాంతమందలి వాస్తవమును, ఎరుక పరిపూర్ణముల భేదమును దృఢపరచిన క్రమముచే దృఢపరచుకొన్న నీవు ఇతరుల మాటలచే అనగా ఆకాశ బయలే పరిపూర్ణమని చెప్పువారి

మాటలచే ఎట్టి భ్రమలకు లోను కాకు. నీవు దృఢపరచుకొన్న పరిపూర్ణము నందు శబ్దగుణము కల్గిన ఆకాశబయలు లేదు. ఆకాశము, పరిపూర్ణము ఒకటి కావు అని నమ్మి గుర్తును విడిచి వుండుము అని భావము.

## సృష్టి విధానము

ఇప్పటి వరకు జరిగిన విచారణ క్రమంలో పరిపూర్ణము, ఎరుక మీమాంసయందు పరిపూర్ణము వున్నది, ఎరుక లేనిది అని స్పష్ట పరచబడినది. ఇట్టి స్థితియందు శిష్యుడు పైఅంశమును దృఢ పరచుకొనే విధానంలో ప్రక్షిప్తముగా తన ఉనికితో సంబంధపడిన ఎరుక యొక్క ఉనికి పరిణామ క్రమములనుగూర్చి స్పష్టపరచుకోగలుగు అవసరం గుర్తించి ఎరుక యందు ఎరుక పరిణామము సత్యమని తనయందు తాను పరిణామ క్రమమునకు లోనై ఉత్పత్తి, స్థితి, నాశనములు చెందు చుండునని పలు దృష్టాంతముల ద్వారా సిద్ధాంత పరుస్తూ బోధయందు ఆరూఢత చెందినవారి విషయంలోకూడా ఈ అంశం వాస్తవమని గుర్తింపచేస్తూ ఈ శీర్షికలో కొన్ని అలౌకిక ఆధ్యాత్మికాంశములు అనుభూతులతో చెప్పబడుచున్నవి.

కం॥ **మేలుకసుషుప్తిలోపల। యేలీలంతనకుదానుయే తెంచునొగు।**
**ర్తాలీలబయులులోపల। వాలాయముతనకుదానే। వచ్చు**
**నోయన్నా। వచ్చి హెచ్చి। చచ్చునోయన్నా। యీలోపలనే**
**బట్టబయలున్నదెరిగితే। యేలోకమున నిల్వజాలదెరుగ కుంటె**
**వచ్చు నోయన్నా। వచ్చి హెచ్చి। చచ్చునోయన్నా॥ 78**

## ప్రతిపదార్థము

అన్నా = నాయనా
మేలుక సుషుప్తి లోపల = నిద్ర నుండి స్ఫృహ (జాగ్రదావస్థ)
ఏలీలన్ = ఏవిధముగా
తనకు తానేతెంచునో = తనంతతట తానుగా ఎట్లు వికసించునో
గుర్తు = గుర్తెరిగే తెలివి, ఆలీల = ఆవిధంగా
బయలు లోపల = పరిపూర్ణము లోపల

వాలాయము = తెంపు లేకుండా, ఎడతెగక
తనకు తానే వచ్చునో యన్నా = తనంతట తానుగానే, ఎవరి ప్రమేయము లేక
వచ్చి = స్వప్నావస్థ హెచ్చి = జాగ్రదావస్థ చచ్చును = సుషుప్త్యావస్థ
ఈ లోపలనే = ఈ మధ్యకాలంలోనే
బట్ట బయలున్నదెరిగితె = స్వత: స్సిద్ధమైన పరిపూర్ణమున్నదని దృఢపరచుకొంటె
ఏ లోకమున నిల్వజాలదు = ఏ స్థానమందు మూలము గాని, ఆధారముగాని లేకుండా పోవును.

## తాత్పర్యము

సుషుప్తి నుండి మెళకువ తనంతట తానుగా ఎట్లు వచ్చి, హెచ్చి లేకుండా పోవునో ఆ విధంగానే స్వత: స్సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే తెలివి తెంపు లేకుండా తనంతట తానుగా ఆవిర్భావ తిరోభావములు చెందు చుండును. అనగా సుషుప్తి నుండి జాగ్రత జాగ్రత నుండి సుషుప్తి ఈ రెంటి మధ్యలో స్వప్నము ఏ విధముగా చక్రాకృతిలో మన: ప్రాణముల కూడికచే వచ్చిపోవుచుండునో, ఆవిధముగానే పరిపూర్ణములో ఎరుక పరిణామము కల్గు చున్నది. ఈ అంశము గురు ముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించినవారు మన: ప్రాణముల సంయోగంతో ఏర్పడిన గుర్తు ఎట్లు ఉత్పత్తి, స్థితి నాశనములు చెందుచున్నది గ్రహించి ఇది నిజము కానిదని, కలవంటిదని దృఢ పరచుకొందురు. ఇట్టి ఆరూఢతచే వారు తిరిగి జనన మరణ రూప చక్ర భ్రమణమునకు లోను కారని, ఇట్టి ఆరూఢత చెందనివారు అట్టి భ్రమణమునకు లోనై జనన మరణములు పొందుదురని తెలియవలెను.

కం॥వినుమూర్ధ్న నాభితా। బుట్టినమీదట। సృజనజేయుదినము
హరించున్। ఘనమగుపటశతకోట్లను। తనలోపలి దారము నను
తానట్టేచనునూ। అట్లనెయెరుక। తాబుట్టికనునూ పని బూని
బ్రహ్మాండ భాండనంతములాను। క్షణములోపలద్రుంచి।
కనరాకవేవేగ। తానట్టేచనునూ అట్లనెయెరుక తాబుట్టికనునూ॥79

## ప్రతిపదార్థము

ఊర్ణనాభి = ఊర్ణము అనగా చొంగ లేక చొల్లు అను జిగురు పదార్థము నాభియందు కల్గి దాని ద్వారా గూడును అల్లుకొను శక్తి గల పట్టుపురుగు లేక సాలిపురుగు.

తాపుట్టిన మీదట = తానుజన్మించిన నాటినుండియు

సృజనచేయు = తనయందు గల చొంగ ద్వారా సన్నని దారమును తయారు చేయును

దినము హరించున్ = వెంటనే రద్దు పరచుకొనును

ఘనమగు పటశతకోట్లను = గొప్పదైన అనేకానేక దారపు పోగులను

తనలోపలి దారమునను = తనలోపల ఏర్పాటు చేసుకున్న దారపు పొరలతో

తానట్టే చనునూ = ఆ దారపు పోగులతో పాటూ తానూ నశించి పోవును.

అట్లనే ఎరుక = ఆ విధంగా, గుర్తెరిగే జ్ఞానము

తాబుట్టి = నిస్సంకల్పస్థితిలో నున్న తాను సంకల్ప రూపమై

కనునూ = వీక్షించును.

పనిబూని = తనయందున్న శక్తి సామర్థ్యాలతో

బ్రహ్మాండ భాండనంతములను = సమస్త జీవేశ్వర జగత్ సృష్టిని

క్షణము లోపల త్రుంచి = ఒక్కక్షణ కాలంలో రద్దుపరచుకొని

కానరాక = కన్పించకుండా

వేవేగచనును = వెంట వెంటనే రద్దయిపోతుంది

## తాత్పర్యము

పట్టుపురుగు తనయందు గల చొంగ అను ద్రవపదార్థముతో సన్నటి దారము నోటిద్వారా తయారు చేసి, ఒక గూటిని ఏర్పాటు చేస్కుని, తానందు నివసిస్తూ, ఆగూటిని బలోపేతము చేసి ఒక కాయగా తయారుచేయును. దానినే మనము పట్టు కాయ అని పిలుస్తాము. తను అల్లుకున్న దారముచే తనగూటియందే తాను బంధింపబడి నిద్రించి ఒక దశలో మెళకువరాగా తాను బంధింపబడిన విషయము గ్రహించి, తన నోటియందు గల పళ్ళతో

తన ఉనికికి అవరోధముగానున్న దారమును పళ్ళతో కొరికి రంధ్రమేర్పాటు చేసుకుని పైకి ఎగిరిపోవును. ఇచట తన ఆవరణమునందే తానే బంధింపబడి పైకి ఎగిరిపోవుటలో తానే రంధ్రము ఏర్పాటు చేస్కుని వెళు ్ళచున్నది. ఇట్లు గాక కొందరు ఈ ఉదాహరణను సాలెగూడుతో పోలుస్తారు. ఈ విధంగానే సృష్టికి పూర్వము తాను తానై వున్న అధిష్టాన బ్రహ్మము తనయందలి సృజనాత్మక శక్తిచే అనేకమగు దునుగాక అను సంకల్పముతో అవ్యక్తమై, మహత్, మహదహంకార, పంచతన్మాత్ర, పంచమహాభూతములుగా బ్రహ్మాండ పరిణామము దానినుండి పిండాండ పరిణామము చెంది వాటియందు మనఃప్రాణ రూపమైన జీవరూపముగా తిరిగి ప్రవేశించి 84 లక్షల జీవరాశులుగా పరిణామము చెందును. తన జన్మసుకృతముచే పరిపూర్ణ గురువు నాశ్రయించి క్రమపద్ధతిలో ఈ పరిణామ క్రమాన్నంతా గుర్తించి ఉన్న పరిపూర్ణమునందు తాను లేనని ధృఢపరచుకొని లేకుండా పోవును.

కం॥ వినుమితరులు యెరుకను। సాక్ష్యనిపల్కిరినేను సాక్షిన
హమనినీతో। వినజెప్పితినింతియెవే। రనకూడదురెంటి నొక్కటి।
నితెలుసుకోరా। మాటలభేద। మనికనుక్కోరా। అనరా
నివినరానికనరాని బయలందు। తనకైతానరుదెంచితనకై
తాజనునీ। సాక్ష్యని తెలుసుకోరా। మాటాల భేద। మనిక నుక్కోరా॥
80

## ప్రతిపదార్థము

సాక్షి = జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అను అవస్థా త్రయములకు ఆధారమైయున్న ప్రత్యగాత్మ ప్రకాశము

అహము = మనఃప్రాణముల సంయోగములో ఏర్పడిన నేననే గుర్తు

వినుమితరులు = వినుము = గ్రహించుము ఇతరులు = మతవాదులు

ఎరుకను = గుర్తును (సృష్టికి కారణమైన బ్రహ్మమును)

నేనీతో వినచెప్పితి = రెండూ ఒకటేనని నీవు గ్రహించ వలసినదిగా నేను

చెప్పియున్నాను.

వేరనకూడదు = విడి విడిగావున్నవని చెప్పకూడదు

రెంటినిఒక్కటని తెల్సుకో = రెండూ ఒకటేనని గుర్తించు

మాటలభేదమని కనుక్కో = శబ్ద భేదమే గాని వస్తు భేదంలేదు

అనరాని, వినరాని, కనరాని బయలందు = మనోవాక్కుల కందని కేవలత్వం గల్గిన పరిపూర్ణము నందు

తనకై తానరుదెంచి తనకై తాజనును = తనంతట తానుగానే తోచి తనంతట తానే లేక పోవును.

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు జగదధిష్టానమైన ఆత్మను (ఎరుకను) సాక్షి అని పేర్కొను చున్నారు. కాని పరిపూర్ణ బోధ రీత్యా వస్తునిశ్చయముగా విచారించినవారికి నేననుగుర్తు, ఈ సాక్షి శబ్ద భేదములే కాని వస్తు భేదము లేదని, రెండు వస్తువులు ఒకదానిని గూర్చినవే అని గుర్తించుము. మనో వాక్కుల కందని కేవలత్వం కల్గిన పరిపూర్ణము నందు తనకు తానే స్వకారణంగా ఆవిర్భావ తిరోభావములు చెందుచు చివరకు పరిపూర్ణబోధచే లేనిది అని దృఢపరచుకో గల్గు వస్తువు గూడా ఇదేనని తెలుసుకొనుము.

కం॥ చులకన యుక్తిగ, నొక్కటి। తెలిపెదవిను సంది యంబు దీరునుదీనన్। పలుకున గలిగినయర్థము। పలుకును విడ నాడి నిల్వబడుచోటింకేది। రెండుగ। నొక్కపలుకే అయినాది। తెలియు మీలాగూన తెలివిదేహ ములయ్యె తెలివె తనువును బాసితెలివేస్థిరముగనిల్వ బడుచోటింకేదీ। రెండుగ నొక్కప లుకే అయినాది॥

81

## ప్రతిపదార్థము

చులకన = సులభముగా, తేలికగా

యుక్తిగ = ఉదాహరణ

పలుకున కలిగిన అర్థము = మాటతో ఏర్పడిన వస్తువు

పలుకును విడనాడి నిల్వబడు చోటింకేదీ = ఆశబ్దమును విడిచి వేరొకచోట వుండుటకు వీలు లేనిది

రెండుగ ఒక్క పలుకే అయినది = ఒకే వస్తువు రెంటి చేసూచింపబడు చున్నది

తెలిపెద విను సందియంబు దీరును దీనన్ = నీ మనస్సులో సందేహము దీరును

ఒక్కటి పలికెద = వేరొకటి చెపుతాను

దీనన్ = ఈ ఉదాహరణ విన్నమీదట

తెలియుము ఈలాగున = ఈ విధంగా పై భావాన్ని గ్రహించు

తెలివి దేహములయ్యే = నేను, మేనులు (జీవ జగత్తులు)

తెలివె తనువునుబాసి = ఈ రెంటిలో ఒకదాని నొకటి విడచి

తెలివే స్థిరముగ నిల్వబడదు = ఒకదాని నొకటి విడచి వుండవు

## తాత్పర్యము

ఒక యుక్తి ద్వారా స్పష్టముగా అవగాహన కల్గించు కొనుటకు పై ఎరుకను గూర్చి వివరించుటలో శబ్దము దాని అర్థము లేక వస్తువు ఒక్కటి గానే వున్నను వ్యక్త పరచుటలో రెండు శబ్దము లున్నట్లుగా, ఎరుక దాని పరిణామమగు ప్రపంచము రెండు శబ్దములుగా చెప్పబడు చున్నను, వస్తు నిర్ణయము నందు ఒకటి గానే గుర్తించవలెను. ఇవి ఒక దాని నొకటి విడిచి పెట్టని లక్షణము కల్గియుండి, రెండు శబ్దములచే రెండు వస్తువులు వున్నట్లు అపోహ పడుటే గాని ఏకైక ద్వంద్వం కల్గి వున్నవి అని గ్రహించుము.

కం॥ ఎరుకైన భూతములనీ వెరుగుము ఆకసముగాడ్పు
యింగలమును నీళ్ళిరవందనేలయనినే నెరిగిన పద్ధతిని నీకు
నెరిగించి నానూ ముజ్జగమూలమయ్యేను వీట్లతోనూ పరి
పూర్ణమందు కన్పడుచు తమకుదావె మరికానరావిట్టి
మార్గాముకల వీటి నెరిగించినానూ ముజ్జగమూలయ్యేను
వీట్లతోనూ॥ 82

## ప్రతిపదార్థము

ఎరుక = అధిష్టాన రూపమైన ఆత్మ
భూతములు = పృధ్వాది పంచభూతములు
నీ వెరుగుము = నీవు గుర్తించుము
ఆకాశము, గాడ్పు, ఇంగలము, నీళ్ళు ఇరవందనేల = ఆకాశము, వాయువు, అగ్ని, జలము పృధ్వి మున్నగున్నవి
నే నెరిగిన పద్ధతి నీకెరిగించినాను = సాంప్రదాయ పద్ధతిగా గురూపదిష్ట మార్గమందున్న వస్తు నిశ్చయ పద్ధతిగా నేను గుర్తించి నీకు దృఢపరుస్తున్నాను.
ముజ్జగములయ్యేను వీట్లతోను = ఈ సమస్త బ్రహ్మాండ పిండాండములుగా ఇవే మార్పు చెందినవి
పరిపూర్ణమందు కన్పడుచు తమకు తామే మరి కానరావు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము నందు మూలము గాని ఆధారము గాని లేకనే తమకు తాముగా తోచుచున్నవి.
ఇట్టి మార్గము కల = ఇవి రావడం, పోవడం, ఉండడం సిద్ధాంతరీత్యా లేనివి

## తాత్పర్యము

పరిణామ క్రమంలో ఆత్మ (ఎరుక) పృధ్వ్యాది పంచభూతములుగా పరిణమించి, పిండ బ్రహ్మాండములు సమస్తముగా తానే పరిణామం చెందినట్లు, సాంప్రదాయ పద్ధతియందలి వస్తునిశ్చయ జ్ఞానముద్వారా నేను విన్న ప్రబోధను మరలా నీకు ధృఢపరచుచున్నాను. స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు మూలము గాని, ఆధారముగాని లేకనే తోచబడుచు తమకు తామే లేకపోవు లక్షణం కల్గిన ఈ మార్గము కలవంటిదని గుర్తించుము.

కం॥ ఎరుకోత్పత్తినిదెలియగ। సరసిజగర్భాదులైన చాలర నెటిచో।
నరుడెంతవాడువాడది। యెరుగుదుననవట్టి మాట। లివి
వింతగాకా। తప్పదువాని। కికరాకపోకా అరమరలేక సద్గురు
మూర్తి చరణా। పంకేరుహద్వయార్చననెరుగాని నరుమాట।
లివివింతగాకా। తప్పదువాని। కికరాకపోకా॥ 83

## ప్రతిపదార్థము

ఎరుకోత్పత్తిని తెలియగ = సృష్టి కారణమైన వస్తువు యొక్క ఉత్పత్తిని గూర్చిన వివరణ

సరసిజ గర్భాదులైన = సరసిజ = పద్మము నాభియందు గలవాడు, విష్ణుమూర్తి బొడ్డునుండి పుట్టినవాడు

చాలరనెటిచో = సరితూగరు

నరుడెంతవాడు = నారము (ప్రాణము) హెచ్చుగా కల్గిశక్తివంతుడు

వాడది ఎరుగుదుననిన = ఒక పక్షంలో గుర్తించుటకు వీలున్నది అనుట

వట్టిమాట = నిజంకానిది

ఇది వింతగాక = ఈ అంశము ఒక విచిత్రమైనది

తప్పదు వానికిక రాక పోక = ఇట్టి భావన గలవారికి జనన మరణ పరంపర తప్పదు.

అరమరలేక = ఎట్టి సందేహానికి చోటివ్వకుండా

సద్గురుమూర్తి చరణ పంకేరుహద్వయార్చన నెరుగని = గురుమూర్తియొక్క దివ్యశ్రీ చరణములాశ్రయించి ఉపదేశక్రమముచే వారి అనుగ్రహమునకు పాత్రులు కానివారు

## తాత్పర్యము

ప్రపంచంలో సృష్టికి కారణమగు బ్రహ్మమును గూర్చి దాని ఉత్పత్తి, స్థితి, లయములు వివరించుటలో బ్రహ్మాది దేవతలు కూడా దానిమూలమును ఆధారమును ఎరుగని వారు. వారికి సాధ్యము కాని అంశము మానవ మాత్రులమైన మనము తెలుసు కొనుట పొసగదు అని ప్రచారములో వున్నది. సాంప్రదాయ పద్ధతి యందుగల ఉపదేశ క్రమంలో గురూప దిష్ట మార్గమందు కృషి చేయుచు, గురు కృపకు పాత్రులైనవారికి సమగ్రమైన అవగాహనతో అన్నివిషయములయందు ఆరూఢత పొందగలరు. అట్టి విధానము పాటించక స్వంత వూహాపోహలతో నున్నవారికి జనన మరణములు తప్పవు అని తెలియ వలెను.

కం॥ లేనెరుక బయలు లోపల। తానెట్లు జనించెననినతగవిను
వంధ్యా। సూనునిగతి వియదబ్జవి। ధానంబున యక్షరాజ। ధానీ
విధమునన్। రజ్జువుసర్పమైనా విధమునన్। స్థాణు పురుషుని
చందానమృగజల। శశవిషాణము స్వప్నానంద ముగ। రాజధానీ
విధమునన్। రజ్జువుసర్ప। మైనావిధమునన్॥ 84

## ప్రతిపదార్థము

లేనెరుక బయలు లోపల = గుర్తించే తెలివి పరిపూర్ణము నందు

తానెట్లు జనించెననిన = తానుత్పత్తి పొందిన క్రమంబెట్టిదనిన

తగవిను = స్పష్టముగా గుర్తించుము

వంధ్యాసూనునిగతి = గొడ్రాలి సంతానమువలె

వియదబ్జ విధానంబున = వియత్ = ఆకాశము అబ్జము = పువ్వు ఆకాశపుష్పమువలె

యక్షరాజధాని విధమునన్ = గంధర్వుల పట్టణము వలె

రజ్జు సర్పమైన విధమునన్ = తాడు పామువలె

స్థాణు పురుషుని చందాన = మొద్దు దొంగవలె

మృగజలము = ఎండమావుల యందలి జలము

శశవిషాణము = కుందేటి కొమ్ము

స్వప్నానందము = కలలోపొందు ఆనందము

## తాత్పర్యము

పరిపూర్ణము నందు లేక తోచుచున్న ఎరుక యొక్క ఉత్పత్తిని, ఉనికిని చెప్పుచు గొడ్రాలు బిడ్డ, ఆకాశ పుష్పము, యక్ష రాజధాని, రజ్జు సర్పము, మొద్దు దొంగ, ఎండ మావులలోని జలము, కుందేటి కొమ్ము, మానవుని స్వప్నానందము ఎట్లు వాస్తవము కాకపోయినా తెలియుచున్నవో ఈ పరిణామ క్రమము కూడా అటువంటిదే అని గ్రహించుము.

కం॥ లేనెరుకను యెరుకనియన। లేనెరు కెట్లా। యననినలెస్స
గవినుమా। లేని మృగజలము వంధ్యాసూనులు గలిగుండి
వెదకి చూడాలేనట్లూ। యీ లేనెరుక। యూడాలేదిట్లూ స్థాణు
పురుషూడు శశవిషాణము। గగన సూనామునరునీ
స్వప్నానందమివి వెదకి। చూడాలేనట్లూ। యీ లేనెరుక।
యూడాలేదిట్లూ॥ 85

## ప్రతిపదార్థము

లేనెరుకను ఎరుకనియన = లేనిగుర్తును ఉన్నదిగా చెప్పుటకు

లేనెరుకెట్లాయనిన = లేనిదిగా చెప్పుటకు కారణమేమనగా

లెస్సగ వినుమా = స్పష్టముగా గుర్తించుము

లేని మృగజలము = ఎండమావులయందు జలము ఉన్నట్లు కన్పడినా అది లేనిది

వంధ్యాసూనులు = లేనటువంటి గొడ్రాలి సంతానము

గలిగుండి వెదకి చూడాలేనట్లు = ఉన్నట్లు మాటలలో కనపడుచున్నా వెదకి చూచిన లేనివే

యీలేనెరుక యూడా లేదిట్లు = లేక తోచుచున్న ఎరుక ఎక్కడా లేదు

స్థాణుపురుషుడు = మొద్దు దొంగ

శశవిషాణము = కుందేటి కొమ్ము

గగనసూనము = గగనము = ఆకాశము సూనము = పుష్పము ఆకాశపుష్పము

స్వప్నానందము = కలలో పొందు ఆనందము

## తాత్పర్యము

స్వతః సిద్ధమైన పరిపూర్ణము నందు లేక తోచిన ఎరుకను లేని ఎరుక అని ఈ కందార్థమందు పేర్కొనబడింది. ఉన్నఎరుకను లేనిదిగా గుర్తించుటకు పలు ఉదాహరణలు పై కందార్థమునందు చెప్పబడి యున్నవి. అందు ఎండమావులు, గొడ్రాలి సంతానము, కొయ్య దొంగ,

కుందేటి కొమ్ము, ఆకాశ పుష్పము, మానవుని స్వప్నానందము మొదలైనివి. వీటిని వస్తునిశ్చయ పూర్వకముగా విచారించినవారికి ఇవి కేవలం శబ్దములే తప్ప వస్తువులుగా ఎక్కడా వున్నవి కావు. ఈ నిర్ణయము నందు లేనిది ఉన్నట్లుగా తోచబడుటయె కాని నిజము కాదు అను భావన దృఢపరచుకోవలసి వున్నది.

కం॥ ఎరుకోద్భవ మెట్లన్నను। సరళంబగు నారికేళ సలిలము భంగిన్। యెరుకెట్లుబోవునన్నను। కరిమ్రింగినవెలగపండు। కరణిగ నెరుగూ। తిరిగిరానికరణింకోటెరుగూ పరిపూర్ణము న్నాది। యెరుకా తానెరిగితే యెరుకెమ్రగ్గును। భస్మాసురుడు మ్రగ్గిననాటి। కరణిగ నెరుగూతిరిగిరాని। కరణిం కోటెరుగూ॥86

## ప్రతిపదార్థము

ఎరుకోద్భవమెట్లన్నను = ఎరుకయొక్క ఉత్పత్తి క్రమము ఏవిధముగా అన్నచో

సరళముగా = స్పష్టముగా

నారికేళ సలిలము = కొబ్బరినీరు

భంగిన్ = విధముగా

ఎరుకెట్లు బోవునన్నను = ఎరుక లేక పోవడము ఏ విధముగా అన్నచో

కరి మ్రింగిన వెలగపండు = ఏనుగు తిన్నటు వంటి వెలగపండు గుజ్జు

కరణిగ నెరుగు = ఆ విధముగ గుర్తించు

తిరిగి రాని కరణింకోటెరుగు = మరల తిరిగి ఉత్పత్తికి రాకుండా పోవు విధానము గుర్తించు

పరిపూర్ణమున్నాది = వున్నది పరిపూర్ణమే నని తానులేనని

ఎరుకా తానెరిగితే = గుర్తెరిగే తెలివి గుర్తిస్తే

ఎరుకే మ్రగ్గును = గుర్తు నశించును

భస్మాసురుడు మ్రగ్గిననాటి = భస్మాసురుడను రాక్షసుడు నశించిన విధంగా

## తాత్పర్యము

ఈ కందార్థమునందు ఎరుక యొక్క ఉత్పత్తి, స్థితి, నాశనములు స్పష్టముగా అనుభవపూర్వకమైన దృష్టాంతముల ద్వారా చెప్ప బడుచున్నవి. 1. ఉత్పత్తి క్రమంలో కొబ్బరి కాయలో నీరు మరల విత్తనంగా మారుటకు నీరే ఎట్లు ప్రాధాన్యత కల్గి వున్నదో ఆ విధంగా ఎరుకకు ఎరుకే ఉ త్పత్తికి కారణము 2. ఎరుక నశించు విధానము నందు ఏనుగు తిన్న వెలగ పండు క్రమంలో ఏనుగు యందున్న జఠరాగ్ని ప్రభావముచే పండు నందు గుజ్జు ఆవిరి రూపమై డొల్ల లద్ది రూపములో విసర్జించును. గుజ్జు సప్త ధాతువులుగా మార్పు చెంది మరల పిండోత్పత్తికి కారణమగుచున్నది. ఇందు తిరిగివచ్చు మార్గము సూచింప బడుచున్నది. 3. నశించు విధానము పట్ల భస్మాసురుడు, వారి వర ప్రభావము ప్రముఖముగా చెప్పబడుచున్నది. ఏల ననగా తన వర ప్రభావముచే ఇతరులు నశించు విధానము ఏ విధంగా కల్గుచున్నదో ఆ వర ప్రభావమే తన అంతమునకు కూడా కారణమైనది. ఈ విధంగానె అన్నింటికీ మూలమైన గుర్తు తనమూలమును, ఆధారమును విచారించుటలో తనకు తానే మూలమని, ఆధారమనీ, ఉ న్నపరిపూర్ణమునందు తాను లేనని దృఢ పరచుకొనుటచే తనకు తానే లేక పోవునని ఈ విధంగా తిరిగిరాని క్రమము సూచింప బడినది.

కం॥ సంతోషాసంతోషము। లంతలొగనవచ్చి పిదపనరుగు
నెచటికోవింతై యున్నడిచూచితె। యింతయె సుమియెరుక
పుట్టువికదెల్సుకోరా। సంశయమేల। యిదినమ్ముకోరా। యెంతాని
దెలుపూదు ఘా దేవమార్గామం। దంతాటబహు వన్నెలగు
పడియుగు పడ। వికదెల్సుకోరా। సంశయమేల। యిది
నమ్ముకోరా। 87

## ప్రతిపదార్థము

సంతోషా సంతోషములు = సంతోషము + అ సంతోషము సుఖదు:ఖములు
అంతలో గనవచ్చి = స్వల్ప వ్యవధిలోనే తోచబడి

పిదప = తర్వాత
అరుగు నెచటికో = నశించి ఏమైపోతాయో తెలియదు
వింతైవున్నది = విచారించినవారికి ఈ సంఘటన విచిత్రముగా నుండును
ఇంతియే సుమీ ఎరుక పుట్టు = ఎరుక ఉత్పత్తి కూడా ఈ విధముగానే వుండును.
ఇక తెల్సుకోరా = ఈ విధంగా గ్రహించు
సంశయమేలా = ఎట్టి సందేహము పడవద్దు
ఇది నమ్ముకోరా = నే చెప్పిన క్రమము పాటించుము
ఎంతాని తెలుపుదు = ఎంతగా విడమరచి చెప్పినా
ఈ దేవమార్గమందు = ఈ పరిపూర్ణ భావమునందు
బహు వన్నెలగుపడి అగు పడవు = చిత్ర విచిత్రములుగా తోచి లేకపోవు చున్నవి.

## తాత్పర్యము

అంత:కరణ ధర్మములైన సుఖ దు:ఖములు ఒకదాని వెంబడి ఒకటి కల్గుచు ఎట్లు నశించి పోవు చున్నవో, కానరాక ఎచ్చటి కేగుచున్నవో విచారించిన వారికి ఆశ్చర్యముగా నుండును. ఈ విధంగానే ఎరుక యొక్క ఉత్పత్తి విధానము తెల్సుకొనుము. దాని కదే మూలము. దానికదే ఆధారముగా ఇతరముతో సంబంధము లేక ఎట్లు కల్గుచున్నదో ఆ విధముగానే పరిపూర్ణము నందు ఈ లేనెరుక అనేక చిత్ర విచిత్రములుగా మార్పు చెంది లేక పోవుచున్నది. ఇంతకంటే దీనిగూర్చి వివరణ సాధ్యము కాదు. దీనిని శ్రద్ధగా గమనించుము.

కం॥ తొలికారు మెరుపుకైవడి। పొలుపుగనీళ్ళందుదోచు బుగ్గలరీతిన్
అలసూర్యకిరణమందున। గలనీళ్ళంబలెనె యెరుక। గనిపించునయ్యా। అంతలొయెచట। గనిపించ దయ్యా। కలకాల
మొకరీతి గలిగుండదీయెరుక। తిలకింప పగలు రాతిరి దిరుగు
విధమూన గనిపించునయ్యా। అంతలో యెచట। గనిపించదయ్యా॥ 88

## ప్రతిపదార్థము

తొలికారు మెరుపుకైవడి = తొలకరి యందు వచ్చు మెరుపువలె
పొలుపుగ నీళ్ళందు తోచుబుగ్గల రీతిన్ = స్పష్టముగా నీటి బుడగ వలె
అలసూర్య కిరణమందు గల నీళ్ళంబలెన్ = సూర్య కిరణమునందు తోచు ఎండమావుల వలె
ఎరుక కన్పించునయ్యా = ఈ గుర్తు తెలియ బడుచున్నది.
అంతలో ఎచట కన్పించదు = మరుక్షణంలోనే కన్పడకుండా పోతుంది
కలకాల మొకరీతికలిగుండదీ ఎరుక = ఏ మార్పు లేకుండా స్థిరముగా ఉండదీ గుర్తు
తిలకింప = విచారించగా
పగలు రాతిరి తిరుగు విధమున = రాత్రింబవళ్ళు తోచినట్లుగా
కన్పించునయ్యా = తోచబడుచున్నది.

## తాత్పర్యము

తొలకరియందు మెరుపు వలె, నీటి బుగ్గ వలె, సూర్య కాంతి యందు తోచు యండమావి వలె, ఎరుక మార్పులకు లోనై వుండును. స్థిరముగా ఉండు లక్షణము దీనియందు లేదు. పగలు రాత్రి ఒకదాని వెంబడి ఒకటి ఎట్లు కల్గు చున్నవో అవిధంగానే ఎరుక పరిణామము కూడా కల్గు చున్నది.

## ప్రతిపదార్థము

కం॥ కట్టెందునిప్పులేకనే। కట్టియనొక సమయమందు గనుపడి
బహుగా। మిట్టిపడితుదకుగనపడ। దట్టిదెసుమి యెరుకపుట్టు।
వమల విచారా। తనకుండానె। యరుదెంచెనొరా।
పుట్టుగిట్టుటలానెనట్టేట నిలచుండి। బట్టాబయలునుపాడ।
గట్టినగనుపాడ దమలా విచారా। తనకుండానె। యరు
దెంచెనొరా॥ 89

అమల విచారా = శ్రేష్టమైన విచారణ కల్గి యున్నవాడా
కట్టెందు నిప్పులేకనే = కట్టెయందు నిప్పు కన్పించదు
కట్టియ నొకసమయమందు కన్పడి = ఒకదాని నొకటి మధించినపుడు కన్పడి
బహుగా మిట్టిపడి = బాగా విజృంభించి
తుదకు కనపడదు = చివరకు కన్పించదు
అట్టిదె సుమీ ఎరుక పుట్టువు = ఈ క్రమంలోనే ఎరుక కూడా ఉత్పత్తి చెందును
తనకు తానే అరుదెంచెనొరా = ఎట్టి మూలము, ఆధారము లేకనే తనకు తానే వచ్చెను
పుట్టు, గిట్టుటలనే నట్టేట నిలుచుండి = పుట్టుక, చావులనే క్రమంకలిగుండీ
బట్ట బయలును పొడ = పరిపూర్ణము యొక్క ఉనికి
గట్టినగను పడదు = తెలుసుకొన్న కనపడకుండా పోవును

## తాత్పర్యము

కట్టె యందు నిప్పు కన్పించదు. ఆ కట్టె నింకొక కట్టెతో మధించినచోట నిప్పు కన్పించును. అది పెద్ద మంటగా మండి ఆ కట్టెను కాల్చి వేసివాటితో పాటు తానుకూడా లేకపోవును. అవిధంగానే ఎరుక యొక్క పుట్టువు విధానము తనకు తానే వచ్చి జాగ్రత, స్వప్నము, సుషుప్తి అను అవస్థ త్రయములలో చిక్కి చివరకు పరిపూర్ణబోధచే తన మూలమును, స్థానమును విచారించి తాను లేనని దృఢపరచుకొనును.

## ప్రతిపదార్థము

కం॥ తన మూలము తల్లిదండ్రులు। తనవలెనెవారు వారి
తలిదండ్రులకున్। తనవలెనెగానియన్యము।గన జననస్థానమొ
కటి। గలదాన తరమా। బ్రహ్మాదుల। కదిదెలియతరమా।
వినుము యీ బ్రహ్మాండ జననామునీనాయం। దునసైన
దిదియు గాదనివేరేయింక్కోటి। గలదనతరమా। బ్రహ్మాదూల।
కది దెలియతరమా॥ 90

తనమూలము తన తల్లిదండ్రులు = తన ఉపాధికి కారణము తల్లిదండ్రులు
తనవలెనె వారు వారి తల్లిదండ్రులకున్ = తనకు ఎట్లా ఈ సృష్టి సమస్తమునకు తల్లిదండ్రులే కారణము
తన వలెనె గాని అన్యముగన = ఇంతకంటె వేరొక కారణము
జనన స్థానమొకటి కలదన తరమా = వేరే మరొక కారణము కలదనుట తగునా
బ్రహ్మాదుల కది తెలియ తరమా = ఈ అంశము బ్రహ్మాది దేవతలకు కూడా సాధ్యముకాదు
ఈ బ్రహ్మాండ జననము = పంచభూతాత్మకమైన ఈ ప్రపంచము
నీ నా యందున నైనది = నీవు, నేను అను గుర్తు కలుగు చున్నది.
వినుము = తెలుసు కొనుము
ఇది గాదని వేరే ఇంకోటి గలదన తరమా=ఇది గాక వేరే ఇంకోటి చెప్పుటకు వీలున్నదా?

## తాత్పర్యము

పిండాండ దృష్టి యందు విచారించిన వారికి వారి ఉపాధులకు కారణము తల్లిదండ్రులుగా తెలియు చున్నది. సూక్ష్మముగా విచారించినచో ఉపాధులకు అన్నము, దానికి తల్లి దండ్రులు ఔషధాదులు, పృధ్వ్యాది పంచభూతములు (బ్రహ్మాండము) పరంపరా కారణముగా తోచుచున్నది. ఈ బ్రహ్మాండము ప్రకృతి పురుషుల కలయిక వల్ల ఏర్పడుచున్నది. ఇట్టిదానికి అధిష్టానము కారణమగు చున్నది. ఇట్టి అధిష్టానము (ఎరుకకు) తనే కారణము కాని అన్యమైన పరిపూర్ణము కారణము కాదు. తనకు తానే స్వకారణము. ఇది నీవు, నేను అను గుర్తుగా తోచుచున్నది. మూలము గాని ఆధారముగాని లేనిది. ఈ రహస్యము జగన్నిర్మాణమునకు కారణమగు బ్రహ్మాది దేవతలకు కూడా తెలియ రానిదై వున్నది. గురు గోప్యమని గురువు ద్వారానే తెలియ వలసి వున్నదని తెలియవలెను.

కం॥ ఆకాశము శూన్యంబని। లోకులు మొరబెట్ట దానిలో పవనాదుల్।
ప్రాకటముగబుట్టినవని। చీకాకుగ జెప్పినారు। ఛీవినరాదూ।
వంధ్యాసంతీ। క్షితిలోనలేదూ। కాకుంటెవిను చోద్యమా
కుందేటికి కొమ్ము। లీకాలముననె మేమేకంటిమను మాటఛీ।
వినరాదూ వంధ్యాసంతీక్షితిలోనలేదూ॥ 91

## ప్రతిపదార్ధము

ఆకాశము శూన్యంబని = ఆకాశము లేనిదని
లోకులు మొరపెట్టి = లోకులు స్పష్టపరుస్తు
దానిలో పవనాదులు = ఆకాశము నుండి వాయువు అగ్ని మొదలైనవి
ప్రాకటముగ = స్పష్టముగా, క్రమముగ
పుట్టినవని = పరిణామము చెందినవని
చీకాకుగ చెప్పినారు = విరుద్ధముగా చెప్పినారు
వినరాదు = పైమాటలు లెక్క లోనికి తీసుకోకూడదు
వంధ్యాసంతి = గొడ్రాలు సంతానము,
క్షితిలోనలేదు = ఈ భూమండలంలో శబ్ధమే తప్ప వస్తువులేదు
కాకుంటే = ఈ విధంగా కాకపోతే
విను చోద్యము = ఆశ్చర్య కరమైన విషయము విను
కుందేటి కొమ్ము లీకాలమున మేమేకంటి మనుమాట = కుందేటి కొమ్ము కలదనుమాట ఈ సంధర్భంలో మేము చూచుచున్నాము.
ఛీ వినరాదు = లెక్కలోకి తీసుకోరాదు.

## తాత్పర్యము

ప్రపంచములో సృష్టి పరిణామాన్ని వర్గీకరిస్తు అన్నిటికి ఆధారమైన ఆకాశమును ప్రధమముగా పేర్కొనుచు, అది శూన్యమని వస్తువుగా నిర్దేశిస్తు పరిణామక్రమములో వాయువు, అగ్ని, జలము, పృధ్వి, అన్నము, ఓషధులుగా పరిణామము చెందినట్లు చెప్పియున్నారు. ఇది పరస్పర విరుద్ధమై తోచుచున్నది. ఈ నిర్ణయమెట్లున్న దనిన వంధ్యా సంతతి వలె, కుందేటి కొమ్ము వలె వున్నది. కేవలం ఉన్నదను మాట తప్ప వస్తువెట్లు లేదో అట్లే ఎరుకకు మూలము, ఆధారము లేనిదని తెలియవలెను.

కం॥ **అన్నపుసూక్ష్మాంశము మన। సెన్నగనీరంబు ప్రాణమెరుగు**
**ముయీరెం। డెన్నడుకలియవొనాడే। నున్ననుమీ యెరుక**
**మాట। సుగుణసంపన్నా। కలసుంటెయెరుక। సుమియింత**

కన్నా! వున్నదెరుకమూలమన్నాదివినలేదు। యెన్నాడుయీ
భ్రాంతి నిన్నంట నివ్వకు। సుగుణసంపన్నా। కలసుటెయెరుక
సుమియింతకన్నా॥ 92

## ప్రతిపదార్థము

సుగుణ సంపన్నా = అనేక సద్గుణములు రాశీభూతమై పూర్వజన్మ పుణ్య విశేషము చేత ప్రభావితమైనవాడు

అన్నపు సూక్ష్మాంశము మనసు = త్రివృత్కరిణి ప్రకారము కఠినాంశము. మనము తినగా అది సప్తధాతుమయమై సూక్ష్మాంశము మనసు గా మారును.

ఎన్నగా = విచారించగా

నీరంబు ప్రాణ మెరుగుము = పై విధముగా ద్రవాంశము సూక్ష్మము ప్రాణముగా మారును.

కలసుటె ఎరుక సుమీ = సూక్ష్మాంశములైన మనఃప్రాణముల కలయికలో నేను అనే గుర్తు ఏర్పడును

ఈ రెండెన్నడు కలియవొ = మనఃప్రాణములు ఎప్పుడు కలిసియుండవో

నాడె సున్న సుమీ ఎరుకమాట = అపుడే ఎరుకకు మూలము గాని స్థానముగానిలేవు

ఇంతకన్నా = ఇంతకన్నా

వున్నదెరుక = మనము గుర్తించే తెలివికి

మూలమన్నది వినలేదు = కారణము, ఆధారము మరొకటి వున్నవి అనుమాట లేదు.

ఎన్నడు ఈ భ్రాంతి నిన్నంటనివ్వకు = మూలము గాని, ఆధారముగాని ఉన్నదనే మాట నీ మనసు లోనికి రానివ్వకు

## తాత్పర్యము

త్రివృత్కరణి పార్థ్యాంశము ప్రకారము పృధ్వీభూత సంబంధమగు కఠినాంశమగు ఆహారమును స్వీకరించుటలో స్థూలభాగము మలము గాను,

మధ్యమ భాగము మాంసముగను సూక్ష్మం భాగము మనసుగాను పరిణమించు చున్నది. ద్రవాంశ భూతమగు జలము అట్టి స్థూల భాగము మూత్రముగను, మధ్యమ భాగము రక్తము గను, సూక్ష్మభాగము ప్రాణముగను, పరిణామము చెందుచున్నవి. మధ్యమ భాగములైన మాంసము, రక్తములు స్థూలోపాధిగను, వీటి సూక్ష్మాంశములైన మనఃప్రాణములు సూక్ష్మోపాధియగు నేనను గుర్తుగాను ఏర్పడు చున్నవి. స్థూలభాగముల మరియు సూక్ష్మభాగముల కలియక చే నేను, మేనులు ఏర్పడు చున్నవి. వస్తు నిశ్చయముగా విచారించిన వారికి నేనను ఎరుకకు ఇంతకన్నా ఆధారము, మూలము కన్పడదు. ఈ రహస్యము గురుముఖతః విచారించి స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణము నందు ఈ గుర్తుకు మూలము గాని, ఆధారము గాని లేనిదని గ్రహించుము.

కం॥ సంకల్పము లేనిదెని। స్సంకల్పములోనదోచుచను దోచు
చనున్। సంకల్పము తప్పునని। స్సంకల్పము నెరిగెనేని।
చనుతా లేననుచూ। నిస్సంకల్పు। మునునిల్చెదనుచూ
సంకల్పించుట కింక సంకల్పమేదిని। స్సంకల్పమందిట్లు
సంకల్ప మెరిగితే। చనుతాలేననుచూ। నిస్సంకల్పు। మును
నిల్చెదనుచూ॥ 93

## ప్రతిపదార్థము

సంకల్పము లేనిదె = గుర్తెరిగే తెలివి (లేని ఎరుక)
నిస్సంకల్పము లోన = పరిపూర్ణ పరబ్రహ్మము నందు
దోచుచను దోచుచనున్ = వచ్చి వుండి పోవు చుండును
సంకల్పము తప్పున = గుర్తు లేనిదని
నిస్సంకల్పము నెరిగె నేని = పరిపూర్ణము వున్నదని దృఢపరచు కొనుటచే
చను తాలేననుచు = తను లేనని గుర్తించును
నిస్సంకల్పమును నిల్చెదనుచు = పరిపూర్ణము స్వతఃస్సిద్ధముగా వున్నదని గ్రహించుకొని

సంకల్పించుట కింక సంకల్పమేదీ = గుర్తించడానికి తెలివేది? నిస్సంకల్పమందిట్లు సంకల్ప మెరిగితే = ఎరుక పరిపూర్ణములను ఈ విధముగా దృఢపరచుకుంటె చాలు.

## తాత్పర్యము

సంకల్పరూపమగు ఎరుక, నిస్సంకల్ప రూపమగు పరిపూర్ణమందు మూలము గానీ స్థానము గానీ లేనందున తనకు తానే వచ్చి వుండి పోవుచుండును. పరిపూర్ణము వున్నదని, తాను లేనని గురుముఖత విచారించిన మీదట తనకు తానుగా లేకపోవుచున్నది. పరిపూర్ణము వున్నదనిగాని తాను లేననిగాని గుర్తించి చెప్పుటకు తానే లేకపోవును. కావున నిర్ణయమే లేదని తెలియ వలెను.

కం॥ మాయగదాలేనియహం। బాయగదాతనకు దానె అచలము యేర్పా। టాయగదామాయనెలేం। దాయగదా మాయచిత్ర। మాయాగదోయీ। సంశయమంత। పాయగ దోయీ। మాయా సమూలాము। మాయజూస్తుండంగ। మాయమై పాయను। మాయాకెయిదిచిత్ర। మాయగదోయీ। సంశయ మంత పాయగదోయీ॥ 94

## ప్రతిపదార్థము

మాయగదా = లేనిది గదా

లేనియహం బాయగదా = లేని గుర్తెరిగే శరీరము

తనకు తానే అచలము ఏర్పాటాయెగదా = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు ఎట్టి ఆధారములేక తనకు తానే తోచెను.

మాయనే లేందాయగదా = విచారించిన వారికి ఎరుక లేనిదగును

మాయ చిత్రమాయగదోయి = తాను లేకపోవుట తనకే విచిత్రముగా తోచును.

సంశయమంత పాయగదోయి = ఎరుక ఉత్పత్తిని గూర్చిన సందేహము

విచారింప బడినది గదా

మాయా సమూలము మాయ జూస్తుండంగ మాయమైపోయెను = పై విచారణద్వారా తన ఉనికిని తాను విచారించగా తన కళ్ళముందే తనకు మూలము గాని స్థానము గాని లేదని తనకు తానే గ్రహించి తానే లేక పోవుచున్నది

## తాత్పర్యము

మాయ అనగా లేనిది అని అర్థము. స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు గుర్తెరిగే తెలివి కూడా లేనిదని సిద్ధాంతము. లేనిది ఉన్నట్లుగా తోచబడుట మాయ లక్షణము. లేక పోయినా వున్నట్లుగా భ్రమపడుచుండుట వీని సహజలక్షణము. వస్తునిశ్చయపూర్వకముగా విచారించిన వారికి ఈ రహస్యము ఆరూఢమై తన ఉనికిని తానే గుర్తించి, తనలేమిని తనే దృఢపరచుకొని తనకు తానుగానే లేక పోవుచున్నది.

కం॥ బిందువు తనువునబుట్టును। బిందువుతనువింద్రి యముల। బృందంబసువుల్। అందముగగలుగునివి దేనందున బుట్టిన వొతెలియ। నజునికి తరమా। మూలము లేని। వని తెలుసు కొనుమా। అందూకె బయులున్న దరసి మూలములేని బింద్వాది కంబూల పేరూ దల్వకు తెలియ। నజునికి తరమా మూలము లేని। వనితెలుసుకొనుమా॥ 95

## ప్రతిపదార్థము

బిందువు = అంత:కరణము

తనువునబుట్టును = శరీరము తోనే ఏర్పడును

బిందువు తనువింద్రియముల బృందంబసువుల్ = అంత:కరణము, ఇంద్రియములు, చైతన్యము, ప్రాణము

అందముగా కలుగు = క్రమంతో ఏర్పడును

ఇవి దేనందు పుట్టినవొ = ఇవన్నియు దేనందు ఉత్పత్తి అగుచున్నవో

తెలియ = గుర్తించుటకు
అజునికి తరమా = బ్రహ్మాదులకు కూడా తెలియదు
మూలము లేనివని తెల్సి కొనుమా = స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు ఎట్టి ఆధారము లేకనె తోచుచున్నవని దృఢ పరచుకొనుము.
అందుకె బయలున్నదరసి = కనుకనె పరిపూర్ణమును దర్శించి
మూలము లేని బింద్వాది కంబుల పేరుదల్పకు = ఆధారము లేకనే ఏర్పడిన అంతఃకరణము, ఇంద్రియములు, చైతన్యము, ప్రాణముల గురించి తలచకు.

## తాత్పర్యము

అంతఃకరణమగు ఎరుక. ఎరుక నుండి యే ఇంద్రియములు చైతన్యము, ప్రాణము మున్నగున్నవి ఏర్పడు చున్నవి. ఇట్టి ఎరుక శరీరము నందు ప్రకాశించు చుండును. ఇవి ఒక దానిని ఒకటి ప్రభావితం చేస్కుని, ఏర్పడు చున్నవే గాని, వీటికి వేరే మూలము గాని ఆధారముగాని లేవు. వీటి ఉత్పత్తిని గూర్చి బ్రహ్మాది దేవతలు కూడా విచారించలేరు. గురు ముఖతః విచారించిన వారికి స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణము నందు ఇది మూలము, స్థానము లేకనేకల్గు చున్నదని తనంతట తానే కలుగుచున్నదని తెలియును. అందు చేతనే మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదని చెప్పబడుచున్నది.

## ఎరుకను విడిచే విధానము

పరిపూర్ణ బోధయందు పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరిగి ఎరుకను మాను అనే సూత్రమునందు ఎరుకను విడచుట అనునది అత్యంత ముఖ్యమైన అంశము. గురు గోప్యమైన విషయము. ఇంత వరకు జరిగిన విచారణలో పరిపూర్ణమును ఎరుగుట ఎరుకను ఎరుగుట అనునది కేవలము వస్తు నిశ్చయ జ్ఞానము ద్వారానే సాధ్యము. గురువు యొక్క అవసరం కూడా ఇక్కడనే వున్నది. పరిపూర్ణము వున్నదని ఏగుర్తు చే

దృఢపరచుకొన్నామో అదృఢపరచుకొన్న మీదట మిగిలిన గుర్తుకే లేని ఎరుక అని చెప్పు బడును. లేనిది లేదని, ఉన్నట్లు భ్రమపడుటయె కాని వాస్తవమునకు పరిపూర్ణము వున్నదని దృఢపడిన మీదట ఇతరమైన దంతయు లేని దగుచున్నది. ఉన్నదను దృఢమైన నిర్ణయము మీదగాని లేనిదిఅని దృఢ మగుట కష్టము. లేనిది ఉన్నట్లు తోచబడుట ఎరుక లక్షణము అని అంతకు పూర్వం విచారణ ద్వారా తెలుసుకున్నాము. లేనిది లేదని గట్టిగ దృడ పరచుకొనుటయె విడచుట అనుమాట కర్థము ఇందుకు అనువుగా పలు దృష్టాంతముల ద్వారా ఈ శీర్షిక యందు చెప్పబడుచున్నది.

**కం॥ ఒకదేహధారితనువున। సకలావస్థలు జనించిచనిన విధమునన్। అకలంకమైనబయలులో। ప్రకంటంబై లేని యెరుక। బయలుండజూచీ। తనముచ్చట। పరికించిలేచీ। వొక కొంత సేపైనవుండేటందుకులేక। సకలాముతనవెంట జనుదేర జను బట్టి। బయలుండజూచీ। తనముచ్చటపరికించిలేచీ॥ 96**

## ప్రతిపదార్థము

ఒక దేహదారి తనువున = పిండాండ గతమైన శరీరమునందు

సకలావస్థలు = బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్య, మరణ దశలు జాగ్రత, స్వప్నము, సుషుప్తి మొ॥ అవస్థలు

జనించి చనిన విధముగా = ఏర్పడి, పోయినక్రమములో

అకలంకమైన బయలులో = స్వత:స్థిమైన పరిపూర్ణమునందు

లేని ఎరుక ప్రకటంబై = లేని ఎరుక తోచి, ఏర్పడి

బయలుండ జూచి = పరిపూర్ణము వున్నదని గురువాక్యముచేత దృఢపరచుకుని

తనముచ్చట = తన ఉనికి లేక అనుభవము

పరికించి = విచారించి

లేచి = తన ఉనికిని విడిచిపెట్టి

వొక కొంత సేపైన వుండే టందుకు లేక = ఒక్క క్షణమైనా ఉండటానికి

వీలులేక, సాధ్యముగాక
సకలాము = తననుండి ఏర్పడిన జీవేశ్వర జగత్తంతయు
తనవెంట జనుదేరజను = తనతో పాటే సమస్తము పోవును.

## తాత్పర్యము

బ్రహ్మాండము నుండి పిండాండ మేర్పడిన క్రమమునందు శరీర ధర్మములైన బాల్యము, కౌమారము, యవ్వనము, వార్ధక్యము ఇంద్రియ ధర్మములైన జాగ్రత, స్వప్నము, సుషుప్తి, మరణము ఒకదాని వెంబడి ఒకటి ఏర్పడుచు సముద్రపు అలలలాగ ఎట్లు నశించిపోవు చున్నవో అవిధంగా స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు గుర్తెరిగే శరీరము తనకు తానుగా తోచి బ్రహ్మాండ పిండాండాకారములు చెంది పూర్వపుణ్య వశమున పరిపూర్ణ గురువు నాశ్రయించి విచారణద్వారా తనమూలమును స్థానమును గుర్తించి ఉన్న పరిపూర్ణము నందు తన నిజరూపమైన గుర్తెరిగే శరీరము లేనిదని, దానివలన తన పరిణామ క్రమమునకు బ్రహ్మాండ పిండాండో పాధులు లేనివని వస్తునిశ్చయపూర్వకముగా దృఢ పరచుకొని ఉన్న దానియందు తన వునికి వున్నదో లేదో దృఢపరచు కొనుటలో తన ఉనికి నిజంకాదని తనకు తానే గ్రహించి తనకు తానే లేకపోవుచున్నది. తాను లేకపోవుటద్వారా తననుండి పరిణమించిన సమస్తము తనతో పాటుగ లేకపోవు చున్నది అని గ్రహించవలెను.

**కం॥ రాకడపోకడ లేకను। యేకస్థితినుండు నట్టి యీ బయలందున్।**
**రాకడపోకడ గలిగియనేకముగా దోచులేని। యెరుకా సుశీలా।**
**ప్రతిమలాలేని। పెరుమాళ్ళలీలా। లేకాతోచిన యెరుకాలేనె**
**లేదనుచునీ। కీకీలుగురునీచెయెరుకైతె। జాలుళ్ళక్కెరుకాసుశీలా**
**ప్రతిమలాలేని। పెరుమాళ్ళలీలా॥** 97

## ప్రతిపదార్థము

సుశీలా = త్రికరణ శుద్ధి కల్గిన ప్రవర్తన గలవాడు
రాకడ పోకడ లేకను = ఆవిర్భావ తిరో భావములు చెందకుండా

ఏకస్థితి నుండునట్టి = ఎట్టి పరిణామ క్రమమునకు లోను కాకుండా స్థిరమైన
ఈబయలందున్ = స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమునందు
రాకడ పోకడ కల్గి = పరిణామ క్రమమునకు లోనై
అనేకముగా తోచు లేని ఎరుక = పిండ బ్రహ్మాండాకారములుగా పరిణమించు గుర్తెరిగే శరీరము
ప్రతిమలోలేని = బొమ్మలో లేని
పెరుమాళ్ళు = భగవంతుడు
లీల = వైభవము
లేక తోచిన ఎరుక లేనే లేదనుచు = ఉన్న పరిపూర్ణము నందు ఎరుక లేనిదని దృఢపరచు కొనుట చేత
ఈ కీలు = ఈ రహస్యము
గురునిచే ఎరుకైతే చాలు = గురువు ద్వారా ఆరూఢపరచుకొంటె
ఉళ్ళుక్కెరుక =ఎరుక లేనిదగుచున్నది.

## తాత్పర్యము

రాకపోకలు లేక ఎట్టి పరిణామక్రమమునకు లోనుకాక స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు మూలము గాని ఆధారముగాని లేకనే పరిణామ క్రమమునకు లోనై అనేక మార్పులు చెందుచున్న గుర్తెరిగే శరీరము తోచుచున్నది. ఎట్లనగా దేవతా ప్రతిష్టల యందు వైష్ణవ సాంప్రదాయంలో చెక్కతోగాని, రాయితో గాని, లోహంతోగాని బొమ్మతయారు చేసి ప్రాణప్రతిష్ట మంత్రపూతంగా చేసి అర్చామూర్తి అని పేరు పెట్టి సకల భోగ భాగ్యాలతో అలంకరించి దైవభావన కల్గిస్తారు. బొమ్మయందు లేనిదైనా భావనతో ఎట్లు కల్పింప బడినదో అట్లే స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే శరీరము దాని పరిణామ క్రమము ఉన్నదిగా ఈ కందార్థమునందు మనకు చెప్పబడు చున్నది. లేనిది ఉన్నట్లుగా తోచబడుట భ్రమ. ఈ రహస్యము గురుముఖత: విచారించినవారికి ఉన్నది పరిపూర్ణమని లేనిది ఎరుక అని దృఢమగును.

కం॥ వనిగల్లుదకములోపల। తనకైతావొచ్చి తనకుతానే గువిధం।
బునపరిపూర్ణములోపలతనకై తావొచ్చి యెరుక తనకై
తాజనునూ। అచలంబున్నదని। తానెరిగిననూ। తనలేమి
నిజమాని తనకేతోచునుతోచి। తనకల్మిమృషగాభా। వనజేసిని
లువాక। తనకై తాజనునూ। అచలంబున్నదని। తానెరిగిననూ॥98

## ప్రతిపదార్థము

వనిగల్లుదకము లోపల = వడగళ్ళ వానలో వచ్చు ఉదకము
తనకై తావచ్చి = తనంతటే తానేవచ్చి
తనకు తానేగు విధంబున = తనకు తానుగా నశించు పద్ధతిగా
ఎరుక తనకై తావచ్చి తనకై తాజనును = గుర్తెరిగే శరీరము తనకు తానే వచ్చి తనకు తానే నశించును
పరిపూర్ణము లోపల = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు
అచలంబున్నదని తానెరిగినను = పరిపూర్ణమున్నదని ఎరుక గుర్తిస్తె
తనలేమి నిజమని తనకె తోచును = తన ఉనికి లేదని తనకే స్ఫురించును.
ఉన్నపరిపూర్ణము నందు తాను లేనని తనకు తానే దృఢపరచుకొనును
తోచి = భావించి
తనకల్మి = తన ఉనికి లేనిదని
మృషగా భావనచేసి = తనే సమాధానపడి
నిలువాక = ఉండలేక

## తాత్పర్యము

వేసవి కాలంలో ఆవిరి చేత మేఘ మండల మేర్పడి అందునీరు ఘనీభవించి గడ్డకట్టును. తొలకరిలో గడ్డ యందు నీటిభారముచేత వర్షరూపముగా భూమిమీద ప్రసరించును. ఇది చాలా శక్తివంతమైనది. భూమి మీద పడుటతోనే భూమియందు గల ఉష్ణోగ్రతవల్ల అవి కరిగి వెంటనే ద్రవీభవించి పృధ్విలో కలిసి పోవును. ఇందు నీరే గడ్డగా మారి మరల నీరవును. ఈ విధంగానే స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తెరిగే శరీరముతనకు తానుగానే వచ్చి తనకు తానే నశించును. పరిపూర్ణము వున్నదని తాను లేనని గురువ్వాక్యము చేత తనకు తానే దృఢపరచుకొని తన ఉనికి లేనిదిగా భావించి నశించును అని తెలియవలెను.

కం॥ పరిపూర్ణములో దోచుచు। యెరుకేచనుతనకుదానె యేర్పడ
వినుమీ। తొరటలు తొమ్మిదిగలదై। తరితీపుల నొందుచుండి।
తనువానదగుచూ। అచలంబున్నా। దనితాలే ననుచూ। మరిగిట్లె
రుకకు దెలియ యెరుకనిల్వదుగాని। పరిపూర్ణముండు దాన్నెరి
గేదెట్లిక। గుర్తు తనువానదగుచూ అచలంబున్నదని
తాలేననుచూ॥ 99

## ప్రతిపదార్థము

పరిపూర్ణములో తోచుచుఎరుక = స్వత:స్సిద్ధమై అంతటా నిండి యున్నవస్తువు నందు గుర్తెరిగే శరీరము

తోచును చను తనకుతానే = తనకు తానుగా ఆవిర్భవించి వచ్చిపోవును.

ఏర్పడ వినుమీ = చక్కగా గుర్తించుము

తొరటలు తొమ్మిది గలదై తరితీపుల నొందుచుండి తనువానదగుచు = 9 రంధ్రములతో లేక నవ ద్రవ్యములుగా శరీరముగా ఏర్పడి సుఖ దుఖ:ములు లేక జన్మ పరంపరలు కలిగించుకొంటూ

అచలంబున్నదని తాలేననుచూ = పరిపూర్ణము వున్నదని అందు తాలేనని

మరుగు = రహస్యము

ఇట్లెరుకకు తెలియ = తాను లేనన్ రహస్యము గురుర్వాక్యము ద్వారా గుర్తించి

ఎరుక నిల్వదు = గుర్తించే తెలివి మిగలదు

కానీ పరిపూర్ణముండు = తాను లేక పోయినా స్వత:స్సిద్ధమైన పరిపూర్ణముండును

దాన్నెరిగేదెట్లిక గుర్తు = ఉన్నదని నిర్ణయించుటకు గుర్తెరిగే శరీరములేదు

## తాత్పర్యము

స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమునందు తనకు తానే గుర్తెరిగే శరీరము తోచి నవద్రవ్యములుగా ఆత్మ, మనస్సు, దిక్కులు, కాలము పృధ్వ్యాది పంచభూతములు, నవరంధ్రములు, చెవులు, ముక్కు కళ్ళు, నోరు,

గుహ్యాము, గుదము. మొదటిది బ్రహ్మాండం రెండోది పిండాండము. బ్రహ్మాండ పిండాండములుగా ఏర్పడి బ్రహ్మాండంలో పరిణామము, పిండాండములో జన్మపరంపరలు సుఖ దు:ఖములుగా పరిణామం చెందుచు పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నదని, తాను లేనని ఈరహస్యము గురుముఖతా విచారించితాను లేక పోవును. ఆపిదప ఉన్నదానిని గుర్తించి అనుభవము చెప్పుటకు గుర్తే లేకుండా పోవును.

కం॥ అహామనదుంగదా అచలము। అహాము న్నదో లేదో
చూడదదినిజమెకదా। అహామునుబుట్టించదుగద। అహాము
దయించేటి వరకె। అదివున్నదిగదా। అహామెవిశ్వమై।
నిల్చిందిగదా। అహామె యీ ముచ్చట్ల నన్నింటెన్నెరుగును గద।
అహామె తాలేనాని యరి గీతెసరిగద। అదివున్నదిగదా। అహామె
విశ్వమై। నిల్చింది గదా॥ 100

## ప్రతిపదార్థము

అహాము = నేననే గుర్తు

అహామనదు గదా అచలము = పరిపూర్ణమునకు నేననే గుర్తులేదు

అహామున్నదో లేదో చూడదు = నేననేగుర్తు వున్నది లేదని కూడా చూడదు

అది నిజమేగదా = ఇది వాస్తవమే కదా

అహామును పుట్టించదుకద = నేననే గుర్తుకు తను కారణము కాదు

అహాంఉదయించేటి వరకే అది వున్నది కదా = నేననే గుర్తు ఏర్పడక పూర్వమె పరిపూర్ణము వున్నది కదా

అహామె విశ్వమై నిల్చింది కదా = నేననే గుర్తు ఈ ప్రపంచముగా పరిణామము చెందినది కదా

అహామె ఈ ముచ్చట్లన్నింటెన్నెరుగును గదా = నేననే గుర్తు ఈ పరిణామమునకు కారణంకదా

అహామె తాలేనని యరిగీతె సరిగదా = స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు తాను లేనని దృఢపరచుకొంటె చాలు

## తాత్పర్యము

స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు నేనను గుర్తులేదు. నేననే గుర్తును గూర్చి వున్నది, లేదు అనే నిర్ణయం కూడా తనకిలేదు. నేననే గుర్తుకు తాను కారణం కాదు. నేననే గుర్తు ఏర్పడుటకు పూర్వమె వున్నది. నేననే గుర్తు జీవేశ్వర జగత్తుగా మార్పు చెందినది. దానియందు సమస్త వ్యవహారమునకు ఇదే కారణము, మూలము, ఆధారము అయివున్నది. పరిపూర్ణము వున్నదని, అందుగుర్తించే తాను లేనని ఎప్పుడు తెలుసు కొనెదమొ అప్పుడు నేను అనే గుర్తు మిగలదు.

**కం॥ లేనెరుకనుబయలందున। లేనేలేదనక యితురులేల పలి కిరో। లేనిదికలదనిపిదపను। లేనేలేదనుచుసిగ్గు। లేకాయీ లీలా। ఛీవినకీ। చీకాకునీకేలా। మేనందశుద్ధాము తానల్దు కొనిమళ్ళి। పూనికడిగిన రీతినౌను సిగ్గొకయింత। లేకాయీ లీలా। ఛీ వినకీ। చీకాకునీకేలా॥** **101**

## ప్రతిపదార్థము

లేనెరుకను బయలందున = గుర్తెరిగే శరీరమును పరిపూర్ణమందు

లేనే లేదనక = లేదని అనకుండా

ఇతరులేల పలికిరో = మతవాదులు ఎలాచెప్పారో

లేనిది కలదని = లేని ఎరుకను వున్నదని

పిదపను = తర్వాతను

లేనేలేదనుచు = ముందు వుందని తరువాత లేదని

సిగ్గులేకా ఈ లీలా = సరైన అవగాహన లేక ఈవిధంగా

ఛీవినకీ = పైనచెప్పిన మాటలు నీదృష్టిలో పెట్టుకోకు

చీకాకు నీకేలా = ఈ సమస్యనీకెందుకు

మేనందశుద్ధము తానల్దుకొని = శరీరానికి తానే బురద పూసుకొని

మళ్ళిపూని కడిగిన రీతినౌను = తానేమళ్ళీపరిశుద్ధ జలముతో కడిగినట్లుగా

## తాత్పర్యము

సృష్టికి కారణమగు ఎరుకకు మూలమును, కారణమును నిర్ణయించుటలో, మతవాదులు భిన్న భిన్న కారణాలు చెప్పియున్నారు. ప్రారంభంలో ఏమి లేదని, మధ్యలో కొంతకలదని, చివరకు ఏమీలేదని, గజిబిజిగా నిర్ణయించి వున్నారు. ఇది ఎట్లనగా శరీరమునకు బురద తానే పూసుకొని, పరిశుద్ధ జలముతో తానే కడుక్కున్న విధముగా నున్నది. ఇవి అన్నియు చీకాకు కలిగించేవి తప్ప, భ్రాంతి రహిత విధానమునకు పనికి రావని తెలియవలెను.

**కం॥ పిల్లలు తాట్యాకులతో। పిల్లల గావించి పెండ్లి పేరం టంబుల్।**
**కొల్లలుగ జేయువారల। తల్లులుగని సత్యమను చు।**
**తలచేరామదినీ। నినునీవిట్లుదలచరామదిని। కల్లాసంసా రము**
**గని మానవులుసంత। సిల్లాగగురుమంత్ర సిద్ధాలు నిజమాని।**
**తల చేరామదినీ। నినునీవిట్లుదల చరామదినీ॥ 102**

## ప్రతిపదార్థము

పిల్లలు తాట్యాకులతో = పిల్లలు తాటియాకులతో
పిల్లల గావించి = స్త్రీ, పురుష రూపములుగా బొమ్మలు చేసి
పెండ్లి పేరంటంబుల్ = పెండ్లిండ్లు, పేరంటములు, విందులు
కొల్లలుగా జేయ = విశేషముగా, హెచ్చుగా చేయ
వారల తల్లులు గని = ఆ పిల్లల యొక్క తల్లులు చూచి
సత్యమనుచు తలచేరా మదిని = ఆ పెండ్లి, పేరంటాలు నిజమని మనసులో తలుస్తారా?
నిను నీవిట్లు తలచరా నీమదిని = నీ ఉత్పత్తి విధానము కూడా ఈవిధంగానే గుర్తించు.
కల్లా సంసారము గని మానవులు = నిజంకాని ఎరుకచే పరిణామమునకు లోనై జనన మరణములు పొందుచున్న మానవులు
సంతసిల్లగ = ఆనందపడగ

గురు మంత్రసిద్ధులు = పరిపూర్ణ భావజ్ఞులు
నిజమని తలచేరా మదినీ = సత్యమని వాళ్ళ మనసులో ఈ భ్రాంతికి చోటిస్తారా?

తాత్పర్యము

చిన్నపిల్లలు వినోదం కొరకై తాటాకులతో బొమ్మలు చేసి, అందు పెండ్లి కొడుకు, పెండ్లి కూతురుని తయారు చేసి, పెళ్ళి పేరంటాలు, విందు వినోదాలు గావించి ఎంతో సంతోషిస్తారు గాని ఆ పిల్లల తల్లులు ఈ అంశాన్ని పెద్దగా పట్టించుకోకుండా నిర్లిప్తంగా వుంటారు. ఆవిధంగానే మూలంలేని గుర్తెరిగే శరీరంచే ఏర్పడి బ్రహ్మాండ పిండాండములుగా పరిణామంచెంది, జీవులు జనన మరణ రూపమైన సంసార భ్రమణంలో మునిగి సుఖదు:ఖములు పొందుచుండగా, గురుముఖత: స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము వున్నదని, దానిని గుర్తించే గుర్తుకు మూలంగాని స్థానంగాని లేదని వస్తునిశ్చయ పూర్వకముగా ఆరూఢపరచుకొన్న పరిపూర్ణ భావజ్ఞులకు జనన, మరణ సంసారమందలి సుఖదు:ఖములునిజంకావని, కేవలం భ్రాంతి జన్యములని ఎట్టి వికారమునకు లోనుకాక దృఢంగా, స్థిరంగా మనసు గట్టిపరచుకొని భ్రాంతి రహిత స్థితియందు వుంటారు. ఈ స్థితిని నీవు బాగా దృఢపరచుకొని, నీ గురించి ఇట్టి ఆరూఢత కల్గి యుండుము అని దృఢ పరచుకొనుము.

**కం॥ మేనెరుకల రెండింటిలో। దానిని యిది దీనినదియు తగస్సృజి
యించున్। మేనెరుక లివియుమూలము। లేనిదె సృజనయ్యె
ననుచు। లేనేలేవంటి। అంటే తప్పు। లేనేలేదంటీ।
మేనెరుకలిప్పాడు దేనందున్నవో చూచి। లేనిమేనెరుకల
లేనివనుచు నమ్ములేనేలేవంటి। అంటెతప్పు లేనేలేదంటీ॥103**

## ప్రతిపదార్థము

మే నెరుకల రెండింటిలో = శరీరం, నేననేగుర్తు ఈ రెంటిలో

దానినిఇది, దీనినదియు తగసృజియించున్ = ఒక దానికి ఒకటి ఉత్పత్తి చేసుకొనుటకు కారణముగా నున్నది

మేనెరుకలివియు = మేను, ఎరుకలు ఈ రెండు

మూలము లేనిదె = ఎట్టి ఆధారం లేకనె

సృజనయ్యెననుచు = ఉత్పత్తి చెందుచున్నవని

లేనేలేవంటి = నిజము కాదంటున్నాను

అంటె తప్పులేనే లేదంటి = అలా అనడం దోషంకాదు

మేనెరుకలిప్పుడు దేనందున్నవోచూచి = గుర్తు, శరీరం దేనందు ఏర్పడుచున్నవో తెలుసుకుని

లేనిమేనెరుకల లేని వనుచునమ్ము = మూలము గాని, ఆధారము గాని లేనివాటిని నిజము కాదని దృఢపరచుకొనుము

## తాత్పర్యము

బీజవృక్ష న్యాయముగా నేను, మేనులు ఒకదానియందు ఒకటి ఇమిడి యుండి, ఒకదాని కొకటి ఉత్పత్తికి కారణమగుచున్నది. కాని వేరొక వస్తువు కనబడదు. అట్లే తనువు ఎరుకను, ఎరుక తనువును ఉత్పత్తిచేయును. ఇందు ఉదాహరణగా పిండాండమునందు సూక్ష్మరూపమైన ఎరుక (మనస్సుకు) సంకల్పంకలిగి, స్థూలరూపమైన శరీరముద్వారా, తల్లిదండ్రుల కలయిక ద్వారా పిండ రూపముగా నేను, మేనులు ఏర్పడుచున్నవి అని తెలియ వలెను. ఈ అంశమునే బ్రహ్మాండమునందు, అధిష్టానము నందు కూడా సమన్వయం చేసుకొన వలెను.వస్తు నిశ్చయ పూర్వకముగా విచారించిన వారికి నేను, మేనులు ఒకదాని కొకటి ఎట్లు కారణమగు చున్నవో స్పష్టముగా తెలియుచున్నది. నేను-ను విడచి మేను గాని, మేనును విడచి నేనుగాని ఉండుట కుదరదు. ఒకదాని యందు ఒకటి ఓతప్రోతమైయున్నవి. ఈ రెండింటికి సంబంధ పడనిది పరిపూర్ణము. దానియందు ఈ రెండింటికి మూలము గాని, స్థానముగాని లేదని గురువాక్యము చేత దృఢపరచుకొనవలెను.

కం॥ యెరుకపనిచేయదనకుము। యెరుగుట మరచుటలు రెండు
యెవ్వరిపనులో। యెరిగింపుము నాౖమోలను। వెరువ నుతప్పితి
వెదెబ్బ। వేశేనుచూడూ। అట్లనకుండాజేసేనునేడూ వెరపించుటె
దెబ్బ వేసెనా నాతండ్రీ। యెరిగించిపైమర్మ మెరుకాను నేదీసి।
వేసెను చూడూ। అట్లనకుండ। జేసేనునేడూ॥ 104

## ప్రతిపదార్థము

ఎరుక పనిచేయదనకుము = గుర్తెరిగే తెలివి ఏ పనిచేయనిది అనుకోకు
ఎరుగుట మరచుటలు రెండు = జ్ఞానా జ్ఞానములు రెండు
ఎవ్వరిపనులో = ఏ వస్తువు పనులో (ఎవరు చేసేపనులో)
ఎరిగింపుము నాౖమోలను = నాకర్థమయ్యేలా విడమరచి చెప్పు
వెరువను = నేనేమీ భయపడను
తప్పితివెదెబ్బవే శేను చూడూ = నన్ను సమాధాన పరచడం ఎలాటి తేడా వచ్చినా నిన్నుదండిస్తాను
అట్లన కుండా జేసేను నేడు = నీవు పొరపాటు పడకుండా సవరిస్తాను.
వెరపించుటె దెబ్బ వేసెనా నాతండ్రి = నిన్ను సంస్కరించడానికన్నమాట మాత్రమె
యెరిగించి పై మర్మము = పైరెంటి భేదము గుర్తించేలా చేసి
ఎరుకను నే దీసి వేసెను చూడూ = ఆ భ్రాంతి నుండి నిన్ను తప్పిస్తాను.

## తాత్పర్యము

వేదాంతమందు ఎరుకను సాక్షని, ఎటువంటి కర్మలు క్రియలు దానికి లేవని చెప్పుచుందురు. కాని వస్తునిశ్చయ పూర్వకముగా విచారించిన వారికి ఎరుక, మఱపులు ఈ రెండూ కూడా దాని పనులే అని తెలియు చున్నది. ఇది నిర్భయముగా చెప్పవలసిన విషయము. ఎట్టి సందేహము నకు వీలులేదు. దానిని నీవు బాగా దృఢపరచుకొని నీ ఆరూఢతను చెప్పుము. ఇందుకు భిన్నముగా నీ ఆరూఢత వున్నచో నేను నా ప్రబోధద్వారా సవరించి

వస్తు నిశ్చయ పూర్వకముగా ఎట్లు ఎరుక మరపులు వున్నవో, బోధచే ఎట్లు రద్దు కాగలవో నీకు గట్టిగ దృఢపడునట్లు చేస్తాను.

కం॥ యెరుకొక్కటుండెనేనియు। యెరుకేయీ విశ్వరూప మేర్పడ దాల్చున్। యెరుకొక్కటిలేకుండిన। యెరుకైన ప్రపంచ మున్న। దెవరెరిగేరికనూ। లేదనన్నైన। నెవరుండేరికనూ। పరి పూర్ణమైనట్టి బయలుండగనిపెట్టి। గురునీవాక్యము బట్టి గురుతూ బోగొట్టితే। యెవరెరిగేరికనూ। లేదనన్నైన నెవరుండేరికనూ॥ 105

## ప్రతిపదార్థము

ఎరుకొక్కటుండెనేనియు = నేననే గుర్తు నుండి

ఎరుకే ఈ విశ్వరూపమేర్పడ దాల్చున్ = అధిష్టాన రూపమైన గుర్తు జీవేశ్వర జగత్తుగా మార్పు చెందినది

ఎరుకొక్కటి లేకుండిన = సృష్టి కారణమైన వస్తువే లేకపోతే

ఎరుకైన ప్రపంచమున్న = పరిణామక్రమంలో మార్పుచెందిన జీవేశ్వర జగత్తు

ఎవరెరిగేరికనూ = తెలివి యొక్క ప్రాధాన్యత వుంటుందా?

లేదనన్నైన ఎవరుండేరికను = వుందని చెప్పడానికైనా, లేదని చెప్పడానికైనా తెలివే కారణము

పరిపూర్ణమైనట్టి బయలుండ గని పెట్టి = స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమును వున్నదని గ్రహించి

గురుని వాక్యము బట్టి గురుతుబోగొట్టితె = ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా దృఢ పరచుకొంటె

## తాత్పర్యము

నేనను గుర్తు ఒకటి మిగిలినచో అది జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందుటకు వీలగును. ఆ నేనను గుర్తు పోయినచో మిగిలిన ప్రపంచము

వున్నదనిగాని, లేనిదని గాని నిర్ణయించుటకు సాధ్యముగాదు. స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణము వున్నదని గురువాక్యముచేత దృఢపరచుకొని, దానియందు గుర్తెరిగే శరీరమునకు మూలము గాని స్థానము గాని లేదని దృఢపరచుకొన్నవారికి వున్నదను నిర్ణయము గాని, లేనిదను నిర్ణయముగాని ఉండదు.

**కం॥ తెలుపుమృదుత్వము మధురము। గలవస్తువు చక్కెరను
చుగనుగొన్నట్లా। తెలివిశరీరజగంబులు। గలవస్తువు బిందు
వనుచుం। గనుగొనరాదా నేదెల్పితె। వినినమ్మరాదా।
తెలివీచెబయలుండ దెలశియీ తెలివిని। తెలివిచేతనె పట్టితీసి
వెయ్యర పోని। కనుగొన రాదా। నేదెల్పితె। వినినమ్మరాదా॥106**

## ప్రతిపదార్థము

తెలుపు, మృదుత్వము, మధురము గల వస్తువు చక్కెరనుచు = తెల్లదనము మెత్తదనము, తీపి గల వస్తువును పంచదారని (చక్కెర) గుర్తించినట్లుగా
తెలివి శరీర జగంబులు గల వస్తువు = జ్ఞానము, ఆవరణము, పరిణామము గల వస్తువు
బిందువనుచుకనుగొనరాదా = అంతఃకరణగా (ఎరుక) తెలుసు కొనుము
నేదెల్పితే విని నమ్మరాదా = నేను దృఢపరచిన మీదట గుర్తించవచ్చు కదా
తెలివిచే బయలుండ తెలిసి = గుర్తెరిగే శరీరముచే అన్యమైన పరిపూర్ణము వున్నదనిగుర్తించి
ఈ తెలివిని తెలివిచేతనె పట్టితీసి వెయ్యరపోని = గుర్తెరిగే తెలివిని గురువాక్యమనే గుర్తుద్వారా లేదని దృఢపరచుకొనుము

## తాత్పర్యము

తెల్లదనము, మెత్తదనము, తీపిదనము అనులక్షణములు గల్గిన వస్తువు పంచదారగా గుర్తించగా తెలివి, ఆవరణము, పరిణామము లేక మార్పు కల్గియున్న వస్తువు గుర్తెరిగే శరీరముగా వస్తునిశ్చయ పూర్వకముగా

గుర్తించుము. నీకు నీకుగా ఇది సాధ్యము కాని ఎడల నేను బోధించిన క్రమములో గుర్తించి ఆగుర్తు చేతనె దానికి అన్యమై యుండి కేవలత్వమును కలిగిన పరిపూర్ణమును ఉండజూచి, ఆ తెలిసిన తెలివిని గురువాక్యము ద్వారా (షోడశి) విడిచి యుండుము అని భావము.

**కం॥ లేనెరుక బయలులోపల। తానై తనకేరుపడిన తనమూ లమునే।**
**తానెరుగదలచినప్పుడు। తానే। లేకుండు। దృష్టాంతము**
**వినుమిచటా। కలదోచాదె తనకైతానెచటా। తానైతోచిన**
**కలతనమేల్కగనబోతె। తానేతనకు లేదు తగియున్నదీ।**
**దృష్టాంతము విను మిచటా। కలదోచాదె। తనకై తానెచటా॥107**

## ప్రతిపదార్థము

లేనెరుక = గుర్తెరిగే శరీరము
బయలు లోపల = పరిపూర్ణము నందు
తనకై తాను ఏర్పడి = తనకు తానుగానే తోచబడింది
తన మూలమును తాను ఎరుగ దలచినపుడు = తనమూలమును, ఆధారమును గుర్తించినపుడు
తానే లేకుండు = తనకు తానే లేకపోవుచున్నది.
దృష్టాంతము వినుమిచట = ఈ సందర్భంలో ఒక ఉదాహరణ వినుము
కల తోచదె తనకై తానెచట=స్వప్నమున తనంతటతాను ఎట్లు తోచుచున్నదో
తానైతోచినకల = తనకై తాను తోచినకల
తనమేల్కగనబోతె = తనకు వేరైవున్న మెళకువను కల్గించుకొనే సరికి
తానే తనకు లేదు = తనకు తాను గానే లేకపోవుచున్నది
తగియున్నదీ దృష్టాంతము =పై ఉదాహరణ సరిపోయినది

## తాత్పర్యము

స్వత:స్సిద్ధమైన పరిపూర్ణము నందు తనకు తానుగా తోచబడిన గుర్తెరిగే శరీరము తనకు మూలమును, ఆధారమును గుర్తించుటకు

 

ప్రయత్నించినపుడు తనకు తానే లేక పోవును. ఇందుకు అనుభవ పూర్వకముగా కల దృష్టాంతమును చెప్పుచున్నాను. కల తనకు తానుగా ఏర్పడి, మెళకువ వచ్చేసరికి తనకు తానుగా ఎట్లు నశించునో, ఆవిధముగానే తన మూలమును తాను గుర్తించినపుడు తనకు తానుగానే లేకుండా పోవును అని తెలియవలెను.

కం॥ యెరుకనుకలలోపురుషుని। కెరుకేయీ విశ్వమగుచు యేర్పడు కలగా। యెరుకబయలుగనితాలేం। దెరిగిన నెరుక కదిమేల్క యిదినమ్ములెస్సా। యెరుకతోపొందు వదులాదెపిస్సా యెరుకా నెకలనీకంయెంవ్వాడుందోచీతె యెంరుకాలేందను మేల్కనెరుగుమప్పుడెచాలు। యిదినమ్ములెస్సా। యెరుకతో పొందు। వదులాదెపిస్సా॥ 108

## ప్రతిపదార్థము

ఎరుకను కలలో = అధిష్టానమందు సంకల్పరూపంగా కలిగిన బ్రహ్మాండ అధిష్టాన దేవత యిన అక్షరపురుషుడు

పురుషుడు = పురమందు శయనించువాడు

ఇటువంటి పురుషులు ముగ్గురు. పిండాండమునందు క్షరపురుషుడు, బ్రహ్మాండమునందు అక్షరపురుషుడు, అధిష్టానమందు పురుషోత్తముడు.

ఎరుకే ఈ విశ్వమగుచు ఏర్పడు కలగా = ఈ పరిణామమే పంచభూతములుగా మారును. పరిపూర్ణ బోధచే ఇది లేనిది. కావున ఇది కల వంటిది అని చెప్పబడుచున్నది.

ఎరుక బయలుగని = ఈ గుర్తు తనకు అన్యమై వున్నది పరిపూర్ణమని దృఢపరచుకొని

తాలేందెరిగిన = అట్టి దానియందు తనకు మూలముగాని స్థానము గాని లేదని గుర్తించిన

ఎరుక కది మేల్క = ఇట్టి ఆరూఢతనే మెలకువగా గుర్తించుము

ఇదినమ్ము లెస్స = ఈ అంశము చాలా గట్టిగ దృఢ పరచుకొనుము

ఎరుకతో పొందు వదులాదెపిస్నా = ఇట్టి ఆరూఢతయందు ఇంకా మిగిలి వున్న గుర్తును షోడశి ద్వారా ( మూలంలేని గుర్తెరిగే శరీరం ) విడిచియుండుము

ఎరుక అనే కల నీకు ఎప్పుడు తోచితె = నేను అనే గుర్తు నీకు ఎప్పుడు కలిగితె

ఎరుకా లేందను మేల్కనెరుగుము = నే నను గుర్తు లేనిది అని మెలకువ కలిగి యుండుము

అప్పుడెచాలు = ఇట్టి ఆరూఢతయందు సకల భ్రాంతులు నశించును

## తాత్పర్యము

అధిష్టానమందలి సంకల్పముచే బ్రహ్మాండము అక్షరపురుషుడు ప్రధమంగా తోచబడును. దీనిసంకల్పముచే పిండాండ రూపమైన క్షరపురుషుడు తోచబడును. (పురుషుడు అనగా జ్ఞానము ప్రకృతి అనగా ప్రాణము అను అర్థములో) అధిష్టానమును పరమ పురుషుడని, అందుతోచబడిన బ్రహ్మాండమునకు అక్షరపురుషుడని దాని చివర పరిణామమగు పిండాండము క్షరపురుషుడని చెప్పబడుచున్నది. ఈ విధంగా క్షరపురుషునికి అక్షరపురుషుడు, అక్షరపురుషునికి పరమపురుషుడు ఆధారంగా వున్నారు. ఒక అక్షరపురుషుడే అధోదృష్టి చే క్షరపురుషుడు గాను, ఊర్ధ్వదృష్టిచే పురుషోత్తముడుగాను చెప్పబడుచున్నది. ఒక్కొక్క ఆవరణకు ఒక్కొక్క పురుషుడు ఆధారమై యున్నాడు. క్షరపురుషుడు తాను అక్షరపురుషుడనని (ఒకటిగా చేసి) వీరికి పరమ పురుషుడు మూలముగా గుర్తించవలెను. అప్పుడు పరమ పురుషుడు (ఎరుక) స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు లేనివాడుగా చెప్పబడుచున్నాడు. అందుచేత కల అని నిర్ణయించినారు. ఇట్టి స్థితియందు ఎరుక పురుషుడు (పరమ పురుషుడు) మొదటి పరిణామములో అక్షరపురుషుడు కలగాను, అక్షరపురుషుడు క్షరపురుషుని కలగాను చెప్పబడుచున్నది. ఈ కందార్థము నందు అక్షరపురుషుడు పరిపూర్ణ భావము ద్వారా మూలము గాని స్థానముగాని

లేదని గురువాక్యము ద్వారా దృఢపరచుకొన్నమీదట క్షర, అక్షర పురుషస్పర్శ లేకుండా పోవుచున్నది. ఏలననగా పరమ పురుషుడే కల కనుక ఆకల యందు తోచిన పురుషులు ఇరువురు కూడా కల వంటి వారే అగును. ఇది దృఢపరచుకొన్న స్థితియే మెలకువ అని చెప్పబడు చున్నది. వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: గట్టిగ దృఢపరచుకొనవలసి వున్నది. ఇట్టి భావము దృఢమగుటలో ఎప్పుడైనా ఎరుక అనే కల నీకు తోచినపుడు షోడశి వాక్యము ద్వారా (మూలము లేని గుర్తెరిగే శరీరము) లేనిదని దృఢపరచుకొన్న మీదట పరిపూర్ణ స్థితిని పొందుటకు వీలగుచున్నదని తెలియవలెను.

కం॥ చిత్తరువురంగుగోడల। నెత్తెరగునదెలసినావొనీవిప్పుడునీ।
చిత్తమునజగమునెరుకను। వుత్తబయుల్నట్లదెలియు
మూహతోడుతనూ। తెలిసి విడువు మూహజగములనూ
అత్తెరగునజేస్తే ఆవాలిమాటాను। యిత్తెరగని। తెలియనెవ
రుండేరటుమీద। నూహతోడుతనూ। తెలసివిడువు। మూహ
జగములనూ॥ **109**

## ప్రతిపదార్థము

ఊహతోడుతను = మనస్సుద్వారా గ్రహించు
చిత్తరువు, రంగు, గోడల = బొమ్మ అందలి రంగు అది కనిపించే గోడలు
ఎత్తెరగున తెలిసినావో = ఏవిధంగా కేటాయించి వేరు చేసి గుర్తించ గలుగు తున్నావో ఆవిధంగా
నీవిప్పుడు = ఈ చెప్పబడిన సందర్భంలో
నీ చిత్తమున = నీ మనస్సులో
జగమును = పంచభూతాత్మక మైన ప్రపంచమును
ఎరుకను = దీనికి కారణమైన అధిష్టానమును
వుత్త బయలును = దీనిని అంటకుండా యున్న పరిపూర్ణమును
అట్లు తెలియుము ఊహతోడుతను = పైనపేర్కొన్న మీదట విడి విడిగా కేటాయించి గుర్తించుము

తెలిసి విడువుమూహజగములను = పై విధముగా దృఢ పరచుకొని, దృఢపరచుకొన్న గుర్తును విడచి యుండుము
అత్తెరగునజేస్తి = అవిధంగా పాటిస్తే
అవలి మాటను = ఆ పైనున్న వస్తువును గూర్చి అనుభవము
యిత్తెరగని తెలియ = ఈ విధంగా ఉంటుంది అని చెప్పడానికి
ఎవరుండేరటు మీద = మిగిలియుండి చెప్పడానికి ఎవరూలేరు

## తాత్పర్యము

గోడమీద వేసిన ఒక చిత్ర లేఖనాన్ని పరిశీలనగా గుర్తించినపుడు కదలకుండా యుండునది గోడ, రంగులు వీటి సమ్మేళనంలో ఏర్పడిన బొమ్మలు విడి విడిగా వేటికవి గుర్తించినట్లుగా నీమనస్సులో కదలనిది ఉత్త పరిపూర్ణమని, పంచభూతాత్మకమైనది ప్రపంచమని, అందలి సమీకరణలో ఏర్పడిన వస్తువులుగా తోచునట్లు గుర్తించి రంగులు, వస్తువులు, పంచభూతములు ఎరుకగా భావించి గుర్తించిన గుర్తును విడిచి యుండుము. ఆపైన వున్న వస్తువు యొక్క ఉనికిని గూర్చి విచారించుటకు గుర్తించే గుర్తు లేకపోవడంచేత ఎట్టి అనుభవము వున్నదని గాని, లేనిదని గాని చెప్పుటకు వీలుకాదు. ఈ అంశములన్ని మనసుద్వారా స్పష్టముగా కేటాయించి దృఢపరచుకొనవలసి వున్నది.

కం॥ పరిపూర్ణ ములోలేనిదె। యెరుకొక్కటిదోచితనను యెరిగిన మృషగా। యెరుకే విడుచునదెట్లన। కరములు తమ పనులు తామె గడుపూనట్లుగనూ। యిదిగాకుంటె। కలదింకోటివినూ। మరికానిదామాటమంచిదీ మాటాని।పరిపారివిధమూల పలుకె పలకులపని। గడుపూనట్లుగనూ। యిదిగాకుంటె। కలదింకోటి వినూ॥ 110

## ప్రతిపదార్థము

పరిపూర్ణము లోలేనిదే = స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమందు లేకనె
ఎరుకొక్కటి తోచి = నేననే గుర్తు ఏర్పడి

 

తనను ఎరిగిన మృషగా = తాను లేనని, నిజముకాదని తెలుసుకొన్నమీదట (దృఢపరచుకొన్నమీదట)
ఎరుకె విడచునదెట్లన = ఈ నేననే గుర్తు ఎట్లు విడి పోవునంటె
కరములు తమ పనులు తామె గడుపునట్లుగను = చేతులు తమపనులు తామె ఒకదాని కొకటి సాయపడి చేసుకొన్నమీదట తమకు తామే ఎట్లు మాను కొని యుండునో
ఇదిగాకుంటే కల దింకోటివిను = ఇది కాకపోతే ఇంకోటి కలదు విను
మరికానిదామాట మంచిదీమాటా = మనము మాట్లాడే మాటలో మంచి చెడు రెండూ కలిసి ఎట్లు ఉత్పన్న మవుచున్నవో
పరిపరి విధముల పలుకె పలుకుల పని గడుపునట్లు గను = నోటినుండి వచ్చెమాటలు ఇది మంచిది కాదని ఇవి మంచివని ఎట్లు భిన్నరూపముగా ఏర్పడి వాటి పనులు అవి నిర్వర్తించునట్లుగా

## తాత్పర్యము

స్వత:స్సిద్ధమైన పరిపూర్ణములో నేననే ఎరుక ఏర్పడి తనకు తానే లేక పోవుచున్నది. ఎట్లనగా చేతులు తమ పనులు తామే చేసుకుని తమంతట తామే ఏవిధంగా మాను కొనుచున్నవో ఆవిధంగానే నోటినుండి వచ్చే మాటలు ఇది మంచిదని, మంచిది కాదని పల్కి ఎట్లు తోచు చున్నదో అనగా తమ పనులు తామే ఎట్లు జరుపుకొనుచున్నవో ఆవిధంగానే గుర్తెరిగే శరీరము తనకన్యమై పరిపూర్ణము వున్నదని, దానియందు తాను లేనని గురు వాక్యము ద్వారా దృఢపరచుకొని తనకు తానే లేక పోవుచున్నదని తెలియవలెను

కం॥ అంటదుకలమేల్కనుమే। ల్కంటదు కలనెన్నటికిని కడు
నిశ్చయమీ। రెంటి క్రియగుర్తు బయలుల। రెంటిని
రెండంటకుండు। రెంౘ్రెంటిలోనూ। కలయెరుకాలీ। రెండూ
మిధ్యేనూ। దంటాగమేల్క బయలుంటా వెప్పటికెరిగి।
గెంటూమా పైరెంట రెంటీ। కలయెరుకాల। రెంౘ్రెంటిలోనూ
కలయెరుకాలీ। రెండూ మిధ్యేనూ॥ 111

 

## ప్రతిపదార్థము

అంటదు కల మేల్కను మేల్కంటదు కల నెన్నటికిని = కలను మెళకువ మెళకువ కలను ఒకదాని కొకటి సంబంధపడియుండవు

కడు నిశ్చయము = ఇది చాలా స్పష్టముగా తెలియు చున్నది

ఈ రెంటి క్రియ గుర్తు బయలులల = ఈ విధంగానే పరిపూర్ణము ఎరుక

రెంటిని రెండంటకుండు = ఒకదాని కొకటి సంబంధపడి యుండవు.

రెండ్రెంటిలోను = ఈనాలుగు అంశాలలోనూ

కల ఎరుకాలీ రెండూ మిధ్యేను = కల ఎరుక అను రెండు శబ్దములు లేనివి

దంటాగ = చక్కగా

మేల్క బయలుంటా వెప్పటికి = పరిపూర్ణము, మెలకువ అను రెండంశములు

ఎరిగి గెంటూమా పైరెంట రెంట్నీ = బాగా దృఢపరచుకొని కల, ఎరుకాల రెండ్రెంటిని ఎరిగి విడిచి యుండుము

## తాత్పర్యము

కలను, మెళకువ, మెళకువ కలను ఒకదానికొకటి సంబంధపడి యుండవు. ఆవిధంగానే పరిపూర్ణము, ఎరుక ఒక దాని కొకటి సంబంధపడి యుండవు. ఇందు ఎరుకను కలతోను పరిపూర్ణమును మెళకువతోను పోల్చి చూసుకొన్నచో పరిపూర్ణము, మెలకువ నిలిచియుండును. ఎరుక, కల లేనివై యుండును. ఈ భావమును గట్టిగ దృఢపరచుకొని ఆరూఢత చెందవలసినది.

కం॥కలవేల్కలెరుకబయలుల। కిలసామ్యముజేసిచూడు
మీభ్రమదొలగున్। ఫలమేమి పెక్కుచదువుల। వలననుజప
యాగయోగ। వ్రతములవలనన్। శమదమముఖ। శతమూల
వలనన్। తలక్రిందు గాబడ్డ తనువునేగానన్న। కలమేల్కగని
తానెక్కడనిల్వనట్లౌను। వ్రతములవలనన్। శమదమముఖ।
శతమూలవలనన్॥ 112

కల మేల్క ఎరుక బయలులు = కలవలె ఎరుక నిజము కానిదని, మెలకువ వలె పరిపూర్ణము సత్యమని పైకందార్థంలో పోల్చి చెప్పినట్లుగ

ఇల సామ్యము చేసి చూడుము = పోలికచేసి దృఢపరచుకొనుము

ఈభ్రమతొలగున్ = ఎటువంటి భ్రాంతి నీకుండదు

ఫలమేమి పెక్కు చదువుల వలన = ఈ భావమును ఆరూఢపరచు కొనకుండా ఎన్నిచదువులు చదివినా

జప, యాగ, యోగ = జపము, యజ్ఞములు, ప్రాణాయామాది క్రియలు పాటించిన

వ్రతముల వలనన్ = ఎన్ని వ్రతములు చేసిన

శమ దమ మఖ శతమూల వలన = శమ దమాదులు మొదలైనవి కలిగించుకొన్నను

తలక్రిందుగాబడ్డ = ఘోరతపస్సుచేసి

తనువు నే గానన్న = వేదాంత విషయముగా కన్పిస్తున్నది అంతా అశాశ్వతమని తెలుసుకొన్న

కల మేల్కగని తానెక్కడ నిల్వనట్లాను = కల (ఎరుక) మెలకువను గని (పరిపూర్ణం) వున్నదని దృఢపరచుకొని తాను లేనని గ్రహించినమీదట

## తాత్పర్యము

కల వంటిది ఎరుకని, మెలకువ వంటిది పరిపూర్ణమని గురుప్రబోధ ద్వారా దృఢపరచు కొన్న వారికి సర్వ భ్రాంతి రహిత స్థితి కలుగును. ఈ పద్ధతి పాటించక ఎన్ని చదువులు చదివిన ఎన్ని జప తపములు ఆచరించిన, యజ్ఞయాగాది క్రతువులు జేసిన, ఎన్ని వ్రతములు ఆచరించినా ప్రాణాయామాది అష్టాంగ యోగములు పాటించిన, శమదమాది షట్కసంపత్తిని పొందిన, తలక్రిందుగా నిల్చుని ఘోర తపస్సాచరించినా, వేదాంతవిచారణద్వార స్థూలముగా ఇంద్రియ గోచరమగు సమస్తము నిజము కాదని, తత్వము ఒకటి సత్యమని తెలిసియున్న, జనన మరణ భ్రాంతి రహితమునకు పై మార్గములు సరిపోవని, గురుప్రబోధ ద్వారా కల, మెలకువ

ఎరుక పరిపూర్ణములను దృఢపరచుకొన్న మీదట సర్వభ్రాంతులకు కారణమగు గుర్తెరిగే శరీరము లేకపోవునని తద్వారా భ్రాంతి రహితము సిద్ధించునని తెలియవలెను

**కం॥ బల ధన విద్యా ధైర్యం। బులు చక్క ధనంబు సత్వబు ధ్యాద్యు తులన్। కలలో యివిలేని మను। ష్యుల జగమును తనను తాను। జూచిమానవుడూ। మేల్కొనెనేని। చూడాలే డొకడూ। కలమేల్క లెరుక బయలుల కట్ల జతగూర్చి। కల యెరుకలను దేశికులచే। వీడితే జాలు। చూచిమానవుడూ। మేల్కనెనేని। చూడాలేడొకడూ॥** 113

## ప్రతిపదార్థము

బల, ధన, విధ్యా, ధైర్యంబులు చక్కదనంబు, సత్వ బుధ్యాద్యుతులన్ = బలము, ధనము, విద్య, ధైర్యము, అందము,సత్వగుణము మంచి బుద్ధి మొదలైనవి

కలలో = స్వప్నములో

ఇవి లేని మనుష్యుల జగమును తనను తాను జూచి మానవుడు = జగత్తును, తనను తాను కలలో గాంచిన మనుష్యులు

మేల్కొనెనేని = మెలకువ పొందిన తరువాత

చూడాలేడు = విచారించగా లేకపోవుచున్నాడు

కల మేల్క, ఎరుక బయలులకు = కల మెలకువ ఎరుక బయలులకు

అట్లు జతగూర్చి = ఆ విధంగా సంబంధాన్ని విచారించి

కల ఎరుకలను = కల, ఎరుకలను

దేశికులచే వీడితేచాలు = గురువాక్యముద్వారా విడిచియుంటె చాలు

## తాత్పర్యము

బలము, ధనము, విద్య, ధైర్యము, చక్కదనము, సత్వగుణములతో కూడిన మంచి బుద్ధిగల సకల మానవులను, జగత్తును, తనను, తనకలలో కాంచిన మనుష్యులను మేల్కొనిన మీదట వీటిలో ఏ ఒక్కటిని చూడలేడు.

గురు అనుగ్రహము చేత కల ఎరుకలను మెలుకువ, పరిపూర్ణమునకు జతపరచి విచారించి కలవంటి ఎరుకను గురువాక్యముచే విడిచితే చాలు. ఇక ఎటువంటి భ్రాంతి కలుగదు.

కం॥ వినుము నేననుచు యెరిగే। తనువందున లేక।
బయలుతానిండినదొ। కనుగొను మదికనుగొని। తనువును
విడనాడుమింతె తడువేల నోయీ ఈ పనికింక గుడువేలనోయీ
అనుమానముంటే నీవరయుము శివరాములను।
దీక్షితులుజేసె। నచల గ్రంథమునంత। తడువేలనోయీ।
యీపనికింక గుడువేలనోయీ॥ 114

## ప్రతిపదార్థము

వినుము = శ్రద్ధగా విచారించుము
కనుగొను = వస్తునిశ్చయముగా విచారించుము
మదికనుగొని = మనసులో స్పష్టముగా నిర్ధారణ కావించుకొని
నేననుచు ఎరిగేతనువందునలేక = నేనను గుర్తెరిగే శరీరముతో సంబంధపడక
బయలుతా నిండినదొ = పరిపూర్ణము స్వతఃస్సిద్ధమైవున్నది
ఈతనువును విడనాడుమింతె = గుర్తెరిగే శరీరమును విడచి యుండుము
తడువేలనోయీ = ఆలస్యమెందుకు, ఆలస్యంచేయకు
ఈ పనికింకా గడువేలనోయీ = విడిచిపెట్టేపనికి గడువు అవసరంలేదు.
అనుమానముంటే = విడిచిపెట్టడంలో సందేహముంటే
నీవరయుము = నీవు చూడుము లేక విచారించుము
శివరాములను దీక్షితులు జేసె నచల గ్రంధమునంత = శివరామ దీక్షితులచే వ్రాయ బడిన గ్రంధము బృహద్వాసిష్టము

## తాత్పర్యము

స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణములో నేనను గుర్తెరిగే శరీరమునకు మూలముగాని, స్థానముగాని లేదు. పరిపూర్ణము తనకు తానే నిండి

నిబిడీకృతమై యున్నది. వస్తునిశ్చయపూర్వకముగా దీనిని దృఢపరచుకొనుము. ఆపైన ఏ గుర్తుచేత దృఢపరచుకొన్నావో ఆగుర్తును గురువాక్యము ద్వారా (షోడశి) విడువుము. ఇందు ఎట్టి ఆలస్యము పనికిరాదు. దీనిని విడచియుండుటకు ఎట్టి గడువు అవసరముండదు. ఇతరత్ర ఎటువంటి సందేహమున్న ఈ సిద్ధాంత కర్తయగు శివరామ దీక్షితులవారి చే రచింపబడిన "శివరామదీక్షితీయము" అను బృహద్వాసిష్టము అను అచల గ్రంధమునందు సమగ్రంగ వివరించి వున్నారు. దాని ద్వారానైనా విడచియుండుట ఎట్లో నీవు తెలుసుకొనుము.

కం॥ తిమిరారియందులేనిదె। తిమిరము తనుదానె వచ్చితే
జోనిధియౌ। తిమిరారియునికిగనుగొని। తిమిరముతానిలు
వనట్లు। తెలుసుకోరాదా। బయలెరుకాల। తెలిసియామీదా।
భ్రమరూపమైనట్టి బ్రహ్మాండమెరుకాల। భ్రమదీసివేసితెభ్రాంతి
బుట్టదుమళ్ళి। తెలుసరాకోరాదా। బయలెరుకాల।
తెలసీయామీదా॥ 115

## ప్రతిపదార్థము

తిమిరారియందు = చీకటికి విరోధి అయిన సూర్యుడు, సూర్యునియందు
తిమిరము = తమస్సుతోకూడినది చీకటి
తమకు తామే వచ్చి = తనకు తామే ఏర్పడి
తేజోనిధియౌతిమిరారి = తేజస్సుకు నిధియైన సూర్యుని
ఉనికి కనుగొని = ప్రకాశమును కనుగొని
తిమిరము తానిలువనట్లు· తెలుసుకోరాదా = చీకటి తనకు తానుగా లేకపోవుచున్నదని తెలుసుకొనుము
బయలెరుకాల తెలిసియామీద = ఎరుక పరిపూర్ణములను వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తించి
భ్రమరూపమైనట్టి = నిజముకానటువంటి
బ్రహ్మాండ మెరుకాల = అధిష్టాన మందున్న గుర్తును, శరీరమును

భ్రమదీసివేసితె = లేనివని దృఢపరచుకుంటె
భ్రాంతి పుట్టదుమళ్ళీ = తిరిగి ఎటువంటి భ్రాంతి కలుగదు.

## తాత్పర్యము

సూర్యుని యందు లేని చీకటి తనకు తానే వచ్చి సూర్యుని యొక్క ప్రకాశమును గుర్తించి తనకు తానే లేకపోవుచున్నది. ఆవిధంగానే పరిపూర్ణము, ఎరుకలను సూర్యుడు, చీకటిగా కేటాయించి తెలుసుకుని సర్వభ్రాంతులకు కారణమైన బ్రహ్మాండమందలి ఎరుకకు ఉన్నపరిపూర్ణమునందు మూలము గాని స్థానముగాని లేదని దృఢపరచుకుంటె ఎటువంటి భ్రాంతి కలగడానికి అవకాశంలేదు. తద్వారా జనన, మరణ భ్రాంతి రహిత స్థితి కల్గును.

కం॥ మరుపన తొలిమేనులుమూ। డెరుకన నాల్గవ శరీర మీ
రెండొక్కటే। పరిపూర్ణ మవలిదీవలి। యెరుకను గురువాక్కుచేత।
యెగరాజిమ్మిననూ। పోవునులేని। దెరిగేదేగిననూ।
యెరిగేదెలేకుండు యేమొ ఆవలజాడ। నెరిగేవారెవరింక।
యింతెచాలెరుకాను। యెగరాజిమ్మిననూ। పోవునులేని।
దెరిగేదేగిననూ॥ 116

## ప్రతిపదార్థము

మరుపన తొలిమేనులుమూడు = మరుపు అను శబ్దమునకు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు వస్తువుగా చెప్పబడుచున్నవి.
ఎరుకన నాల్గవశరీరము = ఎరుకను వస్తువునకు మహాకారణ శరీరమని చప్పబడును
ఈ రెండొకటే = ఎరుక మరుపు అనునవి
పరిపూర్ణమవలది = ఈ ఎరుక, మరుపు అనుదానితో సంబంధపడక వున్నది
ఈవలి ఎరుకను = ఈ రెంటిని విచారిస్తున్న గుర్తును
గురువాక్యముచేత ఎగరాజిమ్మినను = గురువాక్యముద్వారా లేదని

దృఢపరచుకొంటే
పోవును = రద్దవును
లేనిదెరిగే దేగినను = గుర్తించుటకు గుర్తె లేక పోయినచో
ఎరిగేదే లేకుండుయేమొ ఆవలజాడ నెరిగే వారెవరింక = గుర్తించుటకు తెలివే లేనపుడు ఉన్నదానిని గూర్చి ఉందనిగాని, లేదనిగాని నిర్ణయించుటకు వీలు లేదు.

## తాత్పర్యము

ఎరుక మరుపు లనునవి రెండు శబ్దములు. ఒక ఎరుకయొక్క స్థితిగతులు. వీటిని వస్తునిర్ణయంగా గుర్తించుటలో స్థూల సూక్ష్మ కారణ శరీరములు మరుపుగాను, మహాకారణ శరీరము ఎరుక గాను చెప్ప వచ్చును. ఈ రెంటితో సంబంధపడనిది పరిపూర్ణము. ఈ రెండు రూపములుగా కనపడు ఎరుకను గురువాక్యము చేత లేనిదని దృఢపరచుకుంటే పరిపూర్ణము స్వత:స్సిద్ధమైయుండును. గుర్తు లేనిదికావున ఉన్న పరిపూర్ణమును గూర్చి గుర్తించి చెప్పువారు లేరు. ఈ పద్ధతియే జనన మరణరహిత విధానమునకు సరిపోవును.

## మతనిరసన

మతి యనగాబుద్ధి. ఇది అంతరేంద్రియములలో అగ్నిభూత సంబంధమైనది. నిశ్చయాత్మకమైన శక్తికలిగినది. సత్యాన్వేషణలో మన మహర్షులు నిరంతర తపో నిష్టులై బుద్ధిని వికసింపచేసుకుని అలౌకికమైన ఆధ్యాత్మిక సత్యమును అనుభూతము గావించుకొని అతీంద్రియమైన బుద్ధి ద్వారా ఆలోచించి ఆనాటి దేశకాల పరిస్థితులకు అనుగుణ్యంగా సమాజశ్రేయస్సుకోసం కొన్నిమార్గదర్శకములను ఏర్పరచి యున్నారు. అవియే మతములుగా చెప్పబడుచున్నవి. కాలాను గుణ్యముగా వీటి లోపల మార్పులు చోటు చేసుకుని వున్నవి, మతముల యందు ఆధ్యాత్మిక విలువలతో పాటుగా నైతికమైన జీవన విధానము ప్రతిపాదింపబడియున్నది. వీటియందు భిన్నదృక్పథములు కూడా ఏర్పడినవి. సమగ్రమైన దర్శనములో

వీటిని సోపానములుగా పేర్కొనవచ్చు ఇందు బుద్ధి అత్యంత ప్రాధాన్యత వహించును. పరిపూర్ణబోధ సిద్ధాంత పద్ధతియందు ఈ మతములకు గాని వీటికి చరమ లక్ష్యములైన అధిష్టాన రూపమైన ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేదు. ఏలననగా మతి యనగా బుద్ధి గుర్తెరిగే తెలివికి లోబడి పనిచేయును. అందువలన గుర్తుకు సంబంధించిన అంశమునే ప్రతిపాదింప గలుగును గాని కేవలత్వము కల్గిన పరిపూర్ణపరబ్రహ్మమును ప్రతిపాదించుట వీలు బడదు. ఇట్టి మతములలో ప్రముఖమైనవి అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతము, శాక్తేయము, గాణాపత్యము, శౌరము, కాపాలికము, బౌద్ధము, జైనము, ఆస్తికము, నాస్తికము అను పెక్కు విధములుగా పేర్కొనబడుచున్నవి. వీటి అన్నిటియందు జన్మ కర్మలకు కారణమగు అధిష్టానమును గూర్చియే ప్రతిపాదింప బడినవియే కాని కేవలత్వము కల్గిన పరిపూర్ణ భావము సూచింపబడలేదు. ఈ భిన్న భావములన్నియు ఒకే వస్తువును గూర్చి ఏర్పడి యున్నవి. అదియే ఎరుక. దీని నిరసన యందుకాని పరిపూర్ణము స్వతఃస్సిద్ధము కాజాలదు. కావున ఈశీర్షికలో మతములు వాటి స్వరూప స్వభావములు, లక్ష్యనిర్దేశములు నిరూపిస్తు పరిపూర్ణభావమునందు వీటి ఉనికి ఏవిధముగా రద్దు అగుచున్నది సోదాహరణముగా చెప్పబడుచున్నది.

కం॥ వన్నియులై దొకచోటను। పన్నుగగలసినది హృదయ
పద్మంబనుచున్। యెన్నుదురు జనులు యెరుకం।
దున్నాదనిశ్చితులుబల్కు। చున్నావినుమ్మీ। తెలుసుటెమోక్ష।
మన్నావినుమ్మీ। వన్నెలన్నియు మీరి వున్నావస్తువజాడ।
నెన్నడె రుంగాక యన్నోరీతుల బల్కుచున్నావినుమ్మీ।
తెలుసుటె మోక్ష మన్నావినుమ్మీ॥ 117

## ప్రతిపదార్థము

జనులు = మతకర్తలు

వన్నెలు = రంగులు (ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు, సునీలము)

ఒక్కచోటను = ఒకేప్రదేశమునందు
పస్నుగ = అందముగ
కలిసినది = ప్రకాశించుచున్నది
హృదయపద్మంబనుచున్ = హృదయమను పద్మముగా
ఎన్నుదురు = నిర్ణయించినారు
ఎరుకందున్నాదని = గుర్తెరిగే శరీరము ఆపద్మమునందున్నదని
శృతులు పల్కుచున్నవిసుమ్మీ = శాస్త్రములు నిర్ణయించుచున్నవి
తెలుసుటె మోక్షమన్నావిసుమ్మీ = దానిని తెలుసుకొన్నచో మోక్షమని చెప్పుచున్నవి
వన్నెలన్నియుం మీరివున్నవస్తువుజాడ నెన్నడెరుంగక = ఈ రంగులన్నిమించివున్నపరిపూర్ణముయొక్క ఉనికి గుర్తించలేక
ఎన్నోరీతుల పల్కుచున్నావి సుమ్మీ = పెక్కువిధములుగా మతకర్తలు నిర్ణయించి వున్నారు.

## తాత్పర్యము

ప్రపంచమునందు మతవాదులు సృష్టికారణమగు జ్ఞానము (తెలివిలేక ఎరుక) ను గూర్చివస్తు నిశ్చయ పూర్వకముగా వారి సాంప్రదాయముల యందు నిర్ణయించుటలో ఎరుపు, తెలుపు, నలుపు, బూడిదరంగు, సునీలము లను 5 రంగులు ఒక్కచోట కలసిన స్థానము హృదయకమలమని, అట్టిదానియందు ప్రత్యగాత్మ (ఎరుక) నివసించునని నిర్ణయించి అందుకు అనువుగా శాస్త్రమందలి ప్రమాణవాక్యములద్వారా నిరూపించుకొనుచున్నారు. అట్టి వస్తునిశ్చయ జ్ఞానము కలుగుట మాత్రముచేతనె జీవన్ముక్తి సిద్ధించునని పేర్కొనుచున్నారు. ఇంతేకాని ఈ రంగులన్నియుమీరి ఆత్మను మించియున్న అచల పరిపూర్ణము యొక్క ఉనికిని గుర్తించలేక భిన్న భిన్న మత సిద్ధాంతములు ప్రపంచంలో ప్రచారములోనికి వచ్చినవి. ఈ కందార్థము తాలూకు భాగము స్థూలముగా విచారించిన వారికి పైన పేర్కొన్న 5 రంగులు ఎరుపు, తెలుపు, నలుపు,

ధూమ్రవర్ణము, సునీలము (చక్షురింద్రియ స్థానమగు) నేత్రస్థానమందు ప్రకాశించుచున్న ఆపోజ్యోతిరూపమే జ్ఞానమను ఎరుకకు స్థానముగా నిర్ణయించినట్లు తోచుచున్నది. శరీరమేర్పడిన తర్వాత నేత్రమునందు ఈ స్థానము నిర్ణయించుటకు వీలున్నది. కాని ఈ శరీరము ఏర్పడక పూర్వము దీని ఉనికిని సూక్ష్మముగా విచారించిన వారికి పిండాండమునకు ఉత్పత్తిస్థానమగు బ్రహ్మాండమునందు గల పంచభూతములు వాటికి గల రంగులన్నియు ఒకచోట కలసిప్రకాశించుస్థితి ఎరుకయొక్క (బ్రహ్మము) స్థానముగా నిర్ణయించినారు. ఈ విధానము ఎట్లో గురుముఖత: మాత్రమె తెలియవలసి వున్నది. ఇదియే ఎరుక యొక్క వస్తునిశ్చయ జ్ఞానము. జన్మ కర్మల కత్యంత మూలకారణము కూడా ఇదే. దీనితో సంబంధపడక కేవలత్వము కలిగి వున్నది పరిపూర్ణము. దాని ఉనికిని గురు ముఖత: మాత్రమే దృఢపరచుకోవలసి వున్నది. ఇట్టి విధానము కాక ప్రపంచములో జన్మరహిత విధానమునకు మత కర్తలు భిన్నభిన్న అభిప్రాయములతో మతములు సిద్ధాంతపరచియున్నారు.

కం॥ మతములవారలుతమన। మ్మతమైనటువంటి। శాస్త్ర
మర్యాదలచే। మితవేరు పరచుకొనిబహు। గతులను
కలహింతురట్టి। గతినీకేమిటికీ। చపలతజెందెస్థితి నీకేమిటికీ।
ప్రతిలేని యీ బట్టబయటుండ జూచిన। సతతములే నెరుక
లేదని నమ్ముమిక వారిగతినీ। కేమిటికీ। చెపలతజెందె।
స్థితినీకేమిటికీ॥ 118

## ప్రతిపదార్థము

మతము = మతి లేక బుద్ధిచేత నిర్ణయింపబడిన (అనుభూతము కావించుచున్న అంశము)

తమ సమ్మతమైనటువంటి శాస్త్రమర్యాదలచే = తాము ప్రతిపాదించిన సిద్ధాంతమునకు అనువుగా ఆచారవిచారములు,శాస్త్రప్రమాణములు ఏర్పరచుకొని

మితవేర్పరచుకొని = ఒక కాలమానముతో సాంప్రదాయముగా నిర్ణయించుకొని

బహు గతులను కలహింతురు = అనేక విధములుగా శాస్త్రార్థము చేస్తున్నారు

అట్టిగతి నీకేమిటికి = భిన్న భిన్న భ్రాంతులకు లోనయ్యేస్థితినీకెందుకు?

చపలత చెందేస్థితినీకేమిటికి = అట్టిమార్పు చెందేస్థితినీకెందుకు

ప్రతిలేని ఈ బట్టబయలుండజూచి = పరిపూర్ణ పరబ్రహ్మమును గురు వాక్యముచేత దృఢపరచుకొని

సంతతము = ఎల్ల వేళలా

లేనెరుక లేదని నమ్ము = మూలము లేని గుర్తెరిగే శరీరము లేనిదని దృఢపరచు కొనుము

## తాత్పర్యము

ప్రపంచంలో మోక్షాపేక్షకై కృషిచేయువారికి దేశకాలాను గుణ్యముగా మహాత్ములు అవతారపురుషులై విభిన్న మతములను మార్గాలుగా సూచిస్తూ అందుకనువైన జీవన విధానంలో పెక్కు ఆచార విచారాలు ప్రతిపాదించి యున్నారు. అట్టి వాటిలో అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతము, సౌరము, శాక్తేయము, గాణాపత్యము మొదలైనవి షణ్మతములుగా ప్రచారములో నున్నవి. ఇవి అన్నియు కలిసి ప్రపంచములో విభిన్న సాంప్రదాయములుగా ఏర్పడి, ఏకత్వ ప్రతిపాదన పోయి, భిన్న భిన్న దృష్టులు బలపడి, ఐకమత్యము దెబ్బతీసి మతకలహములకు దారి తీసినదిగా ఈ కందార్థము పేర్కొనుచు, పరిపూర్ణభావముయొక్క విలువను పేర్కొనుచు, ఇదొక మతము కాదని, మతి (బుద్ధికి) కూడా శక్తినిచ్చే జ్ఞానము, దానికి ఆవరణ మగు జ్ఞేయము, వీనిని గుర్తించు జ్ఞాత అను త్రిపుటిని మీరి గురువాక్యాను సారముగా మాత్రమే గుర్తింప వీలగు కేవలత్వము కలిగిన పరిపూర్ణము నందు దానికి మూలముగాని స్థానముగాని లేదని అనగా పరిపూర్ణమెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను ప్రతిపాదనతో పరిపూర్ణసిద్ధాంతముగా అచల ఋషులచే సిద్ధాంతీకరింపబడియున్నది. కావున జనన మరణ

భ్రాంతి రహితమునకు ఈ మార్గమె సరిఅయినదిగా గుర్తించి పాటించవలసినదిగా ఈ కందార్థమందు చెప్పబడుచున్నది.

కం॥ ద్వైతా ద్వైతవిశిష్టులు। సైతురు వినిసైసరెపుడు సైసకపిదపన్।
సైతురుక్రమమున వేరన। నాతతమతిజీవ శివులనవివినబోకూ।
నేబోధించి। నదివిడబోకూ। పూతామౌ బయలూను పొడజూచి
గురునీచె। ద్వైతాద్వైతవిశిష్టద్వైతా ములను మాను।
మవివినబోకూ।నేబోధించి। నదివిడబోకూ॥ 119

## ప్రతిపదార్థము

ద్వైతా ద్వైత విశిష్టులు = అద్వైతము = శంకరాచార్యులు, ద్వైతము = మధ్వాచార్యులు, విశిష్టాద్వైతము = రామానుజులు

సైతురు = చెప్పుదురు

వినిసైసరెపుడు = అంగీకరించరు

సైసకపిదపన్ = ముందు అంగీకరించక పోయినా

సైతురు = అంగీకరిస్తారు

క్రమమున = వరుస క్రమంలో పద్ధతిగా

వేరన = కేటాయించి

నాతతమతి జీవశివులన = పిండాండ గతమైన జీవుడు, బ్రహ్మాండ గతమైన ఈశ్వరుడు, వీరిఉనికికి ఆధారమైన జగత్తు

వినబోకు = గ్రహించబోకు (లెక్కలోకి తీసుకోకు)

నేబోధించినది విడబోకు = నే ప్రబోధించిన పరిపూర్ణబోధను విడిచి పెట్టకు

పూతామౌ = స్వత:సిద్ధమౌ

బయలును పొడజూచి గురునిచే = గురుముఖత: వస్తునిశ్చయపూర్వకంగా స్వత:సిద్ధమైన పరిపూర్ణమును వుండజూచి

ద్వైతా ద్వైత విశిష్టాద్వైతములను మానుము = పైనపేర్కొన్న మతముల యందలి భ్రాంతిని విడిచిపెట్టు.

# తాత్పర్యము

సృష్టి మీమాంసను అనగా జన్మకర్మలకు కారణమును సిద్ధాంతము చేయుపట్ల మతవాదులు ఆనాటి సాంఘీక ఆధ్యాత్మిక పరిస్థితులను, అవసరాన్ని, ప్రయోజనాన్ని గుర్తించి సిద్ధాంతపరచియున్నవి. ఇవన్నియు లోకకల్యాణాస్పదములె. ఇవినిర్ణయించుటలో పిండాండ గతమైన జీవుని గూర్చి, ఆధారమైన జగత్తు (పంచభూతములు) ఈ రెంటికి కేంద్రమైన ఈశ్వరుడు అనగా (జీవుడు + ఈశ్వరుడు + జగత్తు) మూడింటిని ప్రమాణముగా గైకొని విభిన్న కోణములలో భేదములతో మతవాదములు ప్రవర్తిల్లినవి. అవియే అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతముగా చెప్పబడుచున్నవి.

1. అద్వైతము :- దీనిని ప్రతిపాదించినవారు శంకరాచార్యులవారు. వీరి సిద్ధాంతము బ్రహ్మము సత్యం, జగత్తు మిధ్య. జీవేశ్వరులు ఇరువురు బ్రహ్మమె. ఏకమేవా అద్వీతీయం బ్రహ్మం ఇక ఇతరమైనది ఏమీ లేదు. (నేహనా నాస్తి కించన) ఈ భావమును దృఢ పరచుకొనుట యేముక్తి దశ.

2. ద్వైతము :- దీన్ని ప్రతిపాదించినవారు మధ్వాచార్యులవారు. జీవేశ్వరులు భిన్నవస్తువులనియు, జీవుడు కించిత్ లక్షములు కలవాడనియు, ఈశ్వరుడు సర్వజ్ఞలక్షణము కల వాడనియు, చీకటి, వెలుగు ఏకము కానట్లు వీరికి ఐక్యము కుదరదని, జగత్తు మిధ్యయనియు వీరి నిర్ణయము.

3.విశిష్టా ద్వైతము :- దీన్ని ప్రతిపాదించినవారు రామానుజులు. ఇందు ఈశ్వరుడు, జీవుడు, జగత్తు ఈమూడు సనాతనములు. శాశ్వతములు. ఏవీ అశాశ్వతములు కావు. జగత్తు ప్రళయ కాలమందు తన రూపమును మార్పు చెందుచుండును. జీవుడు అనాది సంస్కారములచే జనన, మరణము చెందుచుండును (ఈశ్వరుడు) అనగా ఆదినారాయణుడు. నవ విధ భక్తులచే పంచముక్తులద్వారా వైకుంఠ ప్రాప్తి కలుగును. వీరి జీవన్ముక్తి విధానము ఇది.

పైవిధముగా మతములు భిన్న భిన్న కోణములలో ప్రతిపాదింపబడి, ఏక

భావనకు బదులుగా, భిన్న భిన్న భావములకు చోటిచ్చి, భ్రాంతి కారకములైనవేకాని, భ్రాంతి రహిత విధానమును ప్రతిపాదింపలేవు. గురుముఖత: స్వత: సిద్ధమైన పరిపూర్ణమును దానియందు మూలము గాని స్థానముగాని లేకనే, భిన్న భిన్న వాదములకు చోటిచ్చు లేని ఎరుకను, లేనిదని దృఢపరచుకొనుటచే జనన మరణ భ్రాంతి రహిత విధానము కలుగు నని పరిపూర్ణ సిద్ధాంతము ప్రతిపాదించు చున్నది.

కం॥ కొందరుదశవిధనాదము। లందుననభపంచకం బునందున
చక్రా। లందున లక్ష్యధ్యానం। బందునహంసదు బుద్ధి।
నాటింతురోయీ యోగములందు। నటియింతురోయీ। అంది
సిద్ధుల చాతానందింతురుకొంద। రెందుకోమనసీ బోధందెనీ
వుంచహావు నాటింతురోయీ। యోగములందు।
నటియింతురోయీ॥ 120

## ప్రతిపదార్థము

కొందరు = ఇతర మతస్థులు

దశవిధ నాదము లందున = 1. చిణి నాదము 2. చించిణి నాదము 3. ఘంటా నాదము 4. మృదంగ నాదము 5. మేఘనాదము 6. శంఖ నాదము 7. వీణానాదము 8. తాళ నాదము 9. వేణు నాదము 10. భేరీ నాదము.

నభ పంచకంబునందున = ఆకాశ పంచక సంబంధమైన అంతరేంద్రియములు

1. జ్ఞానము 2. మనస్సు 3. బుద్ధి 4. చిత్తము 5. అహంకారము వీటి సాధనలైన

1. తత్వచింతన 2. యోగాభ్యాసము 3. మత సాంప్రదాయము 4. భక్తి సాధన 5. మంత్ర సాధన

చక్రాలందున = ఆధార స్వాధిష్టాన, మణిపూరక అనాహత, విశుద్ధ ఆగ్నేయ సహస్రారం కర్మచక్రం కాలచక్రం

లక్ష్యధ్యానంబందున = అంతర్ లక్ష్యము (లోచూపు) బాహ్యాలక్ష్యం (పైకి ) మధ్యలక్ష్యము

హంసంధు బుద్ధి నటింతు రోయి = హంస అనగా శ్వాస జీవహంసలు 21,600 దైవ హంసలు 3,400

యోగములందు = అష్టాంగ యోగము 1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5. ప్రత్యాహారము 6. ధ్యానము 7. ధారణ 8. సమాధి వీటికి అనుబంధముగా

మంత్రయోగము లయయోగము హఠయోగము రాజయోగము

అంది సిద్ధులచేత ఆనందింతురు = సిద్ధులనగా అణిమ మహిమ గరిమ లఘుమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశత్వము వశిత్వము

మనసీ బోధందె నీవుంచుము =పైనపేర్కొన్న మార్గము లందు నీమనసుంచక ఈ ప్రబోధయందే నీ దృష్టి ఉంచుము

## తాత్పర్యము

ప్రపంచములో పలు రకములైన భ్రాంతి విధానములు ప్రచారములో నున్నవి. అందు నాదోపాసనయే ప్రధానముగా మారి దశ విధనాదములను అనుసరింతురు. కొందరు సాధనలచే అనగా అంతరేంద్రియము లైన జ్ఞానము చేత తత్వసాధన, మనసు చేత యోగ సాధన, బుద్ధిచేత మతసాధన, చిత్తము చేత భక్తి సాధన, అహంకారముచేత మంత్రసాధన కావించుచు పలు భ్రాంతులకు లోనవుతున్నారు. మరి కొందరు చక్రభేదనముచే యోగప్రక్రియ ద్వారా ఆధారాది చక్రముల ద్వారా హంస గమనమును సాధించి నాదబిందు కళానుభవమును సాధించవలెనని ప్రయత్నించువారు. కొందరు అంతర్ లక్ష్యము, బాహ్యాలక్ష్యము, మధ్యలక్ష్యము అనుమూడింటి ద్వారా దృక్సాధన చేయువారు. కొందరు జీవహంసలను దైవహంసలుగా మార్చి ప్రత్యగాత్మను పరమాత్మగా భావించి పరమహంస భావము పొందు వారు. కొందరు యమనియమాది అష్టాంగ యోగములు అభ్యసించి మంత్ర, లయ, హట యోగముల ద్వారా రాజయోగమును సాధించువారు. ఇవిగాక

అణి మాది అష్ట సిద్ధులు సిద్ధింపజేసుకుని వాటియందు కలుగు మహత్తులచే ప్రాపంచిక సౌఖ్యము పొందువారు కొందరు. ఈవిధముగా భిన్నభిన్న లక్ష్యములతో, భిన్నభిన్న మార్గములలో కృషి చేయువారి భ్రాంతులలో నీవు పడక నేబోధించిన సర్వభ్రాంతి రహిత స్థితిని కలిగించు పరిపూర్ణభావమందే నీవు కృషిచేయుము అని భావము.

కం॥ కొందరుముద్రలుగనవలెనందురు। మరికొందరధిక
మందురుద్రష్టన్। కొందరు భజననేలెస్సని। యందురు
యివియన్ని। యెరుకె। నని తెలుసుకొనుమీ। నీకివియేల।
పనిలేదు వినుమీ। ముందూగపరిపూర్ణ మున్నాదిగనిగుర్తు।
నెందుండకుండ దాన్నె గరాగొట్టితెజాలు। నని తెలుసుకొనుమీ
నీకివియేల। పనిలేదు వినుమీ॥ 121

## ప్రతిపదార్థము

కొందరు ముద్రలు గనవలెనందురు = ముద్రలు = ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి

ద్రష్ట = దృశ్య పదార్థములను గుర్తించేవాడు

భజనలు = వాయిద్యములతో, మేళతాళాలతో జరిపే నామస్మరణలు

లెస్సని యందురు = గొప్పవి అని అందురు

ఇవి యన్నియు ఎరుకేనని తెలుసు కొనుము = ఇవన్నీ గుర్తెరిగే తెలివి సరిహద్దులను దాటి వెళ్ళవని తెలిసి కొనుము.

నీకివి ఏల = జనన మరణ భ్రాంతి రహితమునకు ఎందుకు?

పనిలేదు వినుమీ = ఏమాత్రము సరిపోవని తెలుసు కొనుము

ముందుగా = త్వరగా, వేగంగా

పరిపూర్ణమున్నాది గని = పరిపూర్ణము వున్నదని గుర్తించి

గుర్తు నెందుండకుండా = గుర్తెరిగే శరీరాన్ని ఏస్థానమందు లేనిదని

దాన్నెగరగొడితెచాలు = లేనిదని దృఢపరచుకొంటే చాలు

# తాత్పర్యము

ప్రపంచంలో మరికొందరు ముద్రలద్వారా మనస్సును ఏకాగ్రము చేసి శక్తివంతులగుటకు ప్రయత్నించెదరు.

1. ఖేచరి = కనులు మూసి అయినా తెరచి అయినా భ్రూమధ్య స్థానమందు దృష్టిని కేంద్రీకరించుట

2. భూచరి = నేత్రములు కదల్చక ముక్కు కొనయందు దృష్టి నిలిపియుంచుట

3. మధ్యమ = నాసిక (ముక్కు) మధ్యభాగమందు దృష్టిని లోపట కేంద్రీకరించుట

4. షణ్ముఖి = నేత్ర, శోత్ర, నాసికా రంధ్రములు 6 మూసి వుంచి భ్రూ మధ్యస్థానమున దృష్టిని నిలుపుట

5. శాంభవి = బాహ్యమందలి ఇంద్రియ దృష్టిని ఉపసంహరించి, ఎట్టి మనో వికారములకు లోనుగాక లోదృష్టిపూనియుండుట. ఇవి పంచముద్రలని చెప్పబడును. మరికొందరు కనిపించెడి దృశ్యపదార్థములన్నియు అశాశ్వతములనియు, వాటిని గుర్తించే ద్రష్ట శాశ్వతమని వీటిని దృశ్యము మాయ యని నిర్ణయించి వున్నారు. మరి కొందరు భజనలు అనగా వాయిద్యములతో సగుణ రూపముగా భగవంతుని గుర్తించి నామసంకీర్తనలు గావించుచూ కలియుగమునందు భగవంతుని గూర్చిన నామస్మరణ యే ముక్తికి మార్గమని యెంచుకొని ప్రయత్నించువారు. ఈ విధముగా మోక్షసాధన అనే లక్ష్యంతో ప్రపంచమందు పైన పేర్కొన్న మార్గముద్వారా చాలామంది ప్రయత్నించుచున్నారు. ఇవన్నియు జన్మకర్మలకు అత్యంత మూలకారణమగు ఎరుక (బ్రహ్మము) యొక్క పరిధి లోని వేనని సర్వభ్రాంతి రాహిత్యస్థితికి కృషి చేయువారికి వీటితోపనిలేదని గురుముఖత: పరిపూర్ణసిద్ధాంతమందు చెప్పబడిన క్రమంలో ముందుగా పరిపూర్ణము వున్నదని తరువాత దానియందు గుర్తెరిగే శరీరమేమీ లేదని దృఢపరచుకొని గుర్తెరిగిన తెలివిని విడచి యుండుటే చాలునని తెలిసి కొనవలెను.

కం॥ పంచాశదక్షరములప్ర। పంచముతానుద్భవించె ప్రణవాక్షరమం।
దంచుశృతులెన్నెదాన్నెరుకంచనినీ వెరిగి యెరుగు
మచలాముదీనన్। నిల్పకుమెరుక। నచలాము లోనన్।
చంచాలమతిచాతచతురాక్షరెక్కు। వంచెంచేద బెందుకుయిది
నమ్మకెరుగూమి। యచలాముదీనన్। నిల్పకుమెరుక।
నచలాములోనన్॥ 122

## ప్రతిపదార్థము

పంచషత్ అక్షరములు = 50 అక్షరములు
ప్రపంచము = శబ్ద ప్రపంచము
తానుద్భవించె ప్రణవాక్షరమై = అ, య, ర, వ, ల అనుబీజాక్షరముల చే ఏర్పడిన శబ్ద బ్రహ్మము అదియే " ఓం " కారము
అంచు శ్రుతులెన్నె = ఈ విధానము శాస్త్రములందు చెప్పబడుచున్నది
దాన్నెరుకంచని = దాన్ని గుర్తెరిగే శరీరమని (ఆత్మ)
నీవెరిగి = పై క్రమము నీవుదృఢపరచుకొని
ఎరుగు అచలము దీనన్ = స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమందు దీనికి మూలము గాని స్థానము గాని లేదని గుర్తించు
నిల్పకు మెరుక నచలములోనన్ = పరిపూర్ణమునందు, దీనికి మూలముగాని స్థానముగాని లేదని ధృడపరచు కొనుము
చంచాలమతిచేత = ఏకాగ్రము లేని బుద్ధిచేత (వస్తు నిశ్చయ జ్ఞానము తెలియక)
చతురాక్షరి = అ + ఉ + మ + దీర్ఘము, (మాతృకలు అ, ఉ, మ, లేక నారాయణ అనుశబ్దము
ఎక్కువంచెంచేద వెందుకు = గొప్పదిగా గుర్తించి అందుకై కృషి చేయుట ఎందుకు?
ఇది నమ్మకు = శబ్ద బ్రహ్మమే గొప్పదను మాట అంగీకరించకు

## తాత్పర్యము

సృష్టికి పూర్వము తాను తానై అచల స్థితిలో గాఢ సుషుప్తి అవస్థగా ఉన్న బ్రహ్మము నందు "నేన నేక మగుదును గాక" అను సూక్ష్మ సంకల్ప బలముచే ప్రధమ చలనము అనగా ఓం కారము అకార ఉ కార మ కార అర్థ మాత్రా స్వరూపమై, సత్వ, రజో, తమో గుణాత్మకమై అం, యం, రం, వం, లం బీజ యుక్తమై బ్రహ్మాండాకారము చెంది, ఒక్కొక్క బీజమునకు 10 అక్షరముల చొ॥ న పంచాషత్ రూపమై అనగా 50 అక్షరములతో శబ్దబ్రహ్మముగా పరిణామము చెంది వర్ణాత్మకము, ధన్యాత్మకము అను పేర్లతో సమస్త వాఙ్మయముగా ఏర్పడి యున్నది. ఇదియే ప్రణవ స్వరూపము. దీన్నంతయును ఎరుకగా గుర్తించుము. స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గుర్తించి దానియందు ఈ శబ్ద రూపకమగు ఎరుకకు మూలము గాని స్థానముగాని లేదని దృఢపరచుకొని వస్తునిశ్చయ జ్ఞానముచేత ఉన్నదంతయు శబ్దబ్రహ్మ మొకటేయని పరిపూర్ణబోధచే విడువ తగినదని తెలియక కొందరు ఈ ప్రణవ రూపమునే గొప్పదిగా భావించుచుందురు. ఇది భ్రాంతియేనని, మూలము లేనిదని దృఢపరచుకొనుము.

కం॥ కొందరుభూతములైదిటి। యందునచిత్తంబునుంతు
రధికములనుచున్। కొందరుయేమియులే దనియం।
దురుగుర్తెరుగుమిన్ని। యపశబ్దములెరా। యివినిలువాని।
వనితెలియవలెరా। యందారెన్నన్నానీ కెందూకుబయలూను।
ముందూగగని గుర్తునెందుండనివకవ్వి। యపశబ్దములెరా।
యివినిలువాని। వని తెలియవలెరా॥ 123

## ప్రతిపదార్థము

కొందరు = మతవాదులు

భూతము లైదిటి యందున = పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములందును

చిత్తంబునుంతురధికములనుచున్ = వీటిని గొప్పవిగా భావించి పూజించెదరు

కొందరు ఏమియు లేదని అందురు = పరిణామ క్రమములో ఈ పంచ భూతములు లేనివని, శూన్యమగునని

గుర్తెరుగుము = పై అంశములన్ని గుర్తించుము

ఇవి యన్ని అపశబ్దము లేరా = ఇవి యన్నియు నిజముకాదని భ్రాంతి రహితమునకు సరిపోవని

ఇవి నిలువానివని తెలియవలెరా = స్థిరమైనవి, శాశ్వతమైనవి కావని దృఢపరచు కొనుము

ఎందరెన్నన్నా నీకెందుకు = ఎవరు ఎన్ని మాటలు చెప్పినా వాటితో నీకు పనిలేదు.

బయలును ముందుగా గని = స్వత:స్సిద్ధమైన పరిపూర్ణమును గురుముఖత: గుర్తించి ముందుగా

గుర్తు నెందుండ నివ్వకు = మూలము లేని గుర్తెరిగే తెలివిని లేనిదని దృఢపరచుకొనుము

## తాత్పర్యము

పంచభూత వివేకము ద్వారా పృధ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము ఒకదాని కంటే ఒకటి సూక్ష్మతరమై, గొప్పవై పరమాత్మకు శరీర భూతముగా నున్నవని వాటిని పూజించెదరు. మరికొందరు ప్రళయ కాలములో ఈ పంచభూతము లొకదానియందొకటి లయమై శూన్యమై పోవుచున్నవని, ఆశూన్యమే శ్రేష్టమైనదని సిద్ధాంతీకరించుచున్నారు. ఇవన్నియు సమగ్రమైన విచారణచే చెప్పబడినవికావు. సత్యమును విచారించినవారికి ఇవన్నియు నిజము కావని, నిలువవని తెలియును. ఇట్టి నిర్ణయములెన్ని చెప్పినా భ్రాంతిరహిత విధానమునకు ఇవి సరిపోవని, భ్రాంతిరహిత విధానమందు కృషి చేయునీకు వీటితో పనిలేదని, క్రమములో పరిపూర్ణము స్వత:సిద్ధమై యున్నదని దానియందు భ్రాంతి కారణమగు

ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేనిదని దృఢపరచుకొనుము.

కం॥కొందరుకర్మమునే బా। గందురుమరికొందరెక్కువందురుతనువున్। కొందరు ప్రాణములధికము। లందురునీకిట్టి వట్టి। యాశాలేమిటికీ। వారితోపొందు। జేశేవేమిటికీ యెందారి మాటలనెన్నీ నయీబోధ। కిందీవేకానిపైకెక్కేవి గావిట్టి। యాశాలేమిటికీ। వారితోపొందుజేశేవేమిటికీ॥ 124

## ప్రతిపదార్థము

కర్మమునే బాగందురు = కర్మేంద్రియములచే చేయబడునది కర్మ

ఎక్కువందురు తనువున్ = దుర్లభమైనది మానవోపాధియని కొందరు

ప్రాణము లధికము లందురు = శరీరమందు నివసించుచు, శరీరమునభివృద్ధి పరచుటకు

సూక్ష్మమైన ప్రాణమాధారమని, అదిగొప్పదియని మరికొందరు

నీకిట్టి వట్టి ఆశలేమిటికి = అల్పమైన ఇట్టి ప్రయత్నములతో నీకు పనిలేదు

వారితో పొందు చేసేవేమిటికి = ఆయామార్గములయందు కృషిచేయువారితో నీకు స్నేహము కూడా పనికిరాదు.

ఎందారి మాట లెన్నీన = ప్రపంచంలో ఎన్నెన్ని మార్గాలు గొప్పవిగా చెప్పబడుచున్న

ఈ బోధ క్రిందవే గాని పైకెక్కేవిగావు = పరిపూర్ణ బోధతో సమానమైనవిగావు.

## తాత్పర్యము

కర్మేంద్రియము చేత చేయబడు కర్మ అనగా పని నిత్యము, నైమిత్తికము, కామ్యము, నిషిద్ధము అనునాల్గు విధములుగా శాస్త్రమందు నిర్ణయింపబడినది. ఇందు కామ్యకర్మ, నిషిద్ధకర్మలు జన్మ పరంపరలకు కారణమగుచున్నవి. నైమిత్తిక కర్మ చేసినా, చేయకున్నా ఏభ్రాంతి వుండదు. ఈనాల్గింటియందు నిత్యకర్మ చాలా విశిష్ట మైనది. ఇందు గర్భాదానము, పుంసవనము, సీమంతము, ద్యూతకర్మము, నామకరణము, అన్నప్రాసన,

చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్య దేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము అను 16 తరగతులుగా నిర్ణయించినారు. మరి కొందరు దుర్లభమైనది మానవోపాధి యని 84 లక్షల జీవరాసుల పరిణామక్రమంలో చివరిది యనీ, సత్యాన్వేషణతో మోక్షప్రాప్తియే దీనిలక్ష్యమని నిర్ణయించినారు. మరికొందరు శరీరము నందు విశిష్టమైనది ప్రాణమని, అహోరాత్రులు శరీరమందిది పనిచేయుచు లేక సంచరించుచు ఆకలి దప్పులు కల్గించి త్రిహృత్కరణి వృత్తిచే శక్తి వంత మగు చున్నదనియు, భిన్న మార్గములలో ప్రయాణం చేస్తున్నారు. జనన మరణ భ్రాంతి రహితమునకు ఇవి సరిపడవని, అట్టి లక్ష్యము గలవారితో నీ సహవాసము పనికిరాదని, ఎవరు ఎన్ని గొప్పవిషయములు ప్రతిపాదించిన పరిపూర్ణబోధతో సమానమైనవి, దీనిని మించినవి కావని గట్టిగా దృఢ పరచుకొనుము.

కం॥ కన్నులప్రక్కలవ్రేళ్ళిడి। తిన్నగభ్రూమధ్యమందు దృష్టి నిలిపియం। దున్నదివెన్నెలలో బయలన్నా కనుమందు రెరుకె అదినిలువదోయీ। తనువుతోబొయ్యేదని। దెలియు మోయీ యన్ని। తనువులువచ్చి యంరిగీనరఘుణకాక। వున్నా బయులుజూచి వుళ్లక్కెరుకనుమాను। మదినిలువదోయీ। తనువుతొబొయ్యేదని। తెలియుమోయీ॥ 125

## ప్రతిపదార్థము

కన్నుల ప్రక్కల వేళ్ళిడి = రెంటి కన్నుల ప్రక్క మధ్య వేలు, బొటనవేలుని ఆనించి

తిన్నగ = స్పష్టముగా

భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి = రెండు కళ్ళ మధ్య స్థానము నందు దృష్టిని కేంద్రీకరించి

అందున్నది వెన్నెలలో = ఆపైన గోచరించు మానసిక భావనలో కనిపించు ప్రకాశము (ఎరుక లేక బ్రహ్మము)

బయలన్నా కను మందురు ఎరుక = నాయనా అదే భగవంతునిగా గుర్తించుము

తనువు తోపొయ్యేదని తెలియుమోయీ = శరీరములో కన్పించునది శరీరముతో పాటుగా నశించునని గుర్తించుము

అదినిలువదోయీ = అది శాశ్వతము కాదని తెలుసు కొనుము

ఎన్ని తనువులు వచ్చి యరిగీన = సృష్టిపరిణామ క్రమములో జీవేశ్వరులు ఎన్ని మార్పులకు లోనైన

ఝణకాక = కదలక, మార్పుకు లోనుగాక

వున్నబయలునుచూచి = స్వత:సిద్ధమైన పరిపూర్ణమును గ్రహించి

వుళ్ళుక్కొరుకనుమాను = ఎరుక లేనిదని విడచి యుండుము

## తాత్పర్యము

దేహమే దేవాలయమని, జీవుడే సనాతనుడైన దేవుడని, అట్టి వాని స్థానము శరీరములో ఉన్నత భాగమైన నేత్రములు స్థానముగా నిర్ణయించి, బొటనవేలు, మధ్యవేలితో అట్టినేత్రములను అదిమిపట్టి భ్రూమధ్యస్థానమందు దృష్టి కేంద్రీకరించినచో ఒక ప్రకాశము గోచరించునని,అదియే ఆపోజ్యోతి యని, అందు పరమాత్మ గోచరించునని, యోగసాధనద్వారా ఇది సాధ్యమని కొందరు మతవాదులు పలుకు చున్నారు. ఇట్టి విధానము శాశ్వతము కాదని తెలుసు కొనుము. శరీరగతమైనది శరీరముతోపాటే నశించిపోవునని తెలుసు కొనుము. సృష్టి పరిణామక్రమములో జీవేశ్వరులుగా ఎన్ని పరిణామములు జరిగినా కదలక, వీటితో సంబంధపడక, స్థిరమై స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణ బయలు నుండ జూచి దానియందు గుర్తించే ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేదని దృఢపరచుకొనుము. ఇదియే భ్రాంతి రహిత విధానమునకు సరియైన మార్గము.

**కం॥ జనులాత్మానుభవంబై। ననుముక్త్యనిపల్కిరిట్లు నమ్మకు మెరుకే।
కనరాదెచ్చటగురుకృప। ననుభవమెవ్వరికిపైన।
ఆమాటనిజమో। అనుభవముళ్ళ। కీ మాటనిజమో వినజెప్పు
మీరెండు వివరించిపైమాట। వినినేముందరిబోధ వినిపింతు
వేవేగ। ఆమాట నిజమో। అనుభవముళ్ళ। కీమాట నిజమో॥ 126**

## ప్రతిపదార్థము

జనులు = మతవాదులు
ఆత్మానుభవంబైనను ముక్త్యని పల్కిరి = స్వస్వరూప సాక్షాత్కారము పొందుటయే మోక్షమని పల్కుచున్నారు
ఇట్లు నమ్మకు = ఈ విధానము నీవు అంగీకరించకుము
గురుకృప = పరిపూర్ణబోధచే
ఎరుకే = గుర్తెరిగే శరీరము (ఆత్మ)
కనరాదెచ్చట = స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు మూలముగాని, స్థానముగాని లేనిదగుచున్నది
అనుభవమెవరికి = సాక్షాత్కారమును అనుభవించువారెవ్వరు
పైన ఆమాట నిజమె =ఆత్మ సాక్షాత్కారమె మోక్షమను మాట నిజమా
అనుభవ ముళ్ళక్కీ మాట నిజమొ = పరిపూర్ణ బోధచే అనుభవించేవాడు అనుభవము లేనిది అను ఈమాట నిజమొ
వినజెప్పుమీరెండు = పైన పేర్కొన్న రెండంశములు గట్టిగ ఆలోచించుము
వివరించి పైమాట విని = నీచే చెప్పబడిన పై అనుభవమునువిని
నే ముందరి బోధ వినిపింతు వేవేగ = నీ మాట యందలి సత్యమును, వాస్తవమును, అవసరమును గుర్తించి సమగ్రమైన వివరణ ప్రబోధిస్తాను.

## తాత్పర్యము

వేదాంత విషయమునందు ఆత్మ ఒక్కటియే సర్వ భూతముల యందు గూఢముగా వ్యాపించి, సర్వ భూతాంతరాత్మయై ప్రకాశించుచు, ప్రత్యగాత్మ, పరమాత్మలుగా, పిండ బ్రహ్మాండములయందు వ్యాపించి

జీవరూపమై ప్రకటమగుచు, అంతర్యామిగ, ఈశ్వర రూపమున వ్యాపించివున్నాడని, ఈ రెంటినీ మహా వాక్యోపదేశముద్వారా ఏకత్వము గావించిన వారికి మోక్షము సిద్ధించునని ప్రతిపాదింపబడుచున్నది. ఇదియే జీవిత లక్ష్యముగా పేర్కొనబడుచున్నది. కాని పరిపూర్ణ బోధరీత్యా ఈస్థితిని ఎరుకగా చెప్పబడుచు పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఈ ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని దృఢ పరచుకొన్నవారికి ఉన్న పరిపూర్ణమునందు లేనిది ఎరుక గనక నిర్ణయించుటకు అనుభవించుటకు వేరెవ్వరు లేరని, గురుకృప చేగాని ఈ విధానము ఆరూఢము కాదని, పరిపూర్ణ సిద్ధాంతము నందు ప్రతిపాదింప బడుచున్నది. జనన మరణ భ్రాంతిరహిత విధానమునందు పైన పేర్కొన్న రెండంశములు స్పష్టముగా విచారించి నీ ఆరూఢతను చెప్పగల్గినచో ప్రబోధ విధానమునందు అవసర మున్నదీ లేనిదీ గుర్తించి పైఅంశములు నీకు దృఢపరచెదనని తెలియుము.

కం॥ తనను తాగనినమోక్షం। బనిపల్కిరిగాని జనులుఅది
నమ్మకుమీ। తనను తాబట్టబైటను। గనబోయితె తనకు దానె।
కానరాదోయీ। విశ్వముతనకు కానరాదోయీ తననుంచైనది
గనుక తాను విశ్వము రెండు। గనిపించుటుల్లక్కి। గావున
తనకుదా। కానారాదోయీ। విశ్వముతనకు। గానరాదోయీ॥ 127

## ప్రతిపదార్థము

జనులు = జనన మరణములకు లోనగుచున్నవారు

తనను తాగనిన మోక్షంబనిపల్కిరి = స్వస్వరూప జ్ఞానము పొందుటయే మోక్షమని నిర్ధారించుకొనుచున్నారు

అది నమ్మకుమీ = ఇవిప్రమాణములని నీవనుకోకు

తనను తా బట్ట బైటను గనబోతె = స్వతఃసిద్ధమైన పరిపూర్ణమునందు గుర్తించే లక్షణము గల్గిన తనను తాను ఎరిగినపుడు

తనకు తానే కాన రాదోయి = తనంతట తానే లేక పోవుచున్నది

విశ్వము తనకు కానరాదోయి = తనచే తెలియబడు ప్రపంచము కూడా కనబడకుండా పోవుచున్నది.

తననుంచైనది గనుక = పిండ బ్రహ్మాండాకారములుగా తానే పరిణామము చెందినది కనుక

తాను, విశ్వము రెండు కనిపించుటుళ్ళక్కి = ఎరుక, ఎరుక పరిణామమగు ప్రపంచము రెండు విడదీయ రానివి కనుక రెండును లేకపోవు చున్నవి

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు స్వస్వరూప సాక్షాత్కారమునకై తత్వమస్యాది మహావాక్యములు ప్రతిపాదింపబడి, జీవైశ్వరైక్యము ద్వారా అభేద జ్ఞానము కలిగి స్వస్వరూప జ్ఞానము పొందగలరని, అదియే మోక్ష స్థితియని, అద్వైతశాస్త్రము నందు ప్రతిపాదింపబడుచున్నది. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా వస్తునిశ్చయ పూర్వకముగా విచారించినచో స్వతఃసిద్ధమైన పరిపూర్ణమునందు తన నిజరూపమైన ఆత్మ లేక ఎరుక లేనిదగు చున్నది. అట్టిది లేకపోవుటచే తన పరిణామ క్రమములో ఏర్పడిన జీవేశ్వర జగత్తు కూడా లేకపోవుచున్నది. ఒకటి గావున్నది రెండుగా తోచబడుచు, రెండుగా వున్నది ఒకటిగా గుర్తించి (వస్తునిశ్చయముచే) పరిపూర్ణము నందు వీటికి మూలము గాని, స్థానము గాని లేదని దృఢ పరచుకొన్న వారికి ఈ రెండు లేనివే అగుచున్నవి. ఇదియే భ్రాంతి రహిత స్థితి అని తెలుసు కొనుము.

## ఎరుక పరిణామము బయలు గుర్తెరుగునా

పరిపూర్ణమునకు ఎరుకకు ఎట్టి సంబంధము లేదని "బయలెరుకల అత్యంత విభిన్న తత్వము" అను శీర్షిక ద్వారా స్పష్టము చేయబడినది. అందుకు అనువుగా 'బయలాకాశముల ఆరోపిత తాదాత్మ్యము' అను శీర్షిక ద్వారా వీటి తేడాను వస్తు నిశ్చయపూర్వకముగా దృఢ పరచబడినది. సిద్ధాంత రీత్యా అది అనగా పరిపూర్ణము ఇది అనగా ఎరుక. అది యిది కాదు, ఇది అది కాదు. దీనిని "పూర్ణమదః" అనుమంత్రము ద్వారా విచారించడం జరిగింది. ఎరుక యందు ఎరుక సత్యము. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా మాత్రమే ఉన్నది పరిపూర్ణము, లేనిది ఎరుక అగుచున్నది. కాని ఈ శీర్షికలోస్వతః సిద్ధమైన పరిపూర్ణము నందు ఎరుక ఉనికిని అంగీకరించక పోయినా,

ఎరుకయందు ఎరుక ఉనికి, దాని పరిణామ క్రమమును వివరించుటపట్ల బీజ వృక్ష న్యాయముద్వారా ఈ అంశము ఈ శీర్షిక యందు వివరింపబడుచున్నది.

కం॥ విత్తేచెట్టైపుట్టును। విత్తేవిత్తనమురీతి వెలయును ధరపై విత్తుకు
చెట్టుకువేరే। విత్తనమొకటున్నదనిన వినగూడదోయ్।
యీతనకుదాబుట్టునువినవోయీ। విత్తూచెట్టుల రెంటివిధ
మూభూమెరుగాన ట్లుత్తాబయలెరుగాదు సత్తూ చిత్తులరెంట్ని
వినగూడదోయీ తనకుతా బుట్టును వినవోయి॥ 128

## ప్రతిపదార్థము

విత్తే చెట్టైపుట్టును = విత్తనమే వృక్షాకృతి వహించును

విత్తే విత్తనమురీతి వెలయును ధరపై = సూక్ష్మరూపమైన విత్తనము వృక్షాకృతిచెంది తన పరిణామక్రమములో మరల విత్తనాకృతిని వహించును (భూమి ఆధారంతో)

విత్తుకు, చెట్టుకు వేరే విత్తనమొకటున్నదనిన వినగూడదోయి = పై విధముగా ఏర్పడిన పరిణామముతో చెట్టుకు వేరే ఇంకొక విత్తనమున్నదని అనకూడదు

తనకు దాబుట్టును వినవోయీ = తమకు తాముగా ఒక దాని కొకటి కారణా కార్యము కలిగియుండును.

విత్తు చెట్టుల రెంటి విధము భూమెరుగనట్లు = ఈ బీజవృక్ష న్యాయ పరిణామక్రమము భూమితో ఎట్లు సంబంధ పడక జరుగుచున్నదో

అట్లుత్తా బయలెరుగదు సత్తు చిత్తుల రెంట్ని = ఆవిధముగా స్వత:సిద్ధమైన పరిపూర్ణము చిద్రూపమైన ఎరుక, సద్రూపమైన బ్రహ్మాండముల యొక్కపరిణామమును గుర్తించదు.

## తాత్పర్యము

బీజ వృక్ష న్యాయమును శాస్త్రీయముగా పరిశీలించినచో విత్తనము తనయందు గల సృజనాత్మకమైన విజృంభణా శక్తిచే వృక్షముగా పరిణమించుచున్నది. పరిణమించి ఆ పరిణామక్రమంలో తిరిగి మరలా

విత్తనాకృతి వహించుచున్నది. ఈ సంఘటనల క్రమమునకు పృధ్వి ఏవిధముగా సంబంధపడక యున్నది. కారణము విత్తనము, కార్యము వృక్షము. మరల కారణము విత్తనముగా మారును. ఆది అంత్యములందు విత్తనములకు విత్తనము కారణమగుచున్నది. ఇందు మధ్యలో వృక్షాకృతి గోచరించు చున్నది. పరస్పరము ఇందు ఒకదానికొకటి కారణములుగా తోచుచున్నవే గాని, వీటికి మూడవ కారణము కన్పించదు. విత్తనమందు చెట్టు, చెట్టు యందు విత్తనము అన్యోన్య ఆశ్రితమై ఒకదాని యందు ఒకటి ఇమిడి వుండును. ఈ పరిణామము భూమితో ఏమీ సంబంధపడక జరుగు చున్నది. ఈ విధంగానే స్వత:సిద్ధమైన పరిపూర్ణమునకు ఎరుకనే విత్తనమును దాని పరిణామ రూపమగు బ్రహ్మాండమనే వృక్షము, దాని నుండి పిండాండమనే గుర్తు ఒకదాని యందు ఒకటి ఇమిడి పరిణామక్రమమునకు లోనగుచున్నవి. పరిపూర్ణము నకు వీటితో ఎట్టి సంబంధము లేదు అని తెలియ వలెను.

కం|| **చెట్టేమూలమువిత్తుకు। చెట్టుకుమూలంబు విత్తుక్షితి**
**పైరెండున్। పుట్టినచచ్చినరెంటిని। ఘట్టిగతానెరుగకుండు।**
**గదరాయినేలా। నీవీరీతి। గనుగొనవేలా। పుట్టాచుగిట్టాచు**
**పొలుపొందు తనువెరుక। లిట్టివిచిత్రాములెన్నాడెరుగదు**
**బయలు। గదరాయి నేలా। నీవీరీతి కనుగొనవేలా||**

## ప్రతిపదార్థము

చెట్టే మూలము విత్తుకు = విత్తనమునకు చెట్టేమూలము గాను ఆధారముగాను తోచుచున్నది
చెట్టుకు మూలంబువిత్తు = వృక్షానికి విత్తనము మూలముగాను ఆధారముగాను కన్పడుచున్నది.
క్షితిపై = భూమిపై
రెండు పుట్టినా చచ్చినా = ఉత్పత్తి, స్థితి, నాశనములకు లోనైయున్న
రెంటినీ = పై క్రమాన్ని
గట్టిగ = ఏమాత్రము

తానెరుగ కుండు గదరా ఈనేల = ఈ భూమి ఏవిధముగా గుర్తించుట లేదో
నీవీ రీతి కనుగొనవేలా = వస్తునిశ్చయ పద్ధతిగ పైన పేర్కొన్న క్రమము నీవు దృఢపరచు కొనుము
పుట్టుచు గిట్టుచు పొలుపొందు తను వెరుకలు = వృద్ధి, క్షీణములు క్రమముగా పొందు శరీరము, గుర్తులు
ఇట్టి విచిత్రములెన్నడెరుగదు బయలు = ఈ పరిణామ క్రమముతో ఏమీ సంబంధపడక ఉన్న పరిపూర్ణము

## తాత్పర్యము

చెట్టుకు మూలము విత్తనము, విత్తనమునకు మూలము చెట్టుగాను, ఒకదాని కొకటి కార్యాకారణములుగా కనవడుచున్నవి. ఈ పరిణామక్రమములోజరుగు ఉత్పత్తి, స్థితి, నాశనములకు భూమి ఎట్టి సంబంధము కలిగి యుండదు. ఈ విధముగా సృష్టి కారణమగు ఎరుక పిండ బ్రహ్మాండములుగా మార్పు చెందుచు, ఆవిర్భావ, తిరోభావములు చెందును. ఈ క్రమమునకు పరిపూర్ణముతో ఎట్టి సంబంధములేదు. ఒక దాని కొకటి మూలము ఆధారమై వున్నవి. కాని ఈ రెంటికీ మూలమేమి అని విచారించగా ఉన్నపరిపూర్ణము నందు ఎరుకకు మూలము గాని స్థానము గాని లేదు. అందుచేత ఇవి లేనివి అని తెలియవలెను.

## పరిపూర్ణబోధ

పరిపూర్ణ బోధ అనగా పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను మాను అను సిద్ధాంతరీత్యా, ఇంతవరకు జరిగిన క్రమములో పై అంశములను వేటికవి విడమరచి, వస్తునిశ్చయ పూర్వకముగా గుర్తింపజేసి సిద్ధాంత పద్ధతిని ఉపదేశక్రమములో దృఢపరచుట జరిగినది. విడివిడిగా కేటాయింపబడి చెప్పబడిన అంశములన్నియు ఒకచోట చేర్చి దృఢ పరచ బడవలెను. ఏలననగా సిద్ధాంత పద్ధతి యందు పరిపూర్ణము, ఎరుకలను యెరుగుట అను అంశము ఉపదేశ పద్ధతి యందు స్పష్టముగా చెప్పబడి ఎట్టి భ్రమలకు లోనుగాకుండా ఉన్నదున్నట్లుగా గ్రహించినమీదట

ముఖ్యాంశమైన ఎరుకను విడచుట అను క్రమము చెప్పబడుచున్నది. ఇందు ఎరిగినమీదట విడచుట అనునది సాధ్యమగు చున్నది. ఈ అంశములన్నియు దృష్టిలో వుంచుకొని బోధయొక్క సమగ్ర రూపము ఈ శీర్షిక ద్వారా మరల దృఢ పరచు కొనుటకు ప్రయత్నము జరుగుచున్నది.

కం॥ భాగవతులనారాయణ। యోగికిజానకి యనేటియు
విదామణికిన్। బాగుగపుత్రుడనైభూ। భాగమునన్ కృష్ణనను చు।
ప్రభవించినానూ। అనంతికి। ప్రభువునైనానూ। నాగురువు
కృపచేత నయమైనయీబోధ। నేకంటికన్నంతనీకు దెల్పుట
కిట్లు। ప్రభవించినానూ। అనంతికి। ప్రభువూనైనానూ॥ 130

## ప్రతిపదార్థము

భాగవతులు = భక్తి, జ్ఞానము, వైరాగ్యము, తత్వజ్ఞానము ముముక్షత్వము అను అంశములయందు నిష్ణాతులైనవారు

నారాయణయోగికి = నారాయణ అను పేరుగల తండ్రికి

జానకి అనేటి యువిదామణికిన్ = జానకి అను పేరుగల తల్లి

బాగుగ పుత్రుడనై = శ్రేష్టమైన ఉపాధితో కుమారుడనై

భూ భాగమున = ఈ ప్రపంచములో

కృష్ణ ననుచు ప్రభవించినాను = కృష్ణదాను అను పేరుతో వ్యవహరింపబడుచున్నాను

అనంతికి ప్రభువునైనాను = అనంతలక్ష్మి అను భార్యను కలిగి యున్నాను

నాగురుకృపచేత = నాగురుమూర్తియైన పరశురామ సీతారామ స్వామి వారి అనుగ్రహము చేత

నయమైన = గొప్పదైన (శ్రేష్టమైన)

ఈ బోధ = ఈ పరిపూర్ణ బోధ

నే కంటి = నేను గ్రహించినాను

కన్నంత = దృఢపరచుకున్నదంతా

నీకు దెల్పుటకు = లోక కల్యాణమునకై మీఅందరికీ చెప్పుటకై

## తాత్పర్యము

ఈ భూమండలమందు భాగవతుల అను ఇంటి పేరుతో ఒక శ్రేష్ఠమైన బ్రాహ్మణ వంశమునందు నారాయణుడు, జానకి అను పుణ్యదంపతులకు కృష్ణుడు అనే పేరుతో ఒక పుత్రుడుగా జన్మించినాను. అనంత లక్ష్మి అను పేరుగల సహధర్మచారిణిని (భార్యను) కలిగి యున్నాను. గురు శ్రేష్టులైన పరశురామ సీతారామ స్వామి దయకు పాత్రుడనై అత్యంత దుర్లభమైన ఈ పరిపూర్ణబోధను వారి అనుగ్రహముచే దృఢ పరచుకొని లోక కల్యాణము కొరకై మీ అందరకు ఈ భావము దృఢపరచుట ఒక ముఖ్యమైన కర్తవ్యముగా నిర్ణయించుకొని ఈ రచన ప్రారంభించినాను అని తెలియ వలెను.

**కం॥ యెరుకతనకుందావిడిపో। దెరుకను విడిపించలేరు యెవ్వరుధాత్రిన్। గురుడొకడుదప్ప గురునకు। పరిచర్యయొనర్చి బోధ। పద్ధాతివినినన్। తిరిగిరాని। పద్ధతిగనినన్ పరిపూర్ణమెరుక యేర్పరుచ నెరుకలేక। హరిని స్వప్నము గన్న కరిభ్రమగ్గినట్లొయీ। పద్ధతివినినన్। తిరిగిరాని। పద్ధతిగనినన్॥**

**131**

## ప్రతిపదార్థము

ఎరుక తనకు తావిడిపోదు =గుర్తెరిగే శరీరము దానంతట అది విడిపోదు

ఎరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ = ఈ భూమండలంలో దానిని ఎవరు విడిపించలేరు

గురుడొకడు తప్ప = పరిపూర్ణబోధయందు ఆ రూఢపరచుకొన్న సాంప్రదాయక గురువు తప్ప

గురునకు పరిచర్య యొనర్చి = గురుమూర్తికి స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూష చేయుచు

ఈ బోధ పద్ధతి వినినన్ = క్రమములో పరిపూర్ణ బోధను ఆరూఢ పరచుకొన్నవారికి

తిరిగిరాని పద్ధతి గనినన్ = పునరావృత్తికి రాని భ్రాంతి రహిత విధానమును దృఢపరచుకొన్నవారికి

పరిపూర్ణము ఎరుక ఏర్పరచ ఎరుకలేక = వస్తునిశ్చయ పూర్వకముగా ఎరుక, పరిపూర్ణము కేటాయించి తెలుసుకొన్నమీదట వీటిని గుర్తించిన గుర్తు లేక పోవును.

హరిని స్వప్నమునగన్న కరిమగ్గినట్లౌ = కలయందు సింహమును జూచిన ఏనుగు నశించిన విధముగా

## తాత్పర్యము

పరిపూర్ణ బోధయందు పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను విడచుట అను మూడుఅంశములు చాలా ముఖ్యమైనవి. గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా మాత్రమే ఇవి దృఢపరచు కొనవలసి వున్నది. పైక్రమములో ఎరుకను విడచుట అనుఘట్టము చాలా సున్నితమై ముఖ్యమై యున్నది. ఈలక్ష్యమును చేరవలెనన్నచో శిష్యుడు విధిగా గురువు నివసించు స్థానమునందె నివసించుచు స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూష లొనర్చుచు, గురువాక్యానుసారముగా జీవిస్తూ, గురుకృప పొందిన గాని ఇది సాధ్యపడదు. అట్లు పొందిన వారికి పరిపూర్ణము నుండి ఎరుక ఏర్పరచుట అనువిషయములో ఎరుక లేకపోవుట ఏవిధముగా సాధ్యమగునని సంశయము కల్గినపుడు అందుకు ఉదాహరణగా ఏనుగు తన స్వప్నానుభవములోసింహమును జూచి భయం భ్రాంతి చెంది మరణించినట్లుగా భావించి, అట్టి గాఢమైన భావనా బలముచే మిగిలిన అవస్థలయందు జీవించియుండికూడా క్రమక్రమముగా తనకు తానుగా నశించి పోవుచున్నది. ఈ విధముగా గురువేల్కచేత ఎరుక విడిపోవుచున్నదని తెలియవలెను.

కం॥ నేనెవ్వడనను జీవుడు। నేనే నేననును శివుడుయీ రెండనకన్।
తానుండు నచలమివీటిని। నేనెరిగరిగినను పైది। నేనెట్లనీనీ।
నేననకున్న। తానెట్లనీనీ। నేనన్న దాంట్లోదెనీనా ప్రసంగాము।

**తానన్నదాంట్లోనే తలపోయవలెనిట్లు। నేనెట్లనీనీ నేననకున్న। తానెట్టనీనీ॥ 132**

## ప్రతిపదార్థము

నేనెవ్వడనను జీవుడు = పిండాండమందు అజ్ఞాన విశిష్టమైన చైతన్యమును జీవుడని చెప్పబడును

నేనే నేనను శివుడు = బ్రహ్మాండమందు మాయావిశిష్టమైన చైతన్యము ఈశ్వరుడని చెప్పబడును

ఈ రెండనకన్ = ఈ రెంటితో సంబంధ పడక

తానుండునచలము = అచల పరిపూర్ణము స్వత:సిద్ధమై యుండును

వీటిని = పైన పేర్కొన్న అంశములను

నేనెరిగినను = నేను వస్తునిశ్చయపూర్వకముగా ధృఢపరచుకొన్నమీదట

పైది నేనెట్లనీని = ఈ రెంటికీ సంబంధపడని పరిపూర్ణము వున్నదని నేనెట్లనగలను?

నేననకున్న తానెట్లనీనీ = నేను లేకపోతే తనకు తానుగా ఉండునని ఎట్లు చెప్పగలను?

నేనన్నదాంట్లో దేనీనా ప్రసంగము = నేనను గుర్తు యుండినగాని ఉన్నది, లేనిది అను అనుభవపూర్వకముగా నిర్ణయము

తానన్న దాంట్లోనే తలపోయ వలెనిట్లు = తాను, నేను అనుగుర్తులేకుండా (ఉన్నది, లేదు) ఉన్నపరిపూర్ణమునందు ఇట్టి ఆరూఢత పొందవలెను.

## తాత్పర్యము

అవిద్యా(అజ్ఞానము) ప్రతిబింబితుడు జీవుడని, ఇతనికి తాను ఎవ్వరో తనకి తెలియదు. మాయా ప్రతిబింబితుడు ఈశ్వరుడు. ఇతనికి జీవుని గురించి, తనగురించి కూడా తెలియును. (తత్వమసి) ఈ రెండుగుర్తులు లేకుండా స్వత:సిద్ధమైయున్నది అచల పరిపూర్ణము. ఈ బేధములను గురుముఖత: వస్తునిశ్చయపూర్వకముగా దృఢపరచుకొన్నమీదట ఉన్నది పరిపూర్ణము, లేనిది ఎరుక అనునిర్ణయ

విధానమునందు ఉన్నవస్తువుయందు లేనితాను చేయునిర్ణయముకూడా లేనిదేయని, నిర్ణయములన్నియు అనగా పరిపూర్ణము ఉన్నదని, ఎరుక లేనిదని మొదలగునవి అన్నియు ఎరుక యందేగాని పరిపూర్ణమునందు ఏ నిర్ణయములు పనికిరావని తెలియ వలెను.

**కం॥ తొర్రలు తొమ్మిదిగలమే। న్మర్రికి యొక రెంటిలోన। మఱ్ఱలు నాల్గున్। డెఱ్ఱది తెల్లది నల్లది కఱ్ఱెది। దానగ్రమందు। గలదొక్క తూటూ। అది యెరుకానె। పులుగుండెచోటూ। కుఱ్ఱా గురుబోధానె గొడ్డాలిచేబూని। మఱ్ఱిపులుగుల రెంట్ని మలచికొట్టర పోని। కలదొక్కతూటూ। అది యెరుకానె। పులుగుండెచోటూ॥ 133**

## ప్రతిపదార్థము

కుఱ్ఱా = ఓశిష్యుడా లేక నాయనా

తొర్రలు తొమ్మిది గల మేన్మఱ్ఱికి = తొమ్మిది పొరలతో కూడిన మఱ్ఱిచెట్టనే శరీరంలో

ఒకరెంటి లోన = ఒకరెండు పొరలలో

మఱ్ఱలు నాల్గున్ = నాలుగు రంగులతో కూడిన వేరే చిన్నపొర యుండును

ఎఱ్ఱది, తెల్లది, నల్లది, కఱ్ఱిది = ఎరుపు, తెలుపు, నలుపు, బూడిదరంగుతో కూడిన

దానగ్రమందు గలదొక్కతూటు = వీటిపై భాగమున సునీల రంగుతో వేరొక రంధ్ర ముండును

అది ఎరుకానె పులుగుండే చోటూ = ఆస్థానమే ఎరుకను పక్షిఉండే చోటు

గురుబోధనె గొడ్డలి చేబూని = ఉన్నది పరిపూర్ణము లేనిది ఎరుక అని దృఢపరచగల్గు గురు ప్రబోధ యనుగొడ్డలిచే

మఱ్ఱి పులుగుల రెంట్ని మలచి కొట్టరపోని = ఆవరణరూపమైన మఱ్ఱిచెట్టును, గుర్తురూపమైన పక్షిని విడదీసి లేనివని దృఢపరచుకొనుము.

## తాత్పర్యము

పరిపూర్ణబోధయందు చివరి అంకము ఎరుకనువిడచుట. విడచుటకు ముందుగా వస్తునిశ్చయపూర్వకముగా స్థాన, స్వరూప, స్వభావములతో దానిని గూర్చి సమగ్రంగా తెలియవలసి ఉన్నది. ఈ కందార్థమందు అట్టి నిర్ణయ విధానము స్పష్టముగా చెప్పబడుచున్నది. ఇందు మఱ్ఱిచెట్టు, పక్షి అను పోలికలతో శరీరము అందలి ఎరుకను పోల్చి చెప్పుటలో పిండాండ దృష్టితో విచారించిన శరీరమందు నవ రంధ్రములు కలవు (చెవులు 2, కళ్ళు 2, ముక్కులు రెండు, నోరు, గుహ్యము, గుదము) అందు స్పష్టముగా గోచరించునవి నేత్రములు. అందు ఎరుపు, తెలుపు, నలుపు, ధూమ్ర వర్ణములను పొరలతో కూడియుండి దానిచివరి భాగమున ఒక రంధ్రముండును. ఆ రంధ్రమునందు ఒక వెలుగు ప్రకాశించును. ఇది ఆపో జ్యోతి. ఇదియే ఎరుక యొక్క స్థానము, స్వరూపముగా చెప్పబడుచున్నది. బ్రహ్మాండ దృష్టితో విచారించిన వారికి నవద్రవ్యములు అనగా భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కులు, మనస్సు, ఆత్మ. ఇందు మనస్సు మొదలు పృధ్వి వరకు గల ఈ ఎనిమిదింటిని ప్రకృతి యని, ఆత్మను పురుషుడని నిర్ణయించి ఈరెంటిలో ప్రకృతియందు పంచభూతములు వాటి రంగులు (రక్త వర్ణము, శుభ్ర వర్ణము, అసిత వర్ణము, ధూమ్ర వర్ణము దానిపైన ఐదవ సునీలవర్ణము దానియందు సూక్ష్మరూపమైన ఆత్మ పై వివరణచే రెండు వస్తువులుగా నిర్ణయించి చెప్పబడుచున్నది. ఇంకనూ సూక్ష్మమైన అధిష్టాన విచారణ చేసినవారికి పంచాకాశపద్ధతిచే ఎరుక వస్తునిశ్చయ జ్ఞానము గావింప బడుచున్నది. ఇది అత్యంత రహస్యము. గురుగోప్యము. గురుముఖత: మాత్రమే విచారించ వలసియున్నది.

పై విధముగా ఎరుకయొక్క స్థాన, స్వరూప, స్వభావములు గుర్తించి దీనికి వేరైవున్న అచల పరిపూర్ణమును గురు సూచన ద్వారా గుర్తించి, ఈ రెంటికి అత్యంత భేదము కలదని గ్రహించి స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు

ఎరుకకు మూలముగాని స్థానము గాని లేదని దృఢపరచుకొని ద్వాదశి, షోడశి అనుగురు వాక్యమనేగొడ్డలితో రెండుగా తోచబడుచున్న ఎరుకను రెండువాక్యముల చేత విడిచిపెట్టవలెను అని తెలియ వలెను.

కం॥ తనువుతొవొచ్చినయెరుకే। తనువునుతనువనుచు తనను
తాననియెరుగున్। తనువును బాసిన మీదట। తన నా దేహ
మును రెంట్నీ। తానెరుగదపుడూ। అదిగనుకతాలేనేలే దెపుడూ।
అనుమాన రహితా మిందచలామున్నదికంటె। తన మాట
తలపోయతనకెసిగ్గయి తనను। తానెరుగదపుడూ। అది
గనుకతా। లేనేలేదెపుడూ॥ 134

## ప్రతిపదార్థము

తనువుతో వచ్చిన ఎరుకే = శరీరముతో పాటు ఉత్పన్నమవుతున్న గుర్తు
తనువును తనువనుచు = శరీరమును శరీరముగా కేటాయించి
తనను తానని = దానికి తాను వేరుగా వున్నానని
ఎరుగును = భావించును
తనువునుబాసిన మీదట = శరీరమును విడిచిపెట్టినమీదట
తనను ఆ దేహమును రెంట్నితానెరుగదపుడు = శరీరమును, తననువేరుగా గుర్తించుచున్న గుర్తు లేకపోయిన పిదప
అది గనుక = అందుచేత, ఆవిధంగా
తాలేనే లేదెపుడు = తాను, దేహము ఒకదాన్ని విడిచి ఒకటి వుండలేవు
అనుమాన రహిత మిందచలమున్నాది కంటే = అచల పరిపూర్ణము వున్నదని, దానియందు గుర్తెరిగే తాను లేనని దృఢపరచుకొన్నమీదట
తనమాట తలపోయ తనకె సిగ్గయి = తన వునికినిగూర్చి తాను ఊహించుకొని, సిగ్గుపడి
తనను తానెరుగదు = తన గురించి తనకే తెలియకుండా పోతుంది

## తాత్పర్యము

శరీరముతో కలసి ఉత్పత్తి అవుతున్న ఎరుక శరీరమును, తాను కలసియే ఉండి వేరు వేరుగా గుర్తించును. శరీరమును విడచిన పిదప తననుగాని, శరీరమును గాని రెంటిని తెలిసికొనలేకపోవుచున్నది. రెండును ఒకదాని కొకటి సంబంధపడి వుండుట చేత ఒకటి లేనిచో రెండవది కూడా లేకపోవుట చేత ఈ ఎరుక ఎప్పుడు లేకపోవుచున్నది. స్వత:సిద్ధమైన పరిపూర్ణము వున్నదని దానియందు గుర్తెరిగే తనకు మూలముగాని స్థానముగాని లేదని తెలుసుకొని తనస్థితిని (ఉనికి) ప్రశ్నించుకొనుటలో తానే సిగ్గుపడి తానే లేకపోవుచున్నది అను భావము.

కం॥ ఉప్పెనచే జెడుతరువు వొ। కప్పుడు విత్తనము పుచ్చు నా
రెంటికి ఈతిప్పలుదప్పవుధరయే। తిప్పలుతానెరుగదిట్లు।
తెలుసుగదోయీ। తనువెరుకాబయ। లులనట్లెరుగోయీ। గొప్పైన
గురుబోధ చొప్పున నెరిగియూ। తిప్పాలుగలవాట్ని।
తప్పాదీశితెచాలు। తెలుసూ గదోయీ। తనువెరుకాబయలుల।
నట్లెరుగోయీ॥ 135

## ప్రతిపదార్థము

ఉప్పెనచే చెడు తరువు = ఉప్పు గాలిచేత ఎప్పుడైనా చెట్టు నశించవచ్చును

ఒకప్పుడు విత్తనముపుచ్చు = ఒకానొక ప్రత్యేకమైన సమయములో విత్తనము కూడా నశించును

ఆ రెంటికీ ఈ తిప్పలు తప్పవు = పై రెంటికి ఈ విధమైన మార్పులు తప్పవు

ధర ఏ తిప్పలు తానెరుగదు = భూమిపై రెంటి మార్పులకు సంబంధపడక యుండును

ఇట్లు తెలుసు గదోయి = ఈ విధంగా మార్పులన్నీ స్పష్టంగా తెలుస్తున్నాయి గదా

తనువు, ఎరుక, బయలు నట్లెరుగోయి = శరీరము, ఎరుక, పరిపూర్ణములను ఈ విధముగా గుర్తించుము (తనువు = వృక్షము, ఎరుక = బీజము, బయలు = భూమి)
గొప్పైనగురుబోధ = శ్రేష్టమైన పరిపూర్ణబోధను
చొప్పున ఎరిగి = స్పష్టముగా గుర్తించి
ఈ తిప్పలు గలవాటిని తప్పా తీసితె చాలు = మార్పులకు లోనగుచున్న విత్తనము వృక్షము తీసి వేసితె చాలు

## తాత్పర్యము

తీవ్రమైన ఉప్పెనగాలిచేత ఒక దశలో వృక్షము నశించుచున్నది. వాతావరణ ప్రభావముచే విత్తనము పుచ్చి నశించును. ఈ విధముగా ఈరెంటికీ ఈ మార్పులు సహజముగా జరుగుచున్నవి. ఈ పరిణామములకు ఏమీ సంబంధపడకుండా భూమి స్థిరముగానున్నది. ఈ విధానము నీవు స్పష్టముగా గుర్తించినావు కదా. ఆ విధముగానే వృక్షరూపమైన శరీరము, విత్తనరూపముగానున్న గుర్తు, భూమితో పోల్చబడిన పరిపూర్ణము వస్తునిశ్చయముగా గుర్తించుము. శ్రేష్టమైన పరిపూర్ణబోధచే ఉన్నది పరిపూర్ణము, లేనిది ఎరుక అని దృఢపరచుకొని జనన మరణ భ్రాంతికి కారణమగు ఎరుక శరీరములను విడువుమని భావము.

**కం॥ లేనీయహమున్నబయలును। లేనిప్రపంచమును తనను లెస్సగ
తనలో తాను విమర్శించినయా। లేనివి లేకుండు నవలయ।
లేదూయేమాటా। యిట్లననైన। లేదుయేమాట। లేనియహమీబైట
లేనేలేదదిదిజూచీ। లేనీదికలదాని। లేనిమా టాడేవు। లేదుయే
మాటా। యిట్లననైన। లేదు యేమాటా॥** 136

## ప్రతిపదార్థము

లేని అహము = మూలములేని గుర్తెరిగే శరీరము
ఉన్నబయలు = స్వత:సిద్ధమైన పరిపూర్ణము
లేని ప్రపంచము = లేని బ్రహ్మాండము

తనను = ఈ మూడింటిని గుర్తించే గుర్తు
లెస్సగా = వస్తునిశ్చయ పూర్వకంగా, స్పష్టంగా
తనలో తాను విమర్శించిన = తనలో తాను అనుభవముగా మలచు కొని గుర్తించునపుడు
లేనివి లేకుండు = లేనివి లేకుండా పోవుచున్నవి
అవలలేదు ఏమాటా = ఆపైన ఉన్నదాని గురించి నిర్ణయించుటకు గుర్తే లేకుండా పోవుచున్నది
ఇట్లననైన లేదు ఏమాటా = లేదని చెప్పటానికి గుర్తులేదు
లేని అహమీ బయట లేనేలేదు = స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణమునందు ఏనిర్ణయము లేనేలేదు
ఇది జూచి = ఈ విధముగా ఆరూఢపరచుకొని
లేనిది కలదాని లేని మాటాడేవు = లేనిది ఉన్నట్లుగా భావించి వున్నట్లుగా చెప్పావు (గ్రహించావు)

## తాత్పర్యము

లేని ఎరుక ఉన్నపరిపూర్ణము ఈరెంటి సంధియందు తోచబడే జగత్తు (వస్తు నిశ్చయ జ్ఞానముగా విచారించిన వారికి ఎరుక స్థూల రూపము జగత్తు) సూక్ష్మరూపమైన నేననే గుర్తు ఈ రెండింటికీ సంబంధపడనిది పరిపూర్ణము. వీటిని గురుముఖత: విచారించి తనలో తాను వస్తునిశ్చయ జ్ఞానరూపముగా ఆరూఢపరచుకొనుటలో ఉన్నపరిపూర్ణము నందు లేని ఎరుక అనగా జగత్తు + నేననే గుర్తు ఈ రెండూ లేనివే అగుచున్నవని దృఢమగును. లేనిది లేకపోయిన వెనుక వున్నదానిని గుర్తించి చెప్పుటకు ఇక ఏమియూ మిగిలినది లేదు. కనుక ఏ నిర్ణయము చేయుటకు సాధ్యము కాదు అని తెలియ వలెను.

కం॥ పరిపూర్ణ మెరుకలెట్టివో। గురుముఖమున రెంటినెలెస్స
గురుతెరిగెరుకన్। సరిపుచ్చుకొన్న మృషయని। పరిశుద్ధపు
బోధయిది। పాటించికనరా। శివరాముల। పద్ధతి యిదెరా।
నరులుకొందరుబల్కి రెరుకానుమ్రింగి యీ। పరిపూర్ణ
మయ్యేమంచెరుగాక। చెడుటాకై। పాటించికనరా। శివరాముల।
పద్ధతియిదెరా॥ 137

## ప్రతిపదార్థము

పరిపూర్ణ మెరుక లెట్టివో = పరిపూర్ణము, ఎరుకల యొక్క ఉనికి ఎటువంటిదో
గురుముఖమున = గురుప్రబోధ ద్వారా
లెస్స గురుతెరిగి = వస్తునిశ్చయపూర్వకముగా స్పష్టముగా గుర్తించి
ఎరుకన్ సరిపుచ్చుకున్న మృషయని = స్వత:సిద్ధమైయున్న పరిపూర్ణమందు గుర్తెరిగే ఎరుక లేనిదని
పరిశుద్ధపు బోధ = స్వచ్ఛమైన బోధ
ఇది పాటించి కనరా = స్పష్టముగా విచారించి తెలుసు కొనుము
శివరాముల పద్ధతి ఇదేరా = పూర్ణమద: అను మంత్రము ద్వారా శ్రీధర స్వాములవారి నుండి శివరామ దీక్షితులవారు వివరించి స్పష్టముగా తెలుసు కొన్న విధానమిది
నరులు కొందరు పల్కిరి = సాంప్రదాయ మందలి వస్తునిశ్చయ జ్ఞానముద్వారా క్రమంలో
ఎరుకను మింగి ఈ పరిపూర్ణ మయ్యేము = సమగ్రంగా బోధ గ్రహించనివారు పరిపూర్ణము ఎరుకను రెంటిని గుర్తించి ఎరుక లేని స్థితి యందు మేము పరిపూర్ణ మయ్యేము అని తృప్తి చెందారు
ఎరుగాక = వస్తు నిశ్చయ పూర్వకంగా ప్రబోధను పొందక పోవడం చేత
చెడుటాకై = భ్రాంతి రహిత స్థితికి బదులుగా భ్రాంతి సహిత స్థితిలోనే వుండుట చేత

# తాత్పర్యము

శ్రీ శివరామ దీక్షితులవారు పూర్వము వరకు ఈ పరిపూర్ణ భావమంతయు సంస్కృతమునందే నిక్షిప్తమైయున్నది. ఆధ్యాత్మిక శాస్త్రము నందు ప్రస్థానత్రయమనబడు బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత అనుఈ అంశములు క్లుప్తముగా వివరింపబడినవి. " అచలోయం సనాతన: రహస్యం హేతదుత్తమమ్ " అను సూత్రరీత్యా ఈ భావము నిర్ధుష్టముగా జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుడు తన శిష్యుడగు అర్జునునకు భగవద్గీత యందు ఉపదేశింప బడినట్లుగా చెప్పబడుచున్నది. ఈ రహస్యాన్ని శ్రీధరుల వారు శివరామ దీక్షితుల వారికి పూర్ణమద: అను శాంతి మంత్రముద్వారా వివరించుట జరిగినది. ప్రత్యక్ష పూర్ణం అఖండ ఎరుక పరోక్షపూర్ణం పరిపూర్ణం ఈ రెంటికి ఒకదాని కొకటి సంబంధ పడక స్వత:సిద్ధమై యున్నది పరిపూర్ణము. ఇది గోప్యమై గురూపదిష్ట మార్గమందు మాత్రమే వివరింపబడుటకు వీలున్నందున అచ్చతెలుగులో వీటినిగూర్చి వివరిస్తూ అది (పరిపూర్ణము) ఇది (ఎరుక) కాదు. ఇది అది కాదు అను సిద్ధాంతము ప్రతిపాదిస్తూ అచల గ్రంథము అనుదానిని సిద్ధాంత గ్రంథముగా రచించినారు. ఇందు ఎరుక యొక్క వస్తునిశ్చయ జ్ఞానము చాలా స్పష్టముగా వుండును. ఈ వివరణ విపులీకరిస్తూ కృష్ణ దేశికులు తమ కందార్థములను పరిపూర్ణము ఎరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను అను క్రమములో వివరిస్తూ ఈసిద్ధాంతమునుఇంకనూ వివరించి పరిపూర్ణమును ఎరుకను వస్తునిశ్చయపూర్వకముగా గుర్తెరిగి, స్వత:సిద్ధమైన పరిపూర్ణమందు గుర్తెరిగే ఎరుకకు మూలముగాని, స్థానముగాని లేదని ధృఢపరచుకొను విధానము దీక్షితుల వారిచేత ప్రతిపాదింపబడిన క్రమము చాలా స్పష్టముగా తెలియబడుచున్నది. అందువలన దీనికి శివరామ దీక్షిత సిద్ధాంతము అని వీరిపేరు వచ్చెను. ఇందలి క్రమము విధానము పాటించక మిడిమిడి జ్ఞానముచేత పరిపూర్ణమునందు ఎరుకను ఐక్యముచేసి పరిపూర్ణ స్థితిని పొందినామని ప్రచారము చేస్తున్నారు. ఇది భ్రాంతి రహిత విధానమునకు సాంప్రదాయ పద్ధతి కాదని తెలియ వలెను.

కం॥ జనులనిరి దేవుడెవరికి। కనరాడనినామరూపకర్మ జననముల్।
గననతనికిలేవనియూ। జనవాక్యము బయలు కెపుడు
సహజమౌవినరా। అనుమానము। చాలించికనరా।
కనినామరూపాదికములున్న యెరుకాను। వినబోకకనబోక
విడిచి పెట్టర పోని। సహజమౌవినరా। అనుమానాము
చాలించికనరా॥ 138

## ప్రతిపదార్థము

జనులు = ప్రాపంచీకులు

దేవుడెవరికి కానరాడని = భగవంతుడు కళ్ళకు కనిపించడని

నామరూప కర్మజననముల్ గననతనికి లేవని = నామము, రూపము, పని, జనన మరణములు విచారించగా అతనికి లేవని

ఆ జనవాక్యము = ప్రపంచములో స్థిరమైన ప్రచారంలో ఉన్నఅభిప్రాయము

బయలుకి = పరిపూర్ణమునకు

ఎపుడు సహజమౌ వినరా = పరిపూర్ణమునకు సర్వకాల సర్వావస్థలయందూ ఈ లక్షణములు సహజమై వున్నవి

అనుమానము చాలించి కనరా = వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖత: విచారించి దృఢపరచుకొనుము

కని = స్పష్టముగా విచారించి

నామరూపాదికములున్న ఎరుకను = నామ రూపక్రియలు గల్గిన ఎరుకను (గుర్తెరిగే శరీరమును)

వినబోక = శాశ్వతమని అనుకోక

కనబోక = మూలములేని గుర్తెరిగే శరీరము లేదని

విడిచి పెట్టరపోనీ = గురువాక్యముచేత విడచియుండుము

## తాత్పర్యము

ప్రపంచములో భగవంతుడు, అతనిఉనికిని గూర్చి చర్చించుటలో అతడు ఎవరికీ కన్పించడని, పేరు, రూపము, పని లేవని మనవలెనే

జన్మ పరంపరలకు లోను కాడనీ సర్వసాధారణ అభిప్రాయము కల్గి ఉన్నది. పరిశీలించి చూడ సర్వాంగీకృతమైన ఈ అభిప్రాయము స్వతఃసిద్ధమైన పరిపూర్ణమునకు వర్తించును. ఎట్టి తర్కవితర్కములకు లోనుగాక వస్తు నిశ్చయ పూర్వకముగా ఈ అంశములు దృఢ పరచుకొని నామరూపాదులతో కూడుకున్నఎరుక నిజముకాదని, గురువాక్యముచేత అది లేదని దృఢ పరచుకొనియుండుము.

కం॥ అంతటగలదీయెరుకని। యెంతో వాదింపుచుందు
రెరుగనివారల్। అంతటనింతట గనుపడునంతటిదేకాని
యెరుక। అంతటగలదా। అదినిజమైతే। అగుపడవలదా।
అంతాటగలదొక్క అచలా మెకానెరుక। నంతాటగలదానియ
నరాదు। వినరాదులి అంతటగలదా। అదినిజమైతే। అగుపడ
వలదా॥ 139

## ప్రతిపదార్థము

అంతటగలదీ ఎరుకని ఎంతో వాదింపుదురు = సృష్టి కారణమైన ఆత్మలేక ఎరుక సర్వే సర్వత్రా అఖండముగా వ్యాపించి వున్నదని మతవాదులు సిద్ధాంతపరచియున్నారు

ఎరుగనివారలు = ఎరుకయొక్కవాస్తవరూపమును గుర్తించనివారు

అంతట నింతట కనిపించునంతటిదేకాని = ఖండ ఖండములుగా, ముక్కచెక్కలై కనిపించేదేగాని

ఎరుక అంతట గలదా= గుర్తెరిగే శరీరము(ఆత్మ) అంతటా వ్యాపించి లేదు

అదినిజమైతే = అంతటా వ్యాపించి యున్నదన్నమాటయే సత్యమైతే

అగుపడవలదా = అనుభవము లోనికి రావాలికదా

అంతట గలదొక్కఅచలమే కాని = సర్వే సర్వత్రా ములు గ్రుచ్చసందుకూడా లేకుండా పరిపూర్ణము అంతటా వ్యాపించివున్నది.

ఎరుక అంతట కలదని అనరాదు వినరాదు = గుర్తెరిగే శరీరం ఉపాధిగతం చెంది ఖండా ఖండములుగా పరిమితమై తెలియబడుచున్నదే గాని అంతటా గలదని అనరాదు, వినరాదు.

## తాత్పర్యము

వేదాంత శాస్త్రమునందు ఆత్మ (ఎరుక) సర్వ వ్యాపకముగా అఖండముగా నిర్ణయించినది. పరిపూర్ణ బోధయందు ఎరుకయొక్క వస్తు నిశ్చయజ్ఞానము తెలిసిన మీదట, ఎరుక ఉపాధి గతం చెంది ఆవరణ బద్ధమై ఖండా ఖండములుగా వ్యవహరించుచున్నది, కాని ఏకకాలమున సర్వత్రా గోచరించదు. సర్వత్రా ఉండును అను మాట నిజమైనచో అది అనుభవములోనికి రావలసియున్నది.పరిపూర్ణ బోధ రీత్యా వస్తునిశ్చయజ్ఞానముగా దృఢపరచుకొన్నవారికి పరిపూర్ణము మాత్రమే సర్వే సర్వత్ర కేవలత్వము కలిగి అఖండరూపంగా వ్యాపించి వున్నది. ఇట్టి ఆరూఢత యందు గుర్తు లేకపోవుచున్నది. అందుచేత ఎరుకను సర్వే సర్వత్రా అఖండ రూపముగా వ్యాపించి యున్నది అనువారిమాట లెక్కలోనికి తీసుకో కూడదు.

కం॥ తనువో బహిరింద్రియములొ। మనసో ప్రాణములో
విషయమమతో నేనం। చని నీవనియననిదియని।
యనుమానించెదవదేల। అది త్రోవగాదు। నీవెన్నాడు।
యిదివినలేదూ। వినుమీపరిపూర్ణ ముగనిలేనియామీది।
తనువాదికమును। లేందనిగురునిచేదెలియు। మదిత్రోవ గాదూ।
నీవెన్నాడు। యిది వినలేదూ॥ 140

## ప్రతిపదార్థము

తనువో = శరీరమొ

బహిరింద్రియములో = జ్ఞానేంద్రియములా

మనసో = అంతరేంద్రియములలో మననన

ప్రాణములో = పంచప్రాణములలో

విషయమమతో = శబ్దాది విషయములందేర్పడు అంతఃకరణమొ

నేనంచని = నేననే వస్తువును గూర్చి విచారించుటలో

నీవని = నేను, నీవను అభిమాన పూర్వకమైన గుర్తెరిగే తెలివియని
అననిదియని = మొదలుగా గల గుర్తులతో కూడుకున్న
అనుమానించెదవేలా = పలు సందేహాలతో జిజ్ఞాసగావించు
అది త్రోవగాదు = ఇది సరియైన మార్గము కాదు
నీవెన్నాడు ఇది వినలేదు = ఈ పరిపూర్ణ భావమునుగూర్చి నీవెన్నడు వినలేదు
వినుము = స్పష్టమైన రీతిలో వస్తు నిశ్చయము గూర్చి వివరిస్తాను
పరిపూర్ణము గని = స్వతఃసిద్ధమైన పరిపూర్ణమును గురువాక్యముచేత వుండజూచుకొని
లేనియా మీదితనువాదికమును = దానియందు లేకుండా తోచుచున్న నేనని గుర్తెరిగే శరీరముయొక్క భిన్నభిన్న స్థితిగతులు
లేందని గురునిచే తెలియుము = పరిపూర్ణమునందు మూలముగాని స్థానముగాని లేనిదని దృఢపరచుకొనుము. ఇది క్రమమైన మార్గము.

## తాత్పర్యము

నేనను వస్తువు యొక్క అన్వేషణలో జిజ్ఞాస ప్రారంభింపబడి శరీరమా, ఇంద్రియములా, మనసా, ప్రాణమా, అంతఃకరణమా లేక నేను నాదిఅని గుర్తించు శరీరమా అను పలు సందేహములతో ప్రారంభింపబడి విభిన్నసోపానములలో భిన్న భిన్న అభిప్రాయములు ఏర్పడుచున్నవి. ఇది సరియైనమార్గముకాదు. పరిపూర్ణ భావమునందు నేననే వస్తువునుగూర్చి, నేనననివస్తువును గూర్చి వస్తునిశ్చయ పూర్వకముగా వివరింపబడినది. ఇది రాజమార్గముగా పిలవబడుచున్నది. గురుముఖతఃమాత్రమే తెలియవలసివున్నది. స్వతఃసిద్ధమైనది అచల పరిపూర్ణము. దానికి నేను, నాది అను గుర్తులేదు. నేను నాది అను గుర్తుతో కూడియుండి, పైనపేర్కొన్న వస్తు జాలమంతయు కలిసి నేననే వస్తువుగా తెలియబడు చున్నది.ఈ భేదమును స్పష్టముగా గురుముఖతః గుర్తించవలెను. వస్తునిశ్చయముగా ప్రబోధింపబడుటచేత ఈ మార్గమునకు రాజమార్గమని కూడాపేరు.

కం॥ నినుననుప్రపంచమును జగ॥ మనియెరిగే యెరుక చేత
నచలమును గనుంగొని॥ నిను నను జగమునుజగ॥ మని
యెరిగేయెరుకమాను॥ మమలావివేకా॥ చాలు నీవీక్రమ మెరిగి
నాన్కా॥ నినునన్ను పైరెండింటిని విశ్వమనక బయలనకుం
డెదు॥ న్నాదంచనగుర్తులేకుండ॥ మమలావివేకా॥ చాలునీవీ॥
క్రమమెరిగినాన్కా॥ 141

## ప్రతిపదార్థము

అమలవివేకా = విశుద్ధమైన వివేకము గలవాడు

నిను నన్ను ప్రపంచమును జగమని యెరిగే ఎరుకచేత = వినుచున్న నీవు (శిష్యుడు) చెప్పుచున్న నేను (గురువు) వీటికి వేరేవున్న విషయప్రపంచము మొత్తముగాగల జగత్తును ఒకటిగా ఏగుర్తుచేత ఒకటిగా గుర్తింపబడుచున్నది.

అచలము కనుగొని = వీటికి వేరైయున్న పరిపూర్ణమును ఉండ జూచుకొని

నిను నను జగమును జగమని ఎరిగే ఎరుక మాను = పైన పేర్కొన్న విధంగా భిన్న భిన్నంగా గుర్తు ఎరగబడుచున్న గుర్తును విడచి యుండుము.

చాలు = భ్రాంతి రహిత విధానమునకు ఈ ఆరూఢత సరిపోగలదు

నీవీ క్రమమెరిగినాన్కా = గురుముఖత: క్రమపద్ధతిలో వస్తునిశ్చయపూర్వకముగా పై అంశములు దృఢపరచుకొన్న మీదట

నిను నన్నుపైరెంటినీ విశ్వమనక = నీవు, నేను, ఎరుక, బయలు, ప్రపంచము అనక

బయలనకుండా = పరిపూర్ణము ఉన్నదను నిర్ణయము లేకుండా

ఎందున్నాదంచనగుర్తులేకుండు = నిర్ణయించుటకు వీలుకాని స్థితిలో ఎరుక లేకపోవు చున్నది.

## తాత్పర్యము

స్వచ్ఛమైన వివేకము కలవాడా! ప్రబోధవిధానమందు విచారించు నీవు (శిష్యుడు) వివరించి చెప్పునేను (గురువు) మన ఇరువురి మధ్య ప్రకాశించు

(పంచతన్మాత్రలు) ప్రపంచము ఈమొత్తమంతాకూడి ఉనికి కల్గిన జగత్తు దీనిని ప్రకాశింపజేసే గుర్తెరిగే శరీరము ఒకే గుర్తుగా వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని దీనికి వేరై తెలియబడుచున్నది అచల పరిపూర్ణము గాను స్పష్టముగా దృఢపరచుకొని ఏక వస్తువుగా నుండి పైన చెప్పిన విధముగా భిన్న భిన్నంగా గుర్తించే లక్షణము కల్గిన గుర్తును గురువాక్యము చేత విడచి యుండుము. జనన మరణ భ్రాంతి రహిత విధానమునకు ఈ ఆరూఢత సరిపోవును. ఇదియే భ్రాంతిరహిత విధానము. పరిపూర్ణము వున్నదనిగాని, ఎరుక లేనిదనిగాని నిర్ణయించగలుగు ఎరుకే లేనిస్థితి నీకు దృఢము కాగలదు.

కం॥గురుడు పరిపూర్ణమునుజూ। పెరుకనులేందనుచు దెల్పి
యికదల్పకుమం। చెరిగించక విడిపోవునె। యెరుక నరుల్
సాధనములు। యెన్నీ జేసిననూ। లక్ష్యముద్ర। లెన్నిజూచిననూ।
హరిహర బ్రహ్మ సురా సుర ముఖులైన। ధరణీ సురాద్యష్ట
దశజాత్యుద్భవులాను। యెన్నిజేసిననూ। లక్ష్యముద్ర। లెన్ని
జూచిననూ॥ 142

## ప్రతిపదార్థము

గురుడు = పరిపూర్ణము నెరిగి, ఎరుక నెరిగి, ఎరుకను మాను మను క్రమమునుస్పష్టముగా ఆరూఢ పరచుకొన్నవాడు

పరిపూర్ణమునుచూపి = వస్తునిశ్చయపూర్వకముగా పరిపూర్ణముయొక్క ఉనికిని దృఢపరచి

ఎరుకను లేందనుచు తెల్పి = స్వత:సిద్ధమైన దానియందు గుర్తెరిగే తెలివి ఏమాత్రము లేదని దృఢపరచి

ఇక దల్పకుమంచెరిగించక = ఏగుర్తుచేత ఈ భావము కలిగించు కున్నావో ఆగుర్తుకూడా లేనిదని విడచివుండుము

విడిపోవునే ఎరుక నరులు సాధన లెన్నిజేసినను = ఈ పద్ధతికాక తనకు తానుగా ఎన్నిప్రయత్నాలు చేసినా

లక్ష్యముద్రలెన్నిజూచినను = యోగ ప్రక్రియ ద్వారా ఎన్నిసిద్ధులు సాధించినా
హరి హర బ్రహ్మ సురాసుర ముఖులైన = బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, ఇంద్ర దిక్పాలకులు మొదలైన దేవతలు
ధరణీ సురాద్యష్ట = భూమండలమందు మిక్కిలి ఉపాధి చెందిన బ్రాహ్మణులు
దశ జాత్యద్భవులైన = 18 జాతులలో పుట్టిన మిక్కిలి శ్రేష్టులైన వారైనను

## తాత్పర్యము

సాంప్రదాయ బద్ధముగా నున్నగురు పరంపరను ఆశ్రయించి క్రమపద్ధతిలో పరిపూర్ణము, ఎరుకల వస్తునిశ్చయ జ్ఞానము గురుముఖత: గుర్తించి లేనిది ఎరుక అని దృఢపరచుకొని, భ్రాంతి రహిత స్థితిని ఆరూఢపరచుకొని గుర్వాజ్ఞానుసారంగా గురువై తన్నాశ్రయించిన శిష్యులకు క్రమ పద్ధతిలో వస్తు నిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము, ఎరుక , ఎరుకను విడచుట అను ముఖ్యాంశములు స్పష్టముగా దృఢ పరచగలుగు గురువు ముఖత: కాక మానవులు స్వయంగా ఇతర మత మార్గములయందు ఎన్నిప్రయత్నాలు చేసినా (యోగ, జ్ఞాన, మత, భక్తి, మంత్ర) సాధనలు, బ్రహ్మాది దేవతలను పూజించినా, భూమండలమందు భూసురులు అనే పేరుతో శ్రేష్టమైన ఉపాధిగా గుర్తించబడుచున్న 18 జాతుల బ్రాహ్మణ వంశస్తులతో కూడిన వారిని సేవించిన ఈ పరిపూర్ణ భావము ఆరూఢపరచు కొనుట సాధ్యము కాదు. ఏలననగా ఈ పనులన్నియు పరిపూర్ణ బోధయందు విడువ దగిన ఎరుక యొక్క ఆవరణమందే యుండబడుట చేత.

కం॥ యీ వృత్తబట్టబయలును నీవిప్పుడువుండ జూచి నిజముగ
యెరుకన్। నీవని నేనని జగమని। భావింపుము పిదప దీన్ని।
బాయు మనిశమున్। నిజముగదీన్ని। బాయక నిశమున్।
శ్రీవనితేశ రాజీవసంభవ భవ। దేవేంద్రాదులనింక
సేవించుతలపేల। పాయమామనిశమున్। నిజముగ
దీన్నిబాయకనిశమున్॥ 143

## ప్రతిపదార్థము

నీవిపుడు = పరిపూర్ణమును ఎరిగి ఎరుకను వస్తు నిశ్చయముగా గుర్తించిన మీదట

ఈ వుత్త బట్ట బయలును = బయలు = ఆకాశము బట్టబయలు = ఆత్మ ఉత్త బట్ట బయలు = పరిపూర్ణము

ఉండజూచి = అఖండ ఎరుక స్వరూపుడవు నీవై నిలచి ఆపైన నీకన్యమై తెలియ బడేది ఏదో

నిజముగా = స్పష్టముగా

ఎరుకను = గుర్తెరిగే తెలివిని

నీవని, నేనని, జగమని భావింపుము = గురువు, శిష్యుడు, ప్రపంచముగా గుర్తించి

పిదప దీనిని బాయుమనిశమున్ = ఆ పైన గుర్తించే గుర్తును గురు వాక్యము చేత విడచి వుండుము

నిజముగా = స్పష్టముగా, ఉన్నది ఉన్నట్లుగా

దీన్ని బాయకనిశమున్ = ఎల్లప్పుడు ఈ ఆరూఢతను విడచి వుండకు

శ్రీ వనితేశ = సాక్షాత్ శ్రీ మహాలక్ష్మికి భర్త యైన శ్రీ మహావిష్ణువు

రాజీవ సంభవ = విష్ణువు నాభి నాళము నుండి పుట్టిన పద్మము నుండి ఉద్భవించిన చతుర్ముఖ బ్రహ్మ

భవుడు = పుట్టుక లేనివాడు, మహేశ్వరుడు

దేవేంద్రాదుల = స్వర్గాది పతుడైన దేవేంద్రుడు మొదలైన దేవతలను

ఇంక సేవించు తలపేల = పైన పేర్కొన్న వారిని పూజించుటచే మోక్షము కల్గును అని ఆలోచన మానుము

## తాత్పర్యము

గురుముఖత: వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము, ఎరుకలను దృఢపరచుకొని స్వత:సిద్ధమైన పరిపూర్ణమునందు నువ్వు, నేను అను భిన్నదృష్టి కలిగిన ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదని ఏగుర్తు

చేత ఆరూఢత కల్గు చున్నదో అట్టి దానిని కూడా గురువాక్యము చేత విడచి వుండుము. ఇదియే ఏ నిర్ణయము లేనిస్థితి. అచల పరిపూర్ణ భ్రాంతి రహిత స్థితి. గురువుద్వారా పొందవలసిన స్థితి ఇదే. ఈపద్ధతి గాక సత్వ గుణ సంబంధమైన శుద్ధ మాయతో కూడిన ఈశ్వరుని చేత ప్రకాశింప బడుచున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మొదలగు దేవతలు జన్మరహిత విధానము పొందుటకు నవ విధ భక్తులతో వారిని ఆశ్రయించుట కూడదని, వారివల్ల పైన పేర్కొన్న ఆరూఢత కలగ దని తెలియ వలెను. ఇందు పరిపూర్ణమును " ఉత్త బట్ట బయలును ఉండజూచి " అను శబ్ధముచే సూచింప బడుచున్నది. ఆకాశము అనగా బయలాంశము, బయలు + బయలు = బట్టబయలు. ఇది సృష్టికి పూర్వము ఎరుక యొక్క స్థితి. ఈ స్థితికి కూడా వేరై స్వతఃసిద్ధమై ఉన్నది ఉత్తబట్టబయలు. సిద్ధాంతమునందు ఈ ఉత్తబట్టబయలేమీ లేదని చెప్పుబడుచున్నది. లేదు శబ్ధము " వుండ జూచి ' అను శబ్ధములు ఇందు విశేషమైనవి. అత్యంత గురు రహస్యమై వున్నవి.

కం॥ పరిపూర్ణ మనినయెట్టిదో। యెరిగెదనని యెరుకబైటి
కేగినయెరుకె। యెరుకకుశూన్యంబయ్యెను। యెరుకనుజన్మిం
చినట్టి। యీ విశ్వమంత। యెరుకవలెనె। యేమీలేదంతా।
యెరుకావుండంగానే యెరుకావిశ్వములులే। వెరుకాకెయిది
జూడయెంతోవింతైతోచె। యీ విశ్వమంతా। యెరుకవలెనె।
యేమీలేదంతా॥ 144

## ప్రతిపదార్థము

పరిపూర్ణమనగా ఎట్టిదో = గురు సూచన వస్తునిశ్చయ పూర్వకముగా విన్నమీదట అది ఏవిధంగావుంటుందో గుర్తించాలని

ఎరిగెదనని = అనుభవం లోనికి తెచ్చుకోవడానికి

ఎరుకే బైటకేగిన = గుర్తెరిగే తెలివి తన ఆవరణాన్ని విడిచి బైట కొచ్చినపుడు

ఎరుకే ఎరుకకు శూన్యంబయ్యె = ఆ ప్రయత్నం చేసిన తెలివే తనకు

తానుగా లేకపోవుచున్నది

ఎరుకను జన్మించినట్టి ఈ విశ్వమంతా = ఎరుక పరిణామరూపమగు జీవేశ్వర జగత్తంతయు

ఎరుక వలెనే ఏమీ లేదంతా = పైన పేర్కొన్న విధంగా గుర్తు ఏ విధంగా లేకపోవుచున్నదో ఆవిధంగానే

ఎరుక వుండంగానే ఎరుక విశ్వములు లేవు = పైన పేర్కొన్న స్థితియందు అన్ని నిలుచుండగానే ఏమియు లేక పోవుచున్నవి

ఎరుకకే ఇది జూడ ఎంతో వింతై తోచె = ఈ అంశములన్ని పరిశీలించిన మీదట తన ఉనికి, పరిపూర్ణముయొక్క వునికి ఈరెంటినీ విచారించిన తాను లేక పోవుట అను అంశములు ఈ స్థితి యందు ఎంతో వింతగా తోచుచున్నవి.

## తాత్పర్యము

పరిపూర్ణము, ఎరుకలను, వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢ పరచుకొన్నమీదట పరిపూర్ణము యొక్క ఉనికిని గుర్తించి ఎరుక తెలుసుకొనే ప్రయత్నం చేయడంలో తన కన్యముగా వున్నదానిని గుర్తించ గలగాలంటే తన ఆవరణదాటి తాను బైటకు రాగలుగుట అవసరం. ఇట్టి ప్రయత్నంలో ఆవరణబద్ధమైన ఎరుక గురువాక్యంచేత (ద్వాదశి) బైట పడు సందర్భంలో తానే లేకపోవుచున్నది. తన వలెనే తన పరిణామ రూపమగు ఈ జగత్తంతా తనతోపాటే లేకపోవుచున్నది. తనగుర్తు పని చేస్తుండగానే తను, తన నుంచి ఏర్పడిన జగత్తు లేకపోవుట తనకే ఎంతో విచిత్రమైన సంఘటనగా తోచుచున్నది. ఈ స్థితి ఆరూఢ మగుట చాలా కష్టతరమైంది. గురు ముఖత: ప్రబోధ విన్న విధానముచే తాను అఖండ స్వరూపుడై నిలచినగాని, ఈ కందార్థమందలి అంతరార్థము అనుభవంలోకి రాజాలదు. ద్వాదశి, షోడశి మంత్రార్థముల వివరణ పొంది ఎరుకను విడువగలుగు స్థిత్యాను భవము ఇక్కడ గోచరించ గలదు. ఇది అత్యంత రహస్యము.

 

కం॥ దేహాకారముగానిది। యహంభావంబు లేనిదఖిల జనులుదా।
సోహంసోహంబనినను మోహాముజెంద నిదిబైలు।
మొదలెరుగవలెరా। యెరిగినయెరుక। తుదకరుగ వలెరా।
కోహంకస్త్వంబాని కూతాలుగూసేటి। దేహిదేహాము లాను
తెలియాని యీబైలు। మొదలెరుగవలెరా। యెరిగిన యెరుక।
తుదకరుగవలెరా॥ 145

## ప్రతిపదార్థము

బయలు = పరిపూర్ణ పరబ్రహ్మము
దేహా కారము గానిది = ఈశ్వర తనువులు, జీవతనువులు, పిండ బ్రహ్మాండాకారముగా పరిణమించనిది (మార్పు)
అహం భావము లేనిది = నేను అను వ్యష్టి గుర్తు గాని, నీవు నేను ఒకటే అను ఈశ్వర గుర్తు గాని లేనిది
అఖిలజగంబులు = ప్రపంచంలో గల మానవులందరూ
సోహం సోహం బనినను = నేనే నీవు, నీవే నేనను తత్వమసి మహా వాక్యము ద్వారా అద్వైత జ్ఞానం పొందినను
మోహాము చెందనిది = ఎట్టి అహంకారము (నేననే గుర్తు) లేకవున్నది
మొదలెరుగ వలెరా = గురుముఖత: మొట్ట మొదటిగా అట్టి పరిపూర్ణమును గూర్చి వివరముగా తెలిసి కొనవలసి వున్నది
ఎరిగిన = బాగా దృఢపరచుకొన్నమీదట
ఎరుక తుద కరుగ వలెరా = పైన గుర్తించిన గుర్తు విడచి వుండవలెను (షోడశి)
కోహం = నేనెవరు
కస్త్వంబని = నీవేనేను, నేనే నీవని
కూతలు కూసేటి = అనుభవమును చెప్పగలిగే
దేహి దేహములాను = నేను, మేనులుగా తోచబడు ఎరుకను ద్వాదశి, షోడశి వాక్యములద్వారా వదలవలెను.

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము ఎటువంటి మార్పులకు (పరిణామములకు) లోనుకానిది, నేననే గుర్తు లేనిది. జీవుడు, ఈశ్వరుడు, బ్రహ్మాభావము కలిగినను, కలిగించు కొనుటకు ఎట్టి గుర్తు లేనిది. ప్రప్రథమంగా గురుముఖత: వస్తు నిశ్చయపూర్వకముగా దీనిని గుర్తించవలసి వున్నది. తరవాతి క్రమంలో గుర్తించిన గుర్తును గురువాక్యము చేత విడువ వలసి వున్నది. ఇట్టి ఆరూఢతయందు స్వత: సిద్ధమైన పరిపూర్ణము నందు నేనను జీవ భావము, నీవను ఈశ్వరభావము, నీవేనేను నేనేనీవను బ్రహ్మ భావము లేక దేహభావము జీవ భావము విడచి నిర్భావము కలిగి యుండుము.

కం॥ యే వస్తువుచేతను తానావిర్భ। వమొందుదేహ మను
తరువరయున్। ఆవస్తువెదానికివి। త్తైవెలయును దాన్నె
సాక్షిద్రష్టానికనుమీ। యెరుకయిదెస్పష్టామువినుమీ। భావించి
చూడుమీబట్టాబయులనుభూమి। యూవిత్తుచెట్టున్నద
రయూదవిత్తూనేద్రష్టానికనుమీ। యెరుకయిదె స్పష్టాము
వినుమీ॥ 146

## ప్రతిపదార్థము

ఏ వస్తువు చేతను = సమస్త సృష్టికి ఏది అత్యంత మూలకారణమైవున్నదో
తానావిర్భావము నొందు = ఆత్మ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి అను పంచభూతములుగా పరిణామము చెంది
దేహమను తరువు = దేహమను వృక్షము
అరయుగా = విచారించగ్గా, చూడగా
ఆవస్తువె = ఆకారణవస్తువె
దానికి విత్తైవెలయున్ = పైవాటికి విత్తనముగా కారణమగుచున్నది
దానినే = ఆవస్తువునె
సాక్షి = చూచువాడు
ద్రష్ట = చూడ గలిగే శక్తి నిచ్చేవాడు

కనుమీ = గుర్తించు
ఎరుక ఇదె స్పష్టము వినుమీ = ఈ గుర్తెరిగే వస్తువు ఎరుకేనని వస్తు నిశ్చయముగా తెలిసి కొనుము
భావించి చూడుమి = నీ ఉనికిని విడచి నీకు వేరైయున్నదిగా గుర్తించుము
బట్టబయలను భూమి = అచల పరిపూర్ణమనే భూమి యందు
ఆవిత్తు చెట్టు = బీజరూపమైన గుర్తు, వృక్షరూపమైన బ్రహ్మాండము
అరయదు = తెలిసికొనబడదు

## తాత్పర్యము

వస్తు నిశ్చయముగా, బీజవృక్ష న్యాయముగా విచారించినవారికి బీజము వృక్షమునకు, వృక్షము బీజమునకు ఒకదానికొకటి ఆధారమై ఎట్లు యున్నవో ఆవిధముగానే ఈజగత్తు నిర్మాణమునకు కావలసిన గుర్తు, దాని పరిణామ రూపము పంచభూతములు బీజ వృక్ష న్యాయముగా ప్రకట మగుచున్నవి.స్వత:సిద్ధమైన పరిపూర్ణము అను భూమియందు ఈ పరిణామము జరుగుచున్నదని తెలియ వలెను. ఇట్టి కారణరూపమగు గుర్తును మతవాదులు సాక్షియని, ద్రష్ట యని పేర్లు పెట్టి దీనికి అకర్తృత్వము నిర్ణయించుచున్నారు. పరిపూర్ణ బోధయందు ఈ పరిణామ క్రమమునకు ఈగుర్తె అత్యంత మూలమైనది, కారణమైనది అని తెలుసు కొనుము. ఈ కందార్థమందు బీజ స్థానము నందు బ్రహ్మము, వృక్ష స్థానమునందు పరమాత్మ మరల బీజస్థానము నందు ప్రత్యగాత్మ అను చక్రక్రమములో బీజ వృక్ష న్యాయాన్ని ప్రతిపాదిస్తూ పరిపూర్ణము యొక్క అసంగత్వమును తెలియపరుస్తున్నారు.

కం॥ యేపరిపూర్ణము మేనికి। లోపలవెలినిండియుండు
లోపములేకన్ ఆపరిపూర్ణమెజగతికి। లోపలవెలినుండు దానిలో
నెవున్నవిరా। పైరెండెవ్వి లేనివెన్నకురా। యీ పూర్ణబోధ
చె పైప్రపంచ శరీర రూపములెడబావుమీపట్లనె దానిలోనె
వున్నవిరా। పైరెండెవ్వి। లేనివెన్నకురా॥ 147

## ప్రతిపదార్థము

యే పరిపూర్ణము = స్వతఃసిద్ధమై కేవలత్వము కల్గిన పరిపూర్ణము
మేనికి = శరీరమునకు
లోపల వెలి = లోపల బయట
నిండియుండు లోపము లేకన్ = నిండి నిబిడీకృతమై ఎట్టి వెలితి లేకుండా
ఆ పరిపూర్ణమె = ఆ వస్తువె
జగతికి = పుట్టి నశించే స్వభావము కలిగిన గుర్తుకి
లోపల వెలినుండు = బాహ్యాభ్యాంతరములందు కూడా యున్నది
దానిలోనె వున్నవిరా = ఈ శరీరము, జగత్తు స్వతఃస్సిద్ధమైన పరిపూర్ణము నందె తోచుచున్నవి
పైరెండెవ్వి = ఎరుక, జగము
లేనివి = పరిపూర్ణమందు లేనివి
యెన్నకురా = ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా వీటిని విడచి యుండుము
యీపూర్ణబోధచే = వస్తునిశ్చయపూర్వకమైన ఈ ప్రబోధచే
పై ప్రపంచరూప, శరీరములు = రెండుగా తోచబడుచున్న ఎరుకనే వస్తువును
యెడబాపు మీపట్లన్ = గురుని వాక్యముచే విడిచి పెట్టుము

## తాత్పర్యము

స్వతఃసిద్ధమైన పరిపూర్ణము గుర్తెరిగే శరీరమునకు లోపల బైట నిండి నిబిడీకృతమై వున్నది. ఆ పరిపూర్ణమే జగత్తుయొక్క వెలుపల లోపల కూడా వ్యాపించి ఉన్నదని తెలియుము. అందు చేత ఉన్నపరిపూర్ణము నందు శరీరము, జగత్తు లేని వగు చున్నవి. అందుచే వీటిని ద్వాదశి, షోడశి వాక్యముల ద్వారా లేనివిగా (దృఢ పరచుకొనుము ) గ్రహించుము. గురు వాక్యము చేత వున్నది పరిపూర్ణమని దానియందు లేక తోచు ఎరుక లేనిదని దృఢ పరచుకొనుము. ఈ విడిచిపెట్టు విధానమునకు ఎట్టి ఆలస్యము చేయకుము అని తెలియ వలెను.

కం॥ యెరుకనగా యెరిగేటిది। మరుపనగా యెరుకతనను మరచుట
యీరెం। ట్నెరుగనిదె బయలివి నీ। వెరిగెరు కనుమరుపు
నిప్పు। డెరుకాచెవిడరా వీడితె పైమా। టెరిగెదెవ్వడురా। యెరుకే
పరిపూర్ణమం। చెదిరించి వదిరేవు। పరిపూర్ణమైతె చూపర
బయలందున దాన్ని। యెరుకా చె విడరా। వీడితె పైమాటెరిగె
దెవ్వడురా॥ 148

## ప్రతిపదార్థము

ఎరుక అనగా ఎరిగేటిది = గుర్తు అనగా తనతో సహా సమస్తము తెలుసుకునే లక్షణము కల్గినది

మరుపనగా ఎరుక తనను మరచుట = ఇతరమైనవన్నియు స్పృహ కలిగివుండి తన పూర్వపు స్థితిని మరచిపోవడం

ఈ రెంట్నెరుగనిదే బయలు = ఈ విధమైన ఎరుక మరపులు లేనిదె పరిపూర్ణ పరబ్రహ్మము

ఇవి నీవెరిగి = ఈ విధముగా వస్తు నిశ్చయ పూర్వకముగా గురునిచే ఇవి గుర్తించి

ఎరుక మరపులు = ఎరుక యొక్క స్థితి గతులు

ఇప్పుడెరుకాచెవిడరా = గురువాక్యము ( ద్వాదశి, షోడశి ) ద్వారా విడచి వుండుము

వీడితె = విడిచిపెట్టబడితే

పై మాటెరిగే దెవ్వడురా = ఆ పైన స్వత:సిద్ధమైన పరిపూర్ణమును ఎవరు గుర్తించి వర్ణిస్తారు

ఎరుకే పరిపూర్ణమం చెదిరించి వదిరేవు = పైన చెప్పిన క్రమంలో కాక జగదధిష్టానమైన బ్రహ్మమును పరిపూర్ణమని భావించకుము

పరిపూర్ణమైతే చూపరా బయలందున = నీ నిర్ణయ విధానము సరియైనది ఐనచో నే చెప్పిన విధముగా నీ స్థానమును విడచి పరిపూర్ణమును చూపుము.

## తాత్పర్యము

ఎరుకను వస్తు నిశ్చయ పూర్వకముగా వివరించుటలో సర్వమునందు తాను తనయందు సర్వము ఉన్నదని గుర్తించగలుగు గుర్తే ఎరుక యొక్క వాస్తవికస్థితి అని " అనేకం బహుస్యాం " అను సృష్టి సంకల్పముచే అనేకముగా మారి తనస్థితి నుండి జారి, తన ఉనికిని మరచి జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందినది. మరుపు రూపముగాను ఇందు పేర్కొనబడుచున్నది. ఈ పద్ధతియందు రూపాయికి బొమ్మ బొరుసుల వలె ఎరుకను వస్తువునకు ఎరుక, మరుపు అను రెండు లక్షణములు (స్థితి గతులుగా) చెప్ప వచ్చును. ఇది అత్యంత గురు రహస్యమైన అంశము. గురుముఖత: మాత్రమే విచారించ తగియున్నది. ఇట్టి ఎరుక, మరుపులు లేనిది పరిపూర్ణము. ఈ విధముగా వస్తునిశ్చయ పూర్వకముగా పరిపూర్ణము, ఎరుక, మరుపు గురునిచే గుర్తించిన గుర్తు ద్వారా ఎరుక, మరుపులను విడిచి వుండుము. విడిచిన మీదట ఆపై అంశమైన పరిపూర్ణము ఉన్నదని నిర్ణయించుటకు నిర్ణయించువారే లేకుండును. ఇట్టి ఆరూఢత చెందకుండా మత వాదుల నిర్ణయం ప్రకారం సృష్టి కారణమైన ఎరుకనే పరిపూర్ణమని నీవు వాదించిన ఎడల నే ప్రబోధించిన విధానముచే నిన్ను విడచి పరిపూర్ణము యొక్క ఉనికిని, ఎరుక యొక్క స్థితిని విడమరచి చెప్పుము.

కం॥ లేదనన్నను కనపడుగద। నేదెలసితిననిన బైటనే నిల్వగదా।
నేదీనివెనుకగదనా। కేదోమూలంబుయిదిగా। దిక లేదెచ్చోటా।
కనుకనె వుళ్లి। క్కినేనన్మాటా। యేదిలేదిదిదప్పనే దెలియనిది
యని తాదెలుసుకొని యెరుకె। తననువీడితె జాలు। యికలే
దెచ్చోటా। కనుకనె వుళ్ళు। క్కి నేనన్మాటా॥ 149

## ప్రతిపదార్థము

లేదన్నను కనపడుకద = స్వత:సిద్ధమైన పరిపూర్ణము లేదనుటకు వీలుకాదు
నే తెలిసితి ననిన = నాగుర్తుకు అనుభవము లోనికి వచ్చినవి అనుటకు
బయటనే నిల్వగదా = తనస్థానమును తాను విడిచిపెట్టి బైటికి వచ్చినపుడు

లేకపోవుచున్నది కదా
నేదీని వెనుక గదా = పరిపూర్ణమునకు ఎరుకకు ఎట్టి సంబంధము లేదుకదా
నాకేదో మూలంబు = అన్నింటినీ గుర్తించేనాకు మూలముగాని స్థానముగాని ఇంకొకటి లేదు
ఇదికాదు = ఉన్నపరిపూర్ణము మూలముకాదు
ఇకలేదెచ్చోట = వేరే మూలమేమీ లేదు
కనుకనే = అందుచేతనే
వుళ్ళుక్కి నేనన్మాట = నేననే వస్తువు లేనిదన్నమాట
ఏదీలేదు ఇది తప్ప = పరిపూర్ణము తప్ప ఇతరమైనదేమీలేదు
నేతెలియనిదని = గురువాక్యము రీత్యా ఉన్నదనే నిర్ణయము గాని నాకు నేనుగా గ్రహించలేనిది
అనితా తెలుసుకొని = పైవిధముగా గట్టిగా దృఢ పరచుకొని
ఎరుకే తనను వీడితె చాలు = గుర్తించే ఎరుకే తనను తాను గురువాక్యముచే వీడితే చాలు

## తాత్పర్యము

స్వత:సిద్ధమైన పరిపూర్ణము లేదని చెప్పుటకు వీలు కాదు. అట్లని నేను గుర్తించితినను మాటలు పనికిరావు. ఏలననగా అది వున్నదని గుర్తించిన తానే దానియందు లేక పోవు చున్నది. పై రెంటికి ఏవిధమైన సంబంధము లేదు. అన్నిటికి మూలమైన తనకు ఉన్న పరిపూర్ణము మూలము స్థానము కాదు. వేరే వస్తువు మూలమున్నదని అనుటకు లేదు. అందు చేతనే మూలం లేని గుర్తెరిగే శరీరం అని చెప్పవలసి వచ్చెను. పరిపూర్ణము తప్ప ఇక రెండవదానికి వునికిలేదు. గుర్తించే తెలివికి అనుభవం కానిది అని తనకు తానుగా గురువాక్యం చేత ఆరూఢపరచుకొని తన గుర్తును తాను విడిచివుంటే చాలు.

కం॥ సత్యమగు బట్టబయలు న। సత్యంబగు। యెరుక నెరిగి
సద్గురుకృపచే। సత్యముగాదని యెరుకను। సత్యముగా
నమ్మివుంటె। చాలుచాలన్నా। వానితోటి। సాటెవ్వరన్నా నిత్యా

**నిత్యములానె నిర్ణాయుమెరుగాక। నిత్యాడై యుండేటి**
**నిజబోధగలిగితె। చాలుచాలన్నా। వానితోటి సాటెవ్వరెన్నా॥ 150**

## ప్రతిపదార్థము

సత్యమగు బట్టబయలు = స్వతఃసిద్ధమైన పరిపూర్ణము వున్నదని
అసత్యంబగు ఎరుక=దానియందు మూలము గాని స్థానముగాని లేని ఎరుక
ఎరిగి = వస్తునిశ్చయముగా గుర్తించి
సద్గురు కృపచే = గురుమూర్తి అనుగ్రహంద్వారా
సత్యము గాదని ఎరుకను = మూలము లేని గుర్తెరిగే శరీరం ఏమీలేదని
సత్యముగా నమ్మి వుంటే = ఎటువంటి సందేహం, అనుమానం
లేకుండా వున్నదున్నట్లుగా ఆరూఢపరచుకొంటే
చాలుచాలన్నా = సర్వభ్రాంతి రహిత స్థితి కలుగగలదు
వానితోటి సాటెవరన్నా=అట్టి ఆరూఢతగలవారితో పోల్చదగిన వారెవ్వరూ లేరు
నిత్యానిత్యములనే నిర్ణయమెరుగక = నిత్యమైనది పరిపూర్ణము,
అనిత్యమైనది ఎరుక అని గుర్తించే గుర్తును కూడా విడిచివుండి
నిత్యుడై యుండేటి = పరిపూర్ణముతో సమానమైన ఉనికి కల్గి
నిజబోధ కలిగితే = ఉన్నతమైన పరిపూర్ణభావము దృఢపరచుకో గల్గితే

## తాత్పర్యము

స్వతఃసిద్ధమై నిత్యమై యున్నది పరిపూర్ణము. దానియందు మూలము గాని స్థానముగాని లేకనే వున్నది ఎరుక. ఈ రెండంశములు గురుకృపచే వస్తు నిశ్చయ పూర్వకముగా దృఢపరచుకొని, అట్టి గుర్తును కూడా నిస్సందేహముగా విడచివుండుట చాలా అవసరమై యున్నది. జన్మ కర్మల భ్రాంతి విధానమునకు ఇట్టి ఆరూఢత సరిపోవును. ఇట్టి ఆరూఢత గలవానితో పోల్చదగిన వారెవ్వరూ లేరు. పరిపూర్ణము వున్నది ఎరుక లేనిది అను నిర్ణయము చేయక గురువాక్యముచే (షోడశి) గుర్తును విడచి, స్వతఃసిద్ధమైన పరిపూర్ణము నందు ఉనికి గల్గి ఉండే స్థితి యందు జీవించ గలిగి వుండినచో చాలును.